ఆంధ్రజ్యోతి

ప్రచురణ

www.navyaweekly.com

# నవ్య

వీక్లి

29-3-2017

₹:20



- మరణించిన మనిషితో మూడుముళ్లబంధం
- ఊపిరి ఉన్నప్పుడే!

## సరదాగా....

### నువ్వు తీసుకో

అంజిపండుకి హార్టెటాక్ వచ్చింది. హాస్పిటల్‌లో అడ్మిట్ చేశారు ముగ్గురు కొడుకులు. సమయం మించిపోయింది, ఇక ఎక్కువసేపు బతకడన్నారు డాక్టర్లు. లావాదేవీలు ఏమయినా ఉంటే ఇప్పుడే సెటిల్ చేసుకోండి అంటూ ఉచిత సలహా కూడా ఇచ్చారు.

ముగ్గురు కొడుకులూ తండ్రి బెడ్‌పక్కకి వెళ్లి నిల్చున్నారు. మెల్లగా కళ్ళిప్పిన అంజిపండు పెద్దకొడుకును పిలిచి, “ఆ పార్కు పక్కన ఉన్న పది ఇళ్ళు నువ్వు తీస్కో” అన్నాడు.

రెండో కొడుకుతో, “ఆ బీచ్ రోడ్డులో ఉన్న పది ఇళ్ళు నువ్వు తీస్కో” అని, మూడో కొడుకుతో, “ఆ మల్టీప్లెక్స్ రోడ్డులో ఉన్న పదిహేను ఇళ్ళు నువ్వు తీస్కో” అన్నాడు.

ఇదంతా వింటున్న నర్సు మూడోవాడి దగ్గరకు వచ్చి, “నువ్వు అదృష్టవంతుడివి. మిగిలిన ఇద్దరి కన్నా నీకే ఎక్కువ ఇచ్చాడు మీ నాన్న” అంది.

దానికి మూడోవాడు “అదృష్టమా పాడా... ఆయన మాకిచ్చినవి రోజూ పొద్దున్నే ఆయన పేపర్ వేసే ఇళ్ళ వివరాలు..” అంటూ అక్కడి నుంచి బయటపడ్డాడు.

### ఒక ప్రశ్న?

రామాపురంలో ఉండే సీతయ్య, లక్ష్మయ్య ప్రాణ స్నేహితులు. రోజూ రచ్చబండ దగ్గర చేరి పిచ్చాపాటి మాట్లాడుకోవడం వారికి అలవాటు. ఆ మాటల్లో రాజకీయాల దగ్గర నుంచి మెదడుకు పదును పెట్టే ఎన్నో విషయాలు దాగుంటాయి. ఎప్పటిలాగానే వారిరువురూ మాట్లాడుకుంటుండగా సీతయ్య లక్ష్మయ్యను సడెన్‌గా “అనగనగా ఇద్దరు అన్నదమ్ములు కలిసి 12,000 రూపాయలతో వ్యాపారాన్ని ప్రారంభించారు. ఏడాది చివర వచ్చిన మొత్తం లాభం 1800లో పెద్దోడి వాటా 750 రూపాయలు. అయితే పెద్దవాడు ఎంత పెట్టుబడి పెట్టి ఉండవచ్చు?” అని ప్రశ్నించాడు. ఆప్రశ్నకు లక్ష్మయ్య చాలాసేపు ఆలోచించి సరైన సమాధానాన్ని చెప్పాడు. అలా ఆరోజు ప్రశ్నలతో వారి ముచ్చట్లు గడిచిపోయాయి. ఇంతకీ లక్ష్మయ్య చెప్పిన జవాబేంటో మీరూ తెలుసుకోండి?

### సమాధానం

రామయ్య పైన చెప్పిన లెక్కలోంచి ముందుగా తమ్ముడి వాటా కనుక్కున్నాడు.

తమ్ముడి వాటా = 1800–750 = 1050

లాభంలో అన్నదమ్ముల వాటా నిష్పత్తి = 750: 1050 = 5 : 7 అనుకుంటే

అన్నదమ్ముల పెట్టుబడులు కూడా 5:7 నిష్పత్తిలోనే ఉంటాయి. పెట్టుబడి మొత్తం 5 + 7 = 12 భాగాలు అనుకుంటే అందులో అన్నయ్య పెట్టుబడి 5 భాగాలు.

అన్నయ్య పెట్టుబడి మొత్తం లెక్కకట్టగా = 5/12 * 12000 = 5000

ఆ రకంగా అన్నయ్య పెట్టిన పెట్టుబడి 5000 రూపాయలని లెక్క కట్టి చెప్పాడు లక్ష్మయ్య.

# తీన్‌మార్

బాచి

ఆవిడేమో నా మొదటి భార్య.. ఈవిడ మొన్న 'వాలంటైన్ డే' నాడు పార్కులో నా పక్కన వాకింగ్ చేస్తూవుంటే ఎవరో 'దళ్' వాళ్ళట మా యిద్దరికీ పెళ్ళి చేసేశారు...

సారూ తొందరపడకండి... నేను పొరపాటున బోర్డు తిరగేసి వివరించాను...!!

పెళ్ళయిన కొత్తలో 'వంట చేయడం కూడా బ్రహ్మవిద్యేనా!' అని మావిడ దబర చూశానోయ్!!



8

## 'ఊపిరి' ఉన్నప్పుడే!

అమెరికా స్టాన్‌ఫోర్డ్ వైద్యుడు, శాస్త్రవేత్త, రచయిత పాల్ కళానిధి. అకాలమృత్యువు తలవాకిట నిలిచిన వేళ పాల్ తన జీవితానుభవాల్ని ఆవిష్కరించుకున్న అద్భుత రచన 'వెన్ బ్రీత్ బికమ్స్ ఎయిర్'. బిల్‌గేట్స్ అంతటివాడిచేత కంటతడి పెట్టించిన ఆ పుస్తకం గురించి మీరూ తెలుసుకోండి.

42

### సరికొత్త భావజాలానికి ఊపిరి రంగస్థలమే!

డెబ్బైనాలుగేళ్ళుగా రంగస్థల అభివృద్ధికి సేవలు అందిస్తున్నారు ప్రొఫెసర్ మొదలి నాగభూషణశర్మ. మార్చి 27 ప్రపంచ రంగస్థల దినోత్సవం సందర్భంగా ఆయన ఇంటర్వ్యూ...

72

### ఇంటర్వ్యూ

నాలుగు దశాబ్దాలుగా వంద చిత్రాలు చేసిన నంది అవార్డుల బహుభాషా నటి ప్రభ. ఏఎన్నార్ ఓ బడి, ఎన్టీఆర్ ఓ గుడి అంటున్న ఆమె ఇంటర్వ్యూ..

## సీరియల్స్



## కథలు



## ఫీచర్స్



ముఖచిత్రం: అంజలి
ఫొటో: గోపీకృష్ణ


రచనలు, కథలు పంపవలసిన చిరునామా
నవ్య వీక్లి, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్33. email: navyaweekly@andhrajyothy.com





### కాదు

ఆలయాలు మూసి, పూజారులిద్దరూ ఇంటిదారి పట్టారు. మార్గమధ్యంలో వారికి ఓ తాగుబోతు తగిలాడు. మొదటిపూజారితో తాగుబోతు అన్నాడిలా.

"నీకో సంగతి తెలుసా? నేను దేవుణ్ణి."

"కాదు బాబూ! నువ్వు దేవుడివి కాదు."

"ఉండెహె! నీకు తెలీదు." అని రెండో పూజారితో అన్నాడిలా.

"నేను దేవుణ్ణి, అవునా? కాదా?"

"కాదు బాబూ"

"నేను దేవుణ్ణని నిరూపిస్తాను, నాతో రండి." అని పూజారులిద్దరినీ వెంటబెట్టుకుని బార్‌కి చేరుకున్నాడు తాగుబోతు. అతన్ని చూస్తూనే అక్కడి బార్టెండర్ అన్నాడిలా.

"దేవుడా, మళ్ళీ వచ్చావేంటి?"

### చెవిరింగు

మగాళ్ళు ఇయర్‌రింగ్స్ ఎప్పటి నుంచి పెట్టుకుంటున్నారో తెలుసా? తెలియకపోతే చదివి, ఆనందించండి.

ఆఫీసులో కునుకు తీస్తూ మెల్లగా కళ్ళు తెరిచాడు సుబ్బారావు. ఎదురుగా పని చేసుకుంటున్న కాంతారావుని చూశాడు. నమ్మలేకపోయాడు. కళ్ళు పెద్దవి చేసుకుని చూశాడు మళ్ళీ. కాంతారావు చెవిరింగులు పెట్టుకుని కనిపించాడతనికి. సంప్రదాయవాది కాంతారావు. ఫ్యాషన్స్‌కి దూరంగా ఉంటాడు. అలాంటిది చెవిరింగులు పెట్టుకున్నాడంటే...విషయం అంతుచిక్కలేదు సుబ్బారావుకి. లేచి పరుగుదీశాడు. కాంతారావుని చేరుకున్నాడు. అతన్ని పట్టుకుని కుదిపేస్తూ అన్నాడిలా.

"చెవిరింగులు నువ్వు పెట్టుకున్నావంటే నేను నమ్మలేకపోతున్నాను."

"చెవిరింగులు కాదు, చెవిరింగు, ఒకటే " అని తన చెవికి ఉన్న రింగును చూపించాడు కాంతారావు.

"సరే, చెవిరింగొకటే పెట్టుకున్నావు, ఇదెప్పటి నుంచి అలవాటు చేసుకున్నావు?"

"నా కారులో మా ఆవిడకి ఈ రింగు దొరికినప్పటి నుంచీ." చెప్పాడు కాంతారావు.

### తీన్‌మార్

కరెంటుబిల్లు కట్టమని తండ్రి ఇచ్చిన అయిదు వందలతో కాలనీలో లాటరీటిక్కెట్ కొన్నాడు కుమార్. లాటరీ తగిలితే హోండా టూవీలర్ గెలుచుకోవచ్చు. ఆ సంగతే ఇంటికి వచ్చి తండ్రికి చెప్పాడు. అంతే ఆ చెంపా ఈ చెంపా వాయించేశాడు తండ్రి.

ఆ రాత్రి గడిచి, తెల్లారింది. తలుపు తీసి చూస్తే ఇంటికి ఎదురుగా సరికొత్త టూ వీలర్ ఉంది. అది చూసి కుమార్‌సహా అంతా గట్టిగా అరిచారు. ఎందుకంటే కరెంటు కట్ చేయడానికి దాని మీద ఇద్దరు ఉద్యోగులు వచ్చారు. దాంతో మళ్ళీ కుమార్‌కి తీన్‌మార్ తప్పలేదు.

–వైనతేయ

www.navyaweekly.com

పుస్తక పఠనం ఎంతటి బాధనయినా మరపిస్తుంది.

నవ్య

సంపుటి: 14 సంచిక: 4

29-3-2017

మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ



# మొదటి పేజి

## దేవుడు

దేవుడంటే నాకు పడదు. అసహ్యం. కోపం. చాలాసార్లు నేను ఆయన్ని తిట్టాను. మతి లేదన్నాను. మహత్తు లేదన్నాను. దేవుడివే కాదన్నాను. ఎందుకు కాదన్నానంటే... ఆ రోజు నా పుట్టినరోజు. పొద్దునే అమ్మ తలంటింది. దిష్టి తీసింది. పాయసం తాగించి, నాన్న కొనిపెట్టిన కొత్త డ్రెస్ వేసింది. నాన్నకి దండం పెట్టమంది. పెట్టాను. దగ్గరగా తీసుకుని కౌగిలించుకున్నారు నాన్న. ముద్దుపెట్టుకున్నారు. ఐస్క్రీం కొనుక్కోమని డబ్బులిచ్చారు. స్కూలుకి వెళ్ళనన్నాను ఆరోజు. వెళ్ళకు! ఇంట్లోనే ఉండు, అమ్మతో ఆడుకో అన్నారు. సాయంత్రం నేను ఆఫీసు నుంచి వచ్చాక అందరం కలిసి గుడికి వెళ్దాం అన్నారు. అలాగేనన్నాను. అమ్మతో క్యారమ్స్ ఆడుకుంటూ సాయంత్రం వరకు గడిపాను. నాన్న వచ్చే వేళయింది. అమ్మా, నేనూ గుడికి వెళ్ళేందుకు తయారయ్యాం. వేళ దాటిపోయింది. నాన్న రాలేదు. రాత్రి ఎనిమిది అయింది. తొమ్మిది అయింది. పది అయింది. నాన్న రాలేదు. అమ్మ ఆందోళన పడుతోంది. అప్పుడు వచ్చారు నాన్న. శవమై అంబులెన్స్‌లో వచ్చారు. ఏమైంది ఏమైంది అంటే...ఎవరో కానుకగా ఇచ్చిన దేవుడిపటాన్ని తాను కూర్చునే సీటు దగ్గరగా గోడకి పెడుతూ కుప్పకూలిపోయారట నాన్న. కార్డియాక్ అరెస్టట! ఆసుపత్రికి తీసుకుని వెళ్ళినా ఫలితం లేకపోయిందన్నారు. చనిపోయారన్నారు. అప్పుడు దేవుడంటే మొదటిసారిగా కోపం వచ్చింది. పరిగెత్తుకెళ్ళి గదిలో ఉన్న దేవుణ్ణి కళ్ళెర్రజేసి చూశాను.

నాన్నపోవడంతో అమ్మే నాన్నయింది. అష్టకష్టాలూ పడి నన్ను పెంచుకొచ్చింది. అయినవాళ్ళు చేరదీయకపోవడంతో, కానివాళ్ళు కసరికొట్టడంతో దేవుణ్ణే నమ్ముకుంది అమ్మ. అన్నిటికీ వాడే ఉన్నాడనేది. ఆ మాట నాకు నచ్చేది కాదు. ఆరోజు ఏకాదశి. అమ్మ ఉపవాసం ఉంది. పచ్చి మంచినీళ్ళు కూడా ముట్టుకోలేదు. సాయంత్రం దేవుణ్ణి దర్శించుకునేందుకు గుడికి వెళ్తూ యాక్సిడెంట్‌లో పోయింది. గుడికి దగ్గరగా కారు యాక్సిడెంట్‌లో అమ్మ చనిపోయింది. దేవుడంటే నాకు అసహ్యం కలిగిందప్పుడు. నాన్న లేడు. అమ్మ లేదు. దేవుడు లేడు. ఒక్కణ్ణే! డిగ్రీ పూర్తి చేశాను. పిజి చేశాను. ఉద్యోగినయ్యాను. పెద్ద ఆఫీసర్నయ్యాను.



అప్పుడే నాకు పద్మతో పరిచయం కలిగింది. ఆఫీసులో కొత్తగా జాయినైంది పద్మ. అందంగా ఉండేది. బాగుండేది. మెత్తగా మాట్లాడేది. ప్రతిమాటకి ముందూ 'దేవుడి దయవల్ల' అంటూ ఉండేది. ఆ మాట వినలేకపోయేవాణ్ణి. వింటే శరీరం మీద తేళ్ళూ, జెర్రులూ పాకుతున్నట్టు ఉండేది. అయినా పద్మంటే ఇష్టపడ్డాను. ప్రేమించాను. పెళ్ళి చేసుకుంటానన్నాను. సరేనన్నది పద్మ. పెళ్ళి తిరుపతిలో చేసుకుందాం అంది. వద్దన్నాను. కాదు కాదంది పద్మ. పట్టుబట్టింది. తప్పనిసరై తిరుపతిలో పెళ్ళికి ఒప్పుకున్నాను. పొద్దునే కారులో తిరుపతికి బయల్దేరాం. కారులో పక్కపక్కనే కూర్చుని కబుర్లాడు కుంటున్నాం. నవ్వుకుంటున్నాం. కబుర్లాడుతూ ఆడుతూ, నవ్వుతూ నవ్వుతూ అంతే! చనిపోయింది పద్మ. ఏమైందన్నది డాక్టర్లకి కూడా అంతుచిక్కలేదు. అప్పుడే దేవుడికి మతిలేదన్నాను. మహత్తు లేదన్నాను. దేవుడివి కాదన్నాను. తిట్టాను. అప్పటి నుంచే దేవుడంటే నాకు పడకుండాపోయింది. నేనేది కావాలనుకుంటే, నాకేది ఇష్టమైతే దాన్ని దూరం చెయ్యడమే దేవుడి పని. అలాంటి దేవుణ్ణి క్షమించకూడదనుకున్నాను. అమ్మలేదు. నాన్నలేడు. పద్మలేదు. పెళ్ళిలేదు. ఒంటరివాణ్ణి అయిపోయాను.

ఒకరోజు కావాల్సిన సామాన్లకోసం ఓ షాపుకి వెళ్ళాను. సామాన్లు ఒకొక్కటీ ఏరుకుంటూ దారికి అడ్డంగా నిల్చున్న తండ్రీకూతుళ్ళను చూశాను. పాపకేమో ఆరేడు ఏళ్ళుంటాయి. బొమ్మ కావాలని అడుగుతోంది తండ్రిని. ఖరీదు చూసి కష్టం అని వద్దంటున్నాడు తండ్రి. ఏడుపందుకుంది పాప. ఏడుస్తూ ఐ హేట్ యు అంది తండ్రిని. అతన్ని కొట్టింది. తండ్రి కోపగించుకుంటాడనుకున్నాను. అరుస్తాడనుకున్నాను. తిరగబడతాడనుకున్నాను. అతను అవేవీ చేయలేదు సరికదా, నవ్వుతూ పాపని దగ్గరగా తీసుకున్నాడు.

నన్నిప్పుడు నువ్వు హేట్ చేసినా తర్వాత తర్వాత ప్రేమిస్తావు. నాకు తెలుసు! పద అన్నాడు. ఏడుస్తున్న పాపని పట్టుకుని అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు. నన్నెవరో గట్టిగా చరిచినట్టయింది. మేల్కొలిపినట్టయింది. మనసేదోలా అయిపోయింది. ఎందుకో కన్నీళ్ళొచ్చాయి. భగవాన్ అనాలనిపించింది. అరవాలనిపించింది. అంతలో మా ఆఫీసుక్లర్క్ కలిశాడు. నన్ను పర్మినెంట్ చేశార్సార్! మీ ఋణం తీర్చుకోలేను అన్నాడు. మీరు దేవుడు సార్ అన్నాడు. నమస్కరిస్తూ నిల్చున్నాడు. అవాక్కయ్యాను.

నవ్య




## టెకీల వ్యవసాయం

సాఫ్ట్‌వేర్ ఇంజనీర్లంటే ఎంతసేపూ కంప్యూటర్ల ముందు కూర్చొని కీబోర్డు మీద టకటకలాడిస్తూ, వీకెండ్స్‌లో పబ్‌లు, పార్టీలంటూ తిరుగుతారనుకుంటే పొరబాటేనంటున్నారు బెంగళూరుకు చెందిన మాన్యతా టెక్ పార్కు ఉద్యోగులు. ఎప్పుడూ ఆఫీసు వర్కే కాకుండా ఆరోగ్యం కోసం, పర్యావరణం కోసం కాసేపు టైం కేటాయించలేమా? అన్న ఒక్కచిన్న ఆలోచన వాళ్ళను మోడరన్ రైతులుగా మార్చింది. ప్రాజెక్టులు చేస్తూనే, ఆఫీసు క్యాంపస్‌ని కాస్తా పొలంగా మార్చేశారు.

ఈ ఐడియా మొదట కంపెనీ ల్యాండ్‌స్కేప్ డిపార్ట్‌మెంట్ నుంచి వచ్చింది. పైలట్ ప్రాజెక్ట్ చేపట్టారు. ఉద్యోగుల నుంచి అనూహ్య స్పందన వచ్చింది. టెకీలంతా రెట్టించిన ఉత్సాహంతో ఖాళీ సమయాల్లో పొలం పనులు చేయడం మొదలుపెట్టారు. మట్టిలో దిగడం నామోషీగా ఫీలవడం లేదు. బట్టలు పాడవుతాయని వెనుకడుగు వేయడంలేదు. పైగా గర్వంగా ఫీలవుతున్నారు. నీళ్ళకొరతను దృష్టిలో పెట్టుకుని



డ్రిప్ ఇరిగేషన్ పద్ధతిన సాగుచేస్తున్నారు. ఎండిపోయిన ఆకులు, పనికిరాని గడ్డితో ఎరువులు తయారుచేస్తున్నారు.

110 ఎకరాల సువిశాలమైన టెక్ క్యాంపస్‌లో 15 ఎకరాలు మొదట గార్డెనింగ్ కోసం కేటాయించారు. దాన్నిప్పుడు వ్యవసాయం కోసం మడులుగా తయారుచేశారు. 144 ప్లాట్స్‌గా విభజించి మొక్కజొన్నలు, సజ్జలు, ఆకుకూరలు, కూరగాయలు పండిస్తున్నారు. కావలసిన విత్తనాలు, ఎరువులు అన్నీ యాజమాన్యం చూసుకుంటుంది. గార్డెనింగ్ స్టాఫ్ పర్యవేక్షణలో ఉద్యోగులు పంటల బాధ్యత చూసుకుంటారు. అవసరమైతే వాళ్ళ సాయం తీసుకుంటారు.

వాస్తవానికి చాలామంది గార్డెనింగ్ అంటే ఇష్టపడతారు. కానీ పట్టణీకరణ పెరిగిపోయి, స్థలాభావం మూలంగా అది కలగానే మిగిలిపోతుంది. అలాంటి పరిస్థితుల్లో ఆఫీసులోనే గార్డెనింగ్ చేయడమనేది గ్రేట్ ఫీలింగ్ అంటున్నారు ఉద్యోగులు.

గతంలో ఎక్కడా ఎవరూ చేయని ఈ ప్రయత్నాన్ని వారు చేస్తున్నందుకు ఎంతో గర్వంగా ఉందంటున్నారు అక్కడి ఉద్యోగులు. క్యాంటీన్‌లో పనికిమాలిన కబుర్లు చెప్పుకోవటం కంటే, ఇలా గార్డెనింగ్ చేయడం ఎంతో థ్రిల్లింగ్‌గా ఉందని అంటున్నారు. అన్నట్టు ఆఫీస్ క్యాంపస్‌లో పండించిన వాటిని ఎంచక్కా ఇంటికి కూడా తీసుకుని పోవచ్చు. ఈ ఐడియా బావుంది కదా. నవ్య

# మెయిల్ బాక్స్

### ఉమెన్స్‌డే కథనం బాగుంది

ఈ వారం నవ్య వీక్లీ సరికొత్త విశేషాలతో ఆకట్టుకుంది. మహిళా దినోత్సవం సందర్భంగా అందించిన ప్రత్యేక కథనం బాగుంది. ఆ నేపథ్యం, పురుషాధిక్య ప్రపంచం గురించి చక్కగా వివరించారు. ఆధునిక కర్మయోగి రాందేవ్‌బాబా గురించి ఎన్నెన్నో విషయాలు తెలుసుకున్నాం. ఘంటసాల అవధానాలతో ఎంతో పేరుగాంచిన రహమతుల్లా గారి గురించి తెలుసుకుని ఆశ్చర్యానికి గురయ్యాం. మార్నింగ్ కాఫీ చాలా మధురంగా ఉంది. ఇక సీరియల్స్ ఆసక్తిదాయకంగా సాగుతుండగా, కథలు ఆకట్టుకున్నాయి.

*–నీలిమ సబ్బిశెట్టి, రాజానగరం. తూర్పుగోదావరిజిల్లా*

### బెదురు పుట్టిస్తున్న రాందేవ్

అను ఇమ్మాన్యుయేల్ ముఖచిత్రంతో వచ్చిన సంచిక బాగుంది. రాందేవ్ ఆరోగ్యం, వైద్యం, యోగ్యత, దేశభక్తి అనంతం. పతంజలి ప్రోడక్ట్ జగత్ ప్రసిద్ధమై విదేశీ కంపెనీలకు బెదురుపుట్టిస్తోంది. రాజశుక రివ్యూలు బాగా రాస్తున్నారు. రాజ్యాంగ విశ్లేషణ బాగుంది.

*–వాస్తు రామచంద్ర, రాంజీనగర్, నెల్లూరు*

### ఆ పాత మధురం 'ఓ అమ్మ కథ'

మార్నింగ్ కాఫీ ఛీ అంశం ద్వారా పిల్లల మనసులలో కొన్ని భావాలు సుస్థిరమైపోయి ఉంటాయని తెలిసినట్టయింది. మొదటిపేజీ తాతయ్యగారి అనుభవం, లౌక్యం, చాకచక్యం ఆదర్శనీయంగా ఉన్నాయి. ముసురుతున్న చీకట్లు ద్వారా మారుతున్న రోజులు.. కనుమరుగైపోతున్న ఆపాత మధురాల క్షణాల్ని హృదయానికి హత్తుకునేలా అక్షరీకరించారు 'ఓ అమ్మ కథ' కథాకర్త పెయ్యేటి శ్రీదేవి. ఆవిడకు అభినందనలు. ఆరోగ్యమే మహాభాగ్యం ద్వారా ఎంత ఒంటికి మంచిదైనా అతి పనికిరాదని తెలుస్తోంది. రాంపా సరదా కథలు వారంవారం చదువుతున్నాం. సీరియల్స్ వేటికవే సాటిగా కొనసాగుతున్నాయి.

*–నేమాన సుభాష్‌చంద్రబోస్, విశాఖపట్నం*

### ప్రతివారం నవ్య కొంటున్నా

నవ్య వీక్లీ ఇంతకుముందు కొనలేదు. ఎలా ఉంటుందో చూద్దాం అని ఒకసారి కొన్నాను. పత్రిక చూశాను. చాలా బాగుంటుందనిపించింది. అప్పటి నుండి ప్రతివారం నవ్య వీక్లీ కొంటున్నాం. వీక్లీలో అన్ని రచనలూ బాగుంటున్నాయి. ఆసక్తిగా చదివిస్తున్నాయి. సినీవాలి ఎంతో నచ్చింది. సరదా కథలు ఆకట్టుకుంటున్నాయి. కార్టూన్లు భలే నవ్విస్తున్నాయి.

*–ఎస్.టి.పి.రంగనాయకమ్మ, విజయవాడ*

### అలరించిన 'ఘంటసాల' రహమతుల్లా

జన్మతః ముస్లిం అయినా ఘంటసాలపై అభిమానం పెంచుకుని ఘంటసాల అవధానాలు నిర్వహిస్తూ జాతీయ రికార్డు సృష్టించిన వైద్య నిపుణుడు రహమతుల్లా సంగతులు అలరించాయి. మహిళా దినోత్సవం సందర్భంగా విభిన్న రంగాల్లో భారతీయ మహిళల విజయమాలగా గుదిగుచ్చిన ఆడదే ఆధారం వ్యాసం ఆకట్టుకుంది. యోగా గురువుగానే కాకుండా ఔషధాలు, సౌందర్యపోషకాలు తయారుచేస్తూ అంతర్జాతీయ సంస్థల్ని దడదడలాడిస్తున్న రామ్‌దేవ్‌బాబా విషయాలు స్ఫూర్తిమంతంగా ఉన్నాయి.

*–ప్రసాద్, గొడారిగుంట*

### హాస్యానంద డోలిక రాంపా కథల మాలిక

సరదా కథలు వారం వారం చదువుతున్నాం. సున్నితమైన హాస్యం పండిస్తున్నారు. ఇటీవలి కాలంలో అలాంటి సున్నితమైన హాస్యం చదువు కోలేదు. కడుపునిండుగా ఉంది. లేటెస్ట్ సంచిక చదివాను. ఇచా ఇచె కథ సుత్తి వీరభద్రరావును




గుర్తుకు తెచ్చింది. అప్పులిచ్చేందుకు అగ్ని పరీక్ష పెట్టడం, సుత్తి వీరభద్రరావును గెలిచి లోపలికెళ్ళి అప్పు తీసుకెళ్ళాలనే కాన్సెప్ట్ ఎంతో బాగుంది. పాతతరంనాటి సునిశితమైన హాస్యాన్ని మళ్ళీ చదువుకున్నట్లనిపించింది. రచయిత పేరు కొత్తగా ఉంది. పూర్తి పేరు ఏమిటో చెప్పగలరు.

*–టి.నాగభూషణం, గచ్చిబౌలి, హైదరాబాద్*

సరదా కథలు బాగుంటున్నాయి. ఒక్క మాటలో చెప్పాలంటే సరదా కథలు హాస్యానందంలో ముంచెత్తుతున్నాయి. ప్రతి కథ కొలతలతో అక్షరాలు తూచి తూచి పాఠకులకు అందించినట్టున్నాయి. చేయి తిరిగిన రచయిత కథల్లా, విదేశీ కథల్లా అలరిస్తున్నాయి. నవ్యకు అభినందనలు. కార్టూన్లు బాగుంటున్నాయి.

*–సుభాష్, తెనాలి*

### బహుచక్కగా చెప్పారు

నోరు మంచిదైతే ఊరు మంచిదన్న నీతిని మరింత హృద్యంగా మొదటిపేజీ కథలో బహుచక్కగా చెప్పారు. నిజమే, మనం ఏమిటో, మన మనసులో ఏముందో మనమాటలే చెప్పేస్తాయి. ఎలాంటి దరఖాస్తులేకుండా ప్రతిఏటా ప్రచురించబడిన కథలు సమీక్షించి ఉత్తమ కథకు అవార్డు ఇవ్వాలన్న మాడభూషి రంగాచార్య కమిటీ ప్రయత్నం బహుదా శ్లాఘనీయం. ఈ అవార్డు గ్రహీత చింతకింది శ్రీనివాసరావుకు అభినందనలు. భారతీయ ఆలయాలు కాక బ్యాంకాక్ ఆలయం సందర్శించుకోవడంవల్ల త్రిషకు ఛాన్సులు తన్నుకొస్తున్నాయనుకోవడం కేవలం మూఢనమ్మకం.

*–కె.ఎల్.ప్రసన్న, పేర్రాజుపేట*

# అమ్మో బొమ్మలు!

పిల్లలకు బొమ్మలే లోకం. బొమ్మలు లేనిదే బాల్యం లేదు. బొమ్మలతో ఆడుకోని పిల్లలంటూ ఉండరు. ఉయ్యాలలో ఊగే వయసు దగ్గర నుంచి ..పాకే వయసుతోపాటు పది సంవత్సరాలు వచ్చే వరకూ బొమ్మలు, పిల్లల మధ్య అనుబంధం కొనసాగుతూనే ఉంటుంది. ఉయ్యాల్లో గుక్క పెట్టి ఏడ్చే చంటి పాపలు గిలక్కాయ శబ్దం వినగానే వెంటనే ఏడుపు ఆపేసి, బోసినవ్వులు చిందిస్తారు. ఇక కాస్త పెద్దగా అయిన పిల్లలైతే వాటితో ఆడుకుంటూ లోకాన్నే మర్చిపోతుంటారు. ఇది చెడ్డ లక్షణం కాదు. కంటికి కనిపించిన ప్రతిదానినీ పరిశీలిస్తూ పరిసరాలతో అనుబంధం ఏర్పరచుకునే ప్రయత్నంగా దీనిని మనం గుర్తించాలి. మార్కెట్లోకి తీసుకెళ్తే చాలు ఆ బొమ్మ కొనివ్వు ఇది కొనివ్వు అని అడగని చిన్నారులు ఉండరంటే అతిశయోక్తికాదు. అందుకే పిల్లలు అల్లరి చేయకుండా ఉండేందుకు రకరకాల బొమ్మలు కొని తెస్తుంటారు తల్లిదండ్రులు. అయితే జర్మనీ దేశం మాత్రం పిల్లలకి కొనిచ్చిన బొమ్మలను వెంటనే పడేయమని, ఇకపై బొమ్మలు కొనవద్దని తల్లిదండ్రులను ఆదేశిస్తోంది. ఎందుకంటే బొమ్మలు చిన్నారులపై నిఘా వేస్తున్నాయట. అదేంటి బొమ్మలు నిఘా వేయడం ఏంటి అనుకుంటున్నారా? కాలంతో పాటు ఆడుకునే బొమ్మలు కూడా మారిపోయాయి. ఒకప్పుడు చెక్కబొమ్మలు ఉండేవి. ఇప్పుడు వాటి స్థానంలో స్మార్ట్ డిజిటల్ బొమ్మలు వచ్చాయి. అచ్చం మనుషుల్లా ఉండే, మనుషుల్లా మాట్లాడే బొమ్మలు కూడా వచ్చేశాయి. అవి ఎంత ఆనందాన్ని ఇస్తున్నాయో అంతే సమస్యలను కొనితెస్తున్నాయి.



సైబర్ నేరగాళ్లు బొమ్మలను కూడా వదలకుండా వాటిని హ్యాక్ చేస్తూ చిన్నారుల కదలికల్నీ, మాటల్నీ గమనిస్తున్నారు. ముఖ్యంగా అమెరికాలో తయారు చేస్తున్న 'మై ఫ్రెండ్ కేలా' అనే బొమ్మ సాంకేతికతతో తయారైంది. ఇవి ఎక్కువగా యూరప్ దేశాల్లో అమ్ముడుపోతాయి. అక్కడి చిన్నారులు ఈ బొమ్మను బాగా ఇష్టపడతారు. ఈ బొమ్మ మనం ఏం ప్రశ్న అడిగినా ఇంటర్నెట్ సాయంతో సమాధానం చెబుతుంది. ఈ బొమ్మను ప్రత్యేకంగా రూపొందించిన యాప్ ద్వారా ఆపరేట్ చేయొచ్చు. ఇంటర్నెట్ కనెక్షన్‌తో నడిచే ఈ బొమ్మలను సైబర్ నేరగాళ్లు హ్యాక్ చేసి చిన్నారులతో బొమ్మ ద్వారా మాట్లాడుతున్నారు. అంతేకాదు.. చిన్నారుల కదలికలను.. ఇంట్లో పెద్దలు మాట్లాడుకునే మాటల్ని వింటున్నారని ఫెడరల్ నెట్‌వర్క్ ఏజెన్సీ గుర్తించింది. దీంతో ఆ బొమ్మల్నీ.. వాటితో పాటు స్మార్ట్ బొమ్మల్నీ విరిచి పడేయమని జర్మనీ తమ దేశస్థులను ఆదేశించింది. అంతేకాదు.. దుకాణాల్లో వ్యాపారస్థులు వాటిని అమ్మితే.. చట్టపరమైన చర్యలు తీసుకుంటామని హెచ్చరికలు జారీ చేసింది. బొమ్మలేమో కానీ లేనిపోని సమస్యలను తెస్తున్నాయంటున్నారు జర్మనీ దేశ వాసులు. మనదగ్గర ఇంకా ఇలాంటి టెక్నాలజీ రాలేదు కానీ భవిష్యత్తులో వస్తుందేమో కాబట్టి ముందు జాగ్రత్త పడదాం మనం కూడా!



# ‘ఊపిరి’ ఉన్నప్పుడే!




**ఆరిపోయే దీపానికి వెలుగెక్కువ అంటారు. కొన్ని అకాల మరణాలను గమనిస్తే అది నిజమేననిపిస్తుంది. శాస్త్రవేత్త, వైద్యుడు, రచయిత...‘పాల్ కళానిధి’ 36 ఏళ్లకే ఊపిరితిత్తుల కేన్సర్‌తో చనిపోయారు. ఈ ఇండియన్ అమెరికన్ న్యూరో సర్జన్ రాసిన ‘వెన్ బ్రీత్ బికమ్స్ ఎయిర్’ అనే మెమొయిర్ రెండు వారాలపాటు ది న్యూయార్క్ టైమ్స్ నాన్ ఫిక్షన్ బెస్ట్ సెల్లర్ లిస్ట్‌లో కొనసాగింది. మైక్రోసాఫ్ట్ అధినేత బిల్‌గేట్స్ చేత కూడా కంట తడి పెట్టించిందీ పుస్తకం. ఇంతకీ ఈ పుస్తకంలో ఏముంది? ఓసారి తొంగిచూసే ప్రయత్నం చేద్దాం!**

‘ప్రతి మనిషి మరణం బాధాకరమే! కానీ కొందరి మరణాలు మరింత భయానకం.’ టర్మినల్ కేన్సర్ ఉందని 2013లో డయాగ్నైజ్ అయినప్పుడు పాల్ కళానిధి రెండు చేతులు ఖాళీగా లేనంత బిజీగా ఉన్నాడు. ఓపక్క వైద్యవృత్తి, పరిశోధన, మరోపక్క పుస్తక రచనతో తనకొచ్చిన వ్యాధి గురించి, తరిగిపోయిన తన ఆయుష్షు గురించి ఆలోచించే తీరిక, ఆసక్తి అతనికి లేదు. అతనో గిఫ్టెడ్ డాక్టర్. స్టాన్‌ఫోర్డ్‌లో న్యూరోసర్జరీ రెసిడెంట్. అద్భుతమైన సైంటిస్ట్ కూడా! జీన్ థెరపీ మీద చేసిన రీసెర్చ్‌తో ఆ రంగంలో హయెస్ట్ రీసెర్చ్ అవార్డు అందుకున్నాడు. పాల్ గొప్ప రచయిత కూడా! మెడిసిన్‌కి ముందు స్టాన్‌ఫోర్డ్ నుంచి ఆంగ్ల సాహిత్యంలో రెండు డిగ్రీలు చేశాడు. ఓ సందర్భంలో పూర్తిగా రచననే ఫుల్ టైమ్ కెరీర్ చేసుకుందామనుకున్న సాహిత్యాభిలాషి.

### ఆ రెండేళ్ల కాలంలో...

2013 మేలో మెటాస్టాటిక్ లంగ్ కేన్సర్ నాలుగో దశలో ఉందని డయాగ్నైజ్ అయినప్పటి నుంచి 2015, మార్చి 9న ప్రాణాలొదిలేవరకూ ఆ రెండేళ్ల కాలంలో కళానిధి...మెడికల్ ట్రైనింగ్ కొనసాగించాడు, పాపకు తండ్రయ్యాడు, వైద్యుడిగా, రోగిగా రెండు జీవితానుభవాల్ని రచనలో ఆవిష్కరించుకున్నాడు. రచన మీద మమకారంతో తనలో జరిగే సంఘర్షణలను, ఉన్న కొద్ది సమయాన్ని వెచ్చించాల్సిన అంశాలను ప్రాధాన్యతాక్రమంలో సర్దుబాటు చేసుకోవటానికి పడ్డ తాపత్రయాన్ని, తాను వైద్యుడిగా గడిపిన చివరి రోజు గురించి కళానిధి తన మెమొయిర్‌లో ఇలా రాసుకున్నాడు.

‘సర్జరీ చేయించుకున్న 7 నెలల తర్వాత ఆ సీటీ స్కానర్ నుంచి ఒక్క దూకుతో కిందకి దిగాను. రెసిడెన్సీ ముగిసేలోపు, నా భవిష్యత్తు వాస్తవంగా మారేలోపు, తండ్రినవబోయేలోపు.. ఇదే నా ఆఖరి సీటీ స్కాన్ కావొచ్చు.

‘ఓసారి చూస్తారా?, టెక్నీషియన్ అడిగింది.’

‘ఇప్పుడు కాదు... ఈరోజు నాకు చాలా పనులున్నాయి!’

ఇప్పటికే సాయంత్రం ఆరయింది. పేషెంట్లను కలవాలి. క్లినిక్ నోట్స్ డిక్టేట్ చేయాలి. ఇంతకుముందు ఆపరేషన్ చేసిన పేషెంట్లను చెక్ చేయాలి. ఎనిమిది అయ్యేసరికి అన్ని పనులూ పూర్తయ్యాయి. న్యూరో సర్జరీ ఆఫీసుకి చేరుకుని రోగుల స్కాన్ రిపోర్ట్స్ చూడటం మొదలుపెట్టాను. అవి అంత సీరియస్ కేసులు కావు. చివర్లో నా స్కాన్ రిపోర్ట్. పాత ట్యూమర్ అలాగే ఉంది. దాని పక్కనే ఇంకో పెద్ద కేన్సర్ గడ్డ బద్దలవబోయేముందు అగ్నిపర్వతంలా! దాన్ని చూసి నాకు కోపం రాలేదు. భయం వేయలేదు. ఇంటికెళ్లి లూసీ (భార్య... తనూ డాక్టరే!)తో చెప్పాను. ఇద్దరం ల్యాప్‌టాపుల్లో బయాప్సీలు, టెస్ట్‌లు, కీమోథెరపీలను మరోసారి విశ్లేషించి మా నెక్స్ట్ స్టెప్ గురించి డిస్కస్ చేశాం. బతికే అవకాశాలు దాదాపు శూన్యమని అర్థమైపోయింది. ఆరోజు గురువారం. సోమవారం నా ఆంకాలజిస్ట్ డాక్టర్ ఎమ్మాతో అపాయింట్‌మెంట్. కలిశాక ఇక నా మెడికల్ ప్రాక్టీస్‌కు ఆరోజుతోనే ఫుల్‌స్టాప్ పడొచ్చు. అందుకే శుక్రవారం రెసిడెంట్‌గా చివరి రోజు ప్రాక్టీస్ చేద్దామనుకున్నాను. తెల్లారింది. పొద్దునే 5:20కి హాస్పిటల్ ముందు కారులోంచి కాలు బయటపెట్టాను. బలంగా లోపలికి ఊపిరి పీల్చుకున్నాను. ఆ వాసన యూకలిప్టస్‌దా? పైన్ చెట్లదా? ఏమో ఇంతకుముందెప్పుడూ అంతగా దృష్టి పెట్టలేదు కాబట్టి అర్థం కాలేదు. లోపలికెళ్లి మార్నింగ్ రౌండ్స్‌లో ఉన్న రెసిడెంట్ టీమ్‌ని కలిశాను. కొత్త అడ్మిషన్లు, కొత్త స్కాన్స్ చూసి పేషెంట్స్‌ని కలవటానికి బయల్దేరాను. ఆరోజు ఓ పేషెంట్‌కి వెన్ను సర్జరీ చేయాల్సి ఉంది. చేతులు కడుక్కున్నాను. సర్జరీ ముందు హ్యాండ్‌వాష్ అదే చివరిసారని గుర్తుకురాగానే



సింక్‌లో ఇంకిపోతున్న సబ్బు నీళ్లను రెండు క్షణాలు అలాగే చూస్తుండిపోయాను. తర్వాత తేరుకుని ఆపరేషన్ థియేటర్‌లోకి అడుగు పెట్టాను. ఇది చివరిది. పర్‌ఫెక్ట్‌గా పూర్తి చేయాలి. వెన్నుపూసలు అరగటంతో నాడులు నొక్కుకుంటూ విపరీతంగా బాధపెట్టే సమస్య ఉన్న పేషెంట్ అతను. సర్జరీ మొదలుపెట్టాను. వెన్నుపూసల అడుగునున్న ఓవర్‌గ్రోత్ 'లామినా'ను నా తోటి రెసిడెంట్‌తో కలిసి స్క్రబ్ చేసేశాను. జాబ్ డన్. ఇలాంటి దశలో అందరూ చేసే తప్పిదం స్పైనల్ ఫ్లూయిడ్ లీకేజ్. అతని ఇన్‌స్ట్రుమెంట్ అంచులు గుచ్చుకుని పొర చిరిగి లిక్విడ్ లీక్ అవటం మొదలుపెట్టింది. దాన్ని సరిచేయటానికి ఇంకో గంట పట్టింది. సర్జన్ నైపుణ్యాన్ని అతను సర్జరీకి తీసుకునే సమయాన్ని బట్టి లెక్కిస్తారు. రోగిని అనస్థీషియాలో సాధ్యమైనంత తక్కువ సమయం ఉంచేలా చూసుకోవాలి. మొత్తానికి తోటి సర్జన్ చేసిన తప్పు సరిదిద్ది నా చివరి సర్జరీ సక్సెస్‌ఫుల్‌గా కంప్లీట్ చేశాను. ఇక ఆ రోగి భవిష్యత్తంతా నొప్పిలేని జీవితం గడపొచ్చు. చాలా తృప్తిగా అనిపించింది. ఇక తర్వాతి పని ఆస్పత్రిలో నా రూమ్ వెకేట్ చేయటం. టూత్‌బ్రష్‌లు, సోప్ బార్స్, ఫోన్ ఛార్జర్లు, స్కల్ మోడల్...నా వస్తువులన్నీ సర్దుకున్నాను. నా తర్వాతి డాక్టర్లకు ఉపయోగపడతాయనే ఆలోచనతో న్యూరోసర్జరీ పుస్తకాలు వదిలేశాను. ఇంటికెళ్లటం కోసం కార్లో కూర్చోగానే ఒక్కసారిగా పట్టలేని దుఃఖం వచ్చేసింది.'

### నాకు లంగ్ కేన్సర్?

స్మోకింగ్ అలవాటు లేదు. స్వయంగా డాక్టర్ని. హెల్తీ లైఫ్‌స్టయిల్. మరి నాకు కేన్సరేంటి? అదీ 36 ఏళ్లకే నాలుగో దశకు చేరుకున్న లంగ్ కేన్సర్. ఈ వ్యాధి డయాగ్నైజ్ కాకముందు నా జీవితం గురించి కూడా కొంత చెప్పాలి. తమిళనాడు నుంచి అమెరికాకు వలసవెళ్లిన కుటుంబం మాది. నేను పుట్టింది, పెరిగింది అమెరికాలోనే! మెడికల్ స్కూల్ గ్రాడ్యుయేషన్ తర్వాత స్టాన్‌ఫోర్డ్‌లో న్యూరోసైన్స్‌లో పోస్ట్ డాక్టోరల్ ఫెలోషిప్ చేశాను. ఇక్కడే నా భార్య లూసీ పరిచయమైంది. తనూ డాక్టరే! తొమ్మిదేళ్ల మా వైవాహిక జీవితం ఎంతో ఆనందంగా గడిచిపోయింది. న్యూరోసర్జన్‌గా ఏడేళ్ల సక్సెస్‌ఫుల్ కెరీర్. అలా సాఫీగా సాగిపోతున్న జీవితంలో అనుకోని అనారోగ్యం. 2013 మేలో వెన్నునొప్పి, దగ్గు, ఫిట్స్, వెయిట్ లాస్ లక్షణాలు కనిపించాయి. విపరీతంగా బరువు తగ్గిపోయాను. రాత్రి పూట చెమటలతో, ఛాతినొప్పితో నిద్ర మెలకువయ్యేది. స్కానింగ్‌లో మెటాస్టాటిక్ లంగ్ కేన్సర్ అని తేలింది. మూడు నెలలకంటే బతకటం కష్టం అని చెప్పారు. ఈ కేన్సర్‌కి కారణం సెల్ మ్యుటేషన్. ఒక పర్టిక్యులర్ జన్యువులో జరిగే కణ విచ్ఛిత్తే మెటాస్టాటిక్ కేన్సర్‌కు దారి తీసింది. అది విన్న వెంటనే నా భవిష్యత్తు కళ్లముందు మెదిలింది. మరేం ఆలోచించకుండా....'నా తర్వాత నువ్వు మళ్లీ పెళ్లి చేసుకుని సంతోషంగా జీవితాన్ని గడుపు' అని లూసీతో చెప్పేశాను. ఎందుకంటే, ఆ సమయంలో ఇక అంతకుమించి నేను ఎక్కువకాలం బతకలేనని అనిపించింది. కానీ ఆంకాలజిస్ట్ ఇచ్చిన 'టార్సీవా' డ్రగ్ తొమ్మిది నెలలపాటు అద్భుతంగా పని చేసింది. నేను పూర్వంలా ప్రాక్టీస్ మొదలుపెట్టాను. ఈ తొమ్మిది నెలల కాలంలో లూసీ, నేను తల్లిదండ్రులవ్వాలనే ఓ క్లిష్టమైన నిర్ణయం కూడా తీసుకున్నాం. అలా 2014 జులై 4న 'కేడీ' ఈ ప్రపంచంలోకి అడుగు పెట్టింది. పాప పుట్టిన తర్వాత నేను వాడుతున్న మందులు పని చేయటం మానేశాయి. కీమోథెరపీ మొదలుపెట్టాం. బాగా బలహీనపడ్డాను. అయినా ఉన్న కాస్త ఓపికను పాపతో గడపటానికే ఉపయోగించేవాడిని. చేతిలో ఉన్న కొద్ది సమయాన్ని దేని కోసం వెచ్చించాలో, దేనికోసం వృథా చేసుకోకూడదో అర్థమైంది. రోగిగా ఇంట్లో మంచానికే పరిమితమవటం నరకమే! కానీ ఆ స్థితిని రచనకు ఉపయోగించాను. మంచం మీద వెనక్కి వాలి కూర్చుని హాయిగా టైప్ చేసుకోవచ్చు. ఇది ఆపరేటింగ్ రూమ్‌లో సర్జరీ చేయటం కంటే ఎన్నో రెట్లు తేలిక. పాప పెద్దదవుతోంది. తనకు నా జ్ఞాపకాలను ఎక్కువ మొత్తంలో మిగల్చటం కోసం ఇంకొంత కాలం బతకాలని ఉంది. కానీ పుట్టుకలాగే మరణం కూడా మన చేతుల్లో ఉండదు.

—గోగుమళ్ల కవిత



## బిల్‌గేట్స్‌ను కదిలించిన 'వెన్ బ్రీత్ బికమ్స్ ఎయిర్'



'ఈ పుస్తకం తనతోపాటు భార్య మెలిండా, కూతురు జెన్నిఫర్‌లను కూడా కదిలించిందని బిల్‌గేట్స్ చెప్పుకున్నాడు. తాను చదివిన అతి గొప్ప నాన్‌ఫిక్షన్ కథల్లో ఇదొకటని, గుండెను కదిలించే సంఘటనలతో కంటతడి పెట్టించిన ఈ పుస్తకంలో ఒక వైద్యుడిగా, రోగిగా, భిన్న పార్శ్వాలు ఎదుర్కొన్న గొప్ప భర్తగా కళానిధి మలి జీవితాన్ని మలుచుకున్న తీరు గురించి అతని మీద ప్రశంసల జల్లు కురిపించాడు. ఆయన మాటల్లో చెప్పాలంటే...'కళానిధి, ఆయన భార్య లూసీ పిల్లల్ని కనాలని నిర్ణయించుకున్నట్టు చదివినపుడు నేనెంతో ఎమోషనల్‌గా ఫీలయ్యాను. ఇక చావు తప్పదని తెలిసి ఈ నిర్ణయం తీసుకున్నారా? లేక దగ్గర పడిన మరణమే వాళ్లచేత ఈ నిర్ణయం తీసుకునేలా చేసిందా? ఏదేమైతేనేం... ఇద్దరూ తల్లిదండ్రులయ్యారు. ప్రసవ సమయంలో భార్య పక్కనే ఉన్నా, పాపను ఎత్తుకుని గుండెలకు హత్తుకునే శక్తి అప్పటికి కళానిధికి లేదు. పాప ఈ ప్రపంచంలో కొచ్చిన సరిగ్గా 8 నెలల తర్వాత ఆ స్థలానికి కొన్ని గజాల దూరంలోనే కళానిధి ఈ లోకం నుంచి నిష్క్రమించాడు.'

ఇక కళానిధి భార్య లూసీ పుస్తకంలో రాసిన చివరి వాక్యాలు చదివేటపుడు ఎవరికైనా దుఃఖం ఆగదు. ఆమె భర్తతో తనకున్న అనుబంధం గురించి ఇలా రాసుకుంది. 'నేను అప్పుడప్పుడూ అతని సమాధి దగ్గరికి వెళ్తూ ఉంటాను. వెళ్లేటప్పుడు వెంట మా హనీమూన్ డెస్టినేషన్‌లో తయారయ్యే మాడియారా వైన్‌ను వెంటబెట్టుకెళ్తాను. వెళ్లిన ప్రతిసారీ ఆ వైన్‌ను గడ్డి మీద ఒంపి చేత్తో తడుముతూ ఉంటే ఆయన వెంట్రుకల్లోకి వేళ్లు జొనిపి సరిచేసినట్టు అనిపిస్తుంది. ఇలాంటి మనసును తాకే విషయాలు ఆ పుస్తకంలో ఎన్నెన్నో! పుట్టుక చావు, రోగి వైద్యుడు, వృత్తి కుటుంబం మొదలైన జీవిత పొరలను ఒక్కొక్కటిగా తొలగించి చూస్తూ వాటి అసలు అర్థాన్ని ఆకళింపు చేసుకోగలిగే అవకాశం ఈ పుస్తకం కల్పించింది.'

# అంటరాని వసంతం

తటవర్తి నాగేశ్వరి

**"అమ్మా.. ఈ సంక్రాంతికి రాలేం. నాకు ఒంట్లో బాగోలేదు. బిజినెస్ షెడ్యూల్‌లో ఆయన బిజీగా ఉన్నారు. ఒక్క పండగ రోజు మాత్రమే ఇంట్లో ఉంటారట" పెద్ద కూతురు ఆమని ఎస్సెమ్మెస్ ఇచ్చింది.**

**చిన్న కూతురు తరంగిణి అది కూడా ఇవ్వలేదు. కాల్ చేస్తే "నెక్స్ట్ ఫెస్టివల్‌కి వస్తాం లే మమ్మీ" అని ఫోన్ పెట్టేసింది.**

అనసూయ మనసు చివుక్కుమంది. "ఎందుకు వీళ్ళు ఇలా ముఖం చాటేస్తున్నారో?" కానీ సద్గుణరావు మాత్రం ఒక రోజు ముందుగానే వచ్చేశాడు. అదే ఆమెకు కాస్త సంతోషమనిపించింది. అతడి భార్య సరస్వతి. అత్త అనసూయ నోట్లోంచి వచ్చే ఆదేశాల కోసం ఎదురుచూస్తూ పనులు చక్కబెడుతుంది. "సరసూ, పిండివంటలు రుచిగా ఉండాలి" హుకుం జారీ చేశాడు సద్గుణ్.

సరస్వతి కష్టపడి ఐదారు వంటకాలు తయారు చేసింది. "చిన్నక్కకి జంతికలు ఇష్టం, పెద్దక్కకు నువ్వుల అరిసెలు ఇష్టం" అంటూ చేయించాడు. బాగా దోరగా వేయించిన జీడిపప్పుతో లడ్డూలు, బాదుషా, జిలేబి కూడా చేయించాడు.

"అక్కావాళ్ళు రాలేదని బెంగ పడకమ్మా.. నేనే స్వయంగా తీసుకెళ్ళి పిండివంటలు వాళ్ళకి ఇస్తాను" చెప్పాడు సద్గుణ్. జీవం లేని నవ్వు నవ్వింది అనసూయ. "నీదంతా పిచ్చిరా, అవన్నీ వాళ్ళు తింటారా?" పెదవి విరిచింది. కిందటిసారి పండక్కి కూడా రాలేదు. అప్పుడు కూడా సద్గుణ్ ఇలాగే హడావిడి చేశాడు.

"ఇవన్నీ పనిగట్టుకుని ఎందుకు మామ్. పుల్లారెడ్డి స్వీట్స్‌లో రెండు వేల రూపాయలకు ఆర్డర్ ఇస్తే డోర్ డెలివరీ చేస్తారు. అదేపనిగా అతను వాటిని మోసుకురావడం.. ఆ స్టాక్ మిగిలిపోతే పిల్లలు బైట పడేయడం అలవాటైపోయింది" విసుక్కుంది ఆమని.

"అతగాణ్ణి అంతదూరం పంపడం ఎందుకు? కొరియర్ చెయ్యొచ్చుగా" అంది తరంగిణి.

అనసూయ మనసు చివుక్కుమంది. "అలా చెయ్యడం చేతకాక కాదు. స్వయంగా వచ్చి యిస్తే, అక్కయ్యలు సంతోషపడతారన్నది వాడి నమ్మకం" చెప్పింది అనసూయ.

"అమ్మా, ఈ వరసలు పెట్టకు. వాడేమైనా మాతో పాటు నీ బొడ్డుతాడు కోసుకొని భూమి మీదకు వచ్చాడా?" కోపంగా అడిగింది తరంగిణి. "అవేం మాటలే, కంటేనే తల్లవుతానా? మీరిద్దరూ ఎంతో వాడూ అంతే నాకు" స్థిరంగా అంది అనసూయ.

"అందుకే నేనూ, అక్కా రోజురోజుకూ నీకు ఇంకా దూరమవుతున్నాం" కోపంగా అని ఫోన్ పెట్టేసింది తరంగిణి. కుర్చీలో కూలబడింది అనసూయ.

'ఎప్పటికీ వీళ్ళు కలుసుకోరా..' పదే పదే ఆమె హృదయం రోదించింది. సద్గుణరావు అమాయకపు ముఖం గుర్తొచ్చింది. సద్గుణ్.. ఒక ఫార్మా కంపెనీ అధినేత. కానీ అమ్మ దగ్గర అక్కయ్యల దగ్గర మాత్రం తన స్థాయి తగ్గించుకుని చిన్నపిల్లాడైపోతుంటాడు. అక్కయ్యల ప్రేమ కోసం పరితపిస్తుంటాడు. "ఎందుకురా, వాళ్ళు అలా అవమానిస్తుంటే, వాళ్ళ వెంటే పడుతుంటావు" అడిగింది అనసూయ. తేరిపార చూసి "నాకు ఇంకెవరున్నారమ్మా? నువ్వూ అక్కయ్యలేగా. నువ్వు ఎలాగూ నన్ను తిట్టవ్. అందుకే వాళ్ళు ఎంత నిర్లక్ష్యంగా మాట్లాడినా నేను పట్టించుకోను" అన్నాడు నవ్వుతూ.

ఆమని, తరంగిణిలకు.. పిండివంటలు ఇచ్చి వచ్చాక రెండు రోజులున్నాడు సద్గుణ్. ఉన్న రెండు రోజులూ, "అమ్మా, గుత్తివంకాయకూర చేసిపెట్టవూ, అమ్మా నువ్వు చేసే మజ్జిగపులుసు సూపర్ అమ్మా, నువ్వు చేసే పప్పుచారు టేస్ట్ ఇంకెవరికీ రాదమ్మా" అని పొగడ్తలతో ముంచేస్తుంటాడు.

"సరసూ శ్రద్ధగా నేర్చుకోవే అమ్మ దగ్గర.." అని పురమాయిస్తుంటాడు.

సరస్వతి నవ్వుతూ చూస్తూ ఉంటుంది.

"భోజనం దగ్గర కూర్చుంటే, మీ పేరు తలుచుకోని రోజే ఉండదు అత్తయ్యా" నవ్వుతూ చెప్పింది సరస్వతి. అనసూయ మురిపెంగా చూస్తూ, "అంతా

**ఇవాళైనా నన్ను ఇంటికి తీసుకెళతావా అమ్మా దీనంగా అడిగాడు సద్గుణ్. అనాథాశ్రమంలో ఉన్న బిడ్డను చూసి ఆ మాతృహృదయం విలవిల్లాడింది. అత్తను ఎదిరించి బిడ్డను ఇంటికి తెచ్చుకుంది. తను కన్నబిడ్డలు కూడా సద్గుణ్‌కి శత్రువులైపోయారు. ఎప్పటికైనా వాళ్ళల్లో మార్పు వస్తుందని ఎదురుచూసిందామె. మరి ఆమె కోరుకున్న మార్పు వచ్చిందా? అసలాబిడ్డ పట్ల ఆమెకు ఎందుకంత తపన?**

వాడి ప్రేమలే తల్లీ" అంది. తిరిగి వెళ్ళేప్పుడు అనసూయ కాళ్ళకు నమస్కరించారు దంపతులు. ఆశీర్వదించింది అనసూయ. ఆమె కళ్ళల్లో అప్రయత్నంగా కన్నీళ్ళు కదలాడాయి. "ఏంటమ్మా.. కన్నీళ్ళు" అడిగాడు ఆదుర్దాగా.

"ఏం.. లేదురా..?" అని కన్నీళ్ళు తుడుచుకుంది.



"దిగులు పడకమ్మా.. పోనీ నాతో వచ్చేస్తావా?" అడిగాడు ఆశగా.

"వద్దురా ఇక్కడతప్ప నేనెక్కడా ఉండలేను".

"సరే నీ ఇష్టం, ఇలా కన్నీళ్ళు మాత్రం పెట్టుకోకు" అన్నాడు సద్గుణ్.

చిన్నపిల్లాడికి పెట్టినట్టు నుదుటిమీద ముద్దు పెట్టి "గాడ్ బ్లెస్ యు రా కన్నా! జాగ్రత్త" అని చెప్పింది.

సద్గుణరావు తన 'ఆడి' కారులో తిరుగుప్రయాణమయ్యాడు. వందకోట్లకు అధిపతి సద్గుణ్. తన కింది సిబ్బంది దగ్గర ఎంతో హుందాగా ప్రవర్తిస్తాడు. అమ్మ అనసూయ దగ్గర మాత్రం చిన్నపిల్లాడైపోతుంటాడు. భర్త మౌనం, గాంభీర్యం గమనించింది సరస్వతి.

"ఏంటండీ ఆలోచిస్తున్నారు?"

"ఏం లేదు సరస్వతీ, పదే పదే అమ్మ గుర్తుకొస్తోంది. అక్కయ్యలకు భయపడి నా దగ్గరకి రాదు. నాకేమో తరచూ రావడానికి వీలుకాదు. అమ్మని మిస్ అవుతున్నాను" బాధగా అన్నాడు.

భర్త చేతిని మృదువుగా నొక్కింది సరస్వతి.

"ఏదో ఒకరోజు మీ అమ్మగారు మీ దగ్గరకు వస్తారు" ధీమాగా భర్తకి భరోసా ఇచ్చింది.

"ఎప్పుడు సరస్వతీ..? అమ్మ డయాబెటిక్ పేషెంట్. ఇప్పుడు బి.పి కూడా ఉంది. మందులు సక్రమంగా వాడుతోందో లేదో తెలీదు. అక్కయ్యల దగ్గరకైనా వెళ్ళి వుండమ్మా" అని చెప్పా. "వద్దురా సద్గుణ్, అక్కడికి వెళితే నీతో ఫోన్‌లో కూడా మాట్లాడలేను" అంటుంది.

ఏడాదికోసారి వచ్చే ఆ ఒక్క సంక్రాంతి కోసం అమ్మ ఏడాదంతా ఎదురు చూస్తూనే ఉంటుంది తెలుసా సరస్వతీ" బాధగా అన్నాడు.

భర్తని ఎలా ఓదార్చాలో అర్థం కాలేదు సరస్వతికి. మౌనంగా ఉండిపోయింది. "ఈ జీవితం, ఈ స్థాయి, హోదా.. అమ్మ పెట్టిన భిక్షే. అమ్మే లేకపోతే నేనేమైపోయేవాణ్ణో. తలచుకుంటేనే భయమేస్తుంది"

"అమ్మ ప్రేమకి ప్రత్యామ్నాయం లేదు కదా సద్గుణ్" అంది సరస్వతి.

"కానీ అక్కయ్యలు నన్ను శత్రువులాగే చూస్తున్నారు" అన్నాడు బాధగా.

"అంతా సర్దుకుంటుంది" అతడి భుజంపై తల వాల్చి అన్నది సరస్వతి.

నేషనల్ హైవేమీద మెత్తగా ముందుకు దూసుకుపోతున్న 'ఆడి' కారుతో సమానంగానే, అతడి జ్ఞాపకాలు కూడా పరుగులు తీశాయి.

***

"అరేయ్ నీకోసం కొత్త అమ్మ వస్తుంది. నిన్ను తీసుకెళుతుంది" చెప్పింది రాహేలమ్మ.

"అవునా" అన్నాడు ఆనందంగా కళ్ళు రెపరెపలాడిస్తూ ఆరేళ్ళ సద్గుణ్. సాయంత్రం నాలుగు తర్వాత ఇద్దరు వ్యక్తులు ఆటోలో దిగారు. అందులో ఒకరు అనసూయ. మరొకరు సూర్యనారాయణ. సూర్యనారాయణకి ఎదురొచ్చాడు ఆశ్రమం కేర్‌టేకర్ రమణమూర్తి. నమస్కారం పెట్టాడు.

"మూర్తిగారూ, ఇక నుండి సద్గుణ్ సంపూర్ణ బాధ్యతలు మేడమ్‌గారు చూసుకుంటారు." పరిచయం చేశాడు. సూర్యనారాయణ వైపు ప్రశ్నార్థకంగా చూశాడు రమణమూర్తి.

"మీ సందేహం నాకర్థమైంది మూర్తిగారూ, నాకు ట్రాన్స్‌ఫర్ వచ్చి వెళ్ళిపోతున్నా" చెప్పాడు.

"సరే, మంచిది" అని ఫార్మాలిటీస్ పూర్తి చేయించాడు రమణమూర్తి.

సూర్యనారాయణను ఎగాదిగా చూశాడు సద్గుణ్. అతడి ముఖంలో కోటి ప్రశ్నలు. సద్గుణ్ దగ్గరకొచ్చి "ఇక నుండి అనసూయమ్మగారు నీ బాగోగులు చూసుకుంటార్రా" చెప్పాడు. అనసూయను అదోలా చూశాడు సద్గుణ్. వాడిలో ఏదో ఉద్విగ్నత. కాసేపటి తర్వాత "అనసూయగారూ.. నాకు ఇక సెలవివ్వండి. ట్రైన్ టైం అవుతోంది" అని అక్కడినుంచి హడావిడిగా వెళ్ళిపోయాడు. అతడు వెళ్ళినవైపే కాసేపు చూసి సద్గుణ్‌ని తీసుకుని ఆశ్రమం గార్డెన్‌లోకి వచ్చింది అనసూయ. సద్గుణ్‌తో మాటలు కలిపింది. వాడి ఇష్టాయిష్టాలు తెలుసుకుంది.

"నన్ను మీ ఇంటికి తీసుకెళ్తారా?" ఆశగా అడిగాడు సద్గుణ్.

అనసూయకి వెంటనే ఏం మాట్లాడాలో అర్థం కాలేదు.

"ఇప్పుడు కాదురా, ఇంకోసారి వచ్చినప్పుడు తప్పక తీసుకెళ్తా" చెప్పింది.

"ఆ అంకుల్ కూడా అంతే రెండు మూడుసార్లు తీసుకెళ్తానని చెప్పి మాట తప్పాడు" సూర్యనారాయణ మీద కంప్లైంట్ చేశాడు సద్గుణ్. అంతలోనే ఆయా రాహేలమ్మ అక్కడికి వచ్చింది.

"వీడొట్టి వాగుడుకాయమ్మా" అంది నవ్వుతూ.

నవ్వింది అనసూయ. "హి ఈజ్ వెరీ యాక్టివ్ పర్సన్" అంది సద్గుణ్‌ని అభినందిస్తూ.

"ఒకప్పుడు నాలుగు నెలల పసిగుడ్డు సద్గుణ్‌ని ఆశ్రమంలో అప్పగించి వెళ్ళాడు ఒకవ్యక్తి. కొద్ది కాలానికి ఈ నారాయణగారు వెతుక్కుంటూ వచ్చారు. పిల్లాడి ఆలనా పాలనా చూసుకుంటానని వెయ్యి రూపాయలు ఇచ్చి వెళ్ళాడు. తర్వాత.. తర్వాత రావడం తగ్గించాడు. అప్పుడప్పుడు రమణమూర్తిగారి అకౌంట్‌లో డబ్బులు వేసేవాడు. గత ఏడాది సద్గుణ్‌ని స్కూల్లో జేర్చేటప్పుడు అడిగారు మూర్తిగారు, గార్డెన్‌గా ఎవరి పేరు పెట్టాలని. 'నా పేరే పెట్టండి పిల్లాడికి రిజర్వేషన్ కూడా వస్తుంది' అని చెప్పాడు. ఇప్పుడు మీరు వచ్చారు." చెప్పడం ఆపిన రాహేలమ్మ, సద్గుణ్‌వైపు తిరిగి "సద్గుణ్, లోపల స్నాక్స్ ఇస్తున్నారు వెళ్ళమ్మా" అంది.

సద్గుణ్.. లోపలికి వెళ్ళడం చూసి "అసలు ఈ పిల్లాడి తండ్రి సూర్యనారాయణగారే అని మాకు నమ్మకం. మీరెందుకు బాధ్యత తీసుకున్నారమ్మా" అడిగింది.

"సూర్యనారాయణగారు మావారికి మంచి మిత్రులు. ఆయన పోయాక ఆయన స్థానంలో నాకు జాబ్ వచ్చింది. కొద్ది రోజులుగా సూర్యనారాయణగారు పిల్లాడి గురించి చెబుతూనే వున్నారు.

తనకిప్పుడు ట్రాన్స్‌ఫర్ అవుతుంది కాబట్టి పిల్లాణ్ణి తీసుకెళ్ళలేను, నన్ను చూసుకోమని కోరారు. నాకు ఎలాగూ మగపిల్లలు లేరు. ఇద్దరూ ఆడపిల్లలే. అందుకే అంగీకరించాను. కానీ పిల్లాణ్ణి ఇంటికి తీసుకెళ్ళాలంటే నా ఒక్కదాని అంగీకారం సరిపోదు. మా అత్తగారి అనుమతి కూడా కావాలి. ఆవిడగారికి 'నిష్ఠ' ఎక్కువ. ఆవిణ్ణి ఒప్పించి పిల్లాణ్ణి నేను తీసుకెళ్ళే వరకు ఆశ్రమంలోనే ఉంచుతా. అప్పటివరకు నువ్వు కాస్త శ్రద్ధపెట్టమ్మా" అంది అనసూయ.

"అదేమంత భాగ్యమమ్మా. మాపని అదే కదా., కానీ తనకి ఒక తల్లి దొరికింది, కొత్త అమ్మ రాబోతోంది, తనని తీసుకెళుతుంది అని ఆశతో ఉన్నాడా పిల్లాడు. రమణమూర్తిగారికి సూర్యనారాయణగారు అదే చెప్పారు. పిల్లాడికి నేనూ అదే చెప్పాను" అంది రాహేలమ్మ. ఆశ్రమంలోనే పాఠశాల ఉంది. చదువు, నివాసం అక్కడే. సాయంత్రం స్నాక్స్‌లో భాగంగా గుగ్గిళ్ళు ఇస్తారు. అంతలోకి గుగ్గిళ్ళు తింటూ వచ్చిన సద్గుణ్ ఇంకో ప్యాకెట్ తెచ్చి అనసూయకిచ్చాడు. "వద్దు నాన్నా" అంది అనసూయ. "తీసుకోమ్మా బావున్నాయ్" చెప్పాడు నవ్వుతూ. వాణ్ణి సంతోష పెట్టేందుకు తీసుకుంది.

ఎలాగోలా సర్దిచెప్పమన్నట్టు రాహేలమ్మ వైపు చూసింది.

"సద్గుణ్, అమ్మగారు ఈసారి వచ్చినప్పుడు తీసుకెళ్తారు" అంది. "ఇప్పుడేం..?" అడిగాడు.

ఏం చెప్పాలో అర్థంకాక తెల్లమొఖం వేసింది రాహేలమ్మ. అనసూయ చొరవ తీసుకొని "నీకు బోలెడు బట్టలూ, చెప్పులూ వగైరా కొనాలి కదరా కన్నా, అన్నీ కొనుక్కొచ్చాక తీసుకెళ్తా" చెప్పింది.

నాకు "బోలెడు బట్టలున్నాయ్.. చెప్పులు కూడా ఉన్నాయ్" చక్రాల్లా కళ్ళు తిప్పుతూ అన్నాడు వాడు.

"కాసేపట్లో చీకటి పడిపోతుంది నాన్నా, రేపొకసారి వచ్చి పగటిపూట తీసు



కెళ్తానే" చెప్పింది. అయిష్టంగా ముఖం పెట్టాడు. ఆ చిన్నారి ముఖంలో కొండంత అసంతృప్తి.

అనసూయ రమణమూర్తికి చెప్పి తిరుగు ప్రయాణమైంది. పిల్లాణ్ణి దగ్గరకు తీసుకొని ముద్దు పెట్టుకుంది.

"వస్తారా కన్నా" అంది.

తన ఇంట్లో సద్గుణ్ ప్రవేశానికి ఎలా 'వ్యూహ' రచన చేయాలా అని ఆలోచిస్తూ ప్రయాణం చేసింది. అనసూయది సనాతన బ్రాహ్మణ కుటుంబం.

మెల్లిగా అత్తయ్య నాగమణి దగ్గర ప్రస్తావించింది. "మనకు మగపిల్లలు లేరు కదా అత్తయ్యా, మా కొలీగ్ సూర్యనారాయణగారు ఒక పిల్లాణ్ణి ఆశ్రమంలో పెట్టి సాకుతున్నారు. ఆయన బదిలీపై వెళ్ళిపోతూ పిల్లాడి ఆలనాపాలనా చూసుకోమన్నారు." చెప్పింది. నొసలు ముడివేసింది నాగమణి. "ఉన్న ఇద్దర్నీ ఉద్ధరిస్తే చాల్లే" అని కొట్టిపారేసింది.

"అది కాదు అత్తయ్యా.." అని ఏదో చెప్పబోతుంటే నాగమణి అడ్డుకొని, "మనది బ్రాహ్మణ కులం. అగ్రహారంలో బ్రతుకుతున్నాం. కులమూ, గోత్రమూ తెలియని వాడిని తెచ్చి ఇల్లు కలుషితం చేయకు" అంది. అనసూయకు ఏం మాట్లాడాలో అర్థం కాలేదు.




మనుషుల్ని మనుషుల్లా చూడకుండా 'కులం' ముసుగు వేయడం ఏమిటో అనసూయకు అర్థం కాలేదు. ఆరునెలలుగా సూర్యనారాయణ అడుగుతున్నాడు. "అనసూయగారూ.. దీన్నొక పవిత్ర బాధ్యతగా స్వీకరించండి.." అంటూ అభ్యర్థిస్తున్నాడు.

చాలాసేపు ఆలోచించింది. భర్తతో అతడి సాన్నిహిత్యం తనకి తెలుసు.

"నాకు ఆ పిల్లాణ్ణి చూసుకునే అవకాశం లేదు. ఎన్నో బాధ్యతలున్నాయ్. చెల్లెలు పిల్లల్నీ, తమ్ముడి పిల్లల్నీ నేనే చూసుకుంటున్నా. మీరైతేనే వాడికి బంగారు భవిష్యత్తు ఇవ్వగలరు." అభ్యర్థించాడు.

ఒకరోజు రాత్రి పిల్లలిద్దర్నీ దగ్గర కూర్చోబెట్టుకుని "మీకొక తమ్ముణ్ణి తెస్తున్నా. మీతో చక్కగా ఆడుకుంటాడు" అంది. ఇద్దరి ముఖాలు వెలిగిపోయాయి.

"అవునా! వాడి పేరేంటి?" అడిగింది ఆమని.

"సద్గుణ్.."

"వెరైటీగా ఉంది." అంది తరంగిణి. సరిగ్గా అప్పుడే వచ్చింది నాగమణి. "నీ బుద్ధి మారదా. మొన్న నువ్వు వెళ్ళాక నీ కొలీగ్ సూర్యనారాయణకి ఫోన్ చేశా. వాడి కులం ఏమిటో, మతం ఏమిటో తెలీదు కదా, గార్డియన్‌గా అతడిపేరే పెట్టుకున్నాడంటే ఇక వాడు 'మైలపడి' పోయినట్టే. రిజర్వేషన్ల కోటాలో అతగాడు ఉద్యోగం సంపాదించుకున్నాడు. నా కొడుకులా పోటీపడి కాదు. వాడు ఇంట్లో అడుగు పెడితే 'ఇల్లు' తగలబడినట్టే." కోపంగా అంది.

ఏం మాట్లాడాలో అర్థ కాలేదు అనసూయకి. అప్పటికే నానమ్మ మాటలు పిల్లల మనసులో దూరాయి.

"నానమ్మ వద్దన్నప్పుడు ఎందుకులేమ్మా.." అంది ఆమని.

"బ్రాహ్మణ పిల్లాడు కాదట కదా" ఆరిందాలా అడిగింది తరంగిణి.

"పెద్దవాళ్ళ మాటలు మీకెందుకే, పడుకోండి" కసిరింది అనసూయ. ఆదివారం ఆశ్రమానికి వెళ్ళింది.

సద్గుణ్ ఆశగా ఎదురు చూస్తున్నాడు. అనసూయని చూసి "అమ్మా" అని దగ్గరకొచ్చాడు.

ఆమె మాతృహృదయం ఉప్పొంగింది. సద్గుణ్‌ని దగ్గరకు తీసుకుంది.

"ఈరోజు నన్ను తీసుకెళ్తున్నావా అమ్మా.." అడిగాడు. ఏం చెప్పాలో అర్థం కాలేదు.

"తీసుకెళ్తా నాన్నా. ఇల్లు మారుతున్నాం. మారాక తీసుకెళ్తా" అంటూ తోచిన అబద్ధం ఆడింది. వాడి ముఖంలో నిరాశ. మరో రెండు నెలలు గడిచాయి. అనసూయ స్థిర నిశ్చయానికొచ్చింది. సద్గుణ్‌ని తెచ్చుకోవాలన్న బలమైన నిర్ణయం తీసుకుంది.

"అత్తయ్యా పిల్లాణ్ణి తెచ్చేద్దామనుకుంటున్నా" చెప్పింది.

"వినాశకాలే విపరీతబుద్ధి', ఇక నాకు ఇక్కడుండే పని లేదు. చిన్నకొడుకు దగ్గరకుపోతాను.. ఆ దరిద్రాన్ని చూస్తూ ఇంట్లో తిరగలేను" అంది. గాయపడ్డట్టు చూసింది అనసూయ.

"అత్తయ్యా.." అంది అర్థింపుగా.

"ఏదో భర్తపోయి బోలెడు దుఃఖంలో ఉంటావు. పిల్లలకి తోడుగా ఉండాలని వచ్చా. ఇక్కడ నా అవసరంలేదని అర్థమైంది" అంటూ నిమిషం కూడా నిలువలేదు.

అనసూయ బ్యాంక్‌కి వెళ్ళాక పిల్లలిద్దర్ని దగ్గరకు తీసుకుని, "మీ అమ్మ ఎవరో దరిద్రాన్ని ఇంటికి తెస్తుందట.. వాడికి దూరంగా ఉండండి, ముట్టుకోకండి" అంటూ విషం చిమ్మిపోయింది. అన్నింటికి తెగించిన అనసూయ సద్గుణ్‌ని ఇంటికి తేవడం, అత్తగారు వెళ్ళిపోవడం ఒకేసారి జరిగాయి. చురుగ్గా ఉండే సద్గుణ్, ఆమని.. తరంగిణిలతో కబుర్లు చెప్పుకోవడానికి ఉత్సుకత చూపేవాడు. కానీ వాళ్ళు తప్పుకుని తిరిగే వాళ్ళు. ముగ్గుర్నీ సమానంగా చూసేది అనసూయ.

షాపింగ్‌కి తీసుకెళ్ళి ఏది కావలిస్తే అది తీసుకోమనేది. "వాడూ మేమూ సమానమా" తల్లిని ఒకరోజు నిలదీసింది ఆమని. "వాడు మీ తమ్ముడమ్మా".

"నువ్వు వాడి అమ్మకాదు. నాన్నెవరో వాడికే తెలీదు. వాడూ మేమూ ఒకటెలా అవుతాం."

తరంగిణి ప్రశ్నకు ఏం చెప్పాలో అర్థం కాలేదు అనసూయకి.

"వాడికి దూరంగా ఉండమని నానమ్మ చెప్పింది" ఆమని మాటలకు బిత్తరపోయి చూసింది అనసూయ. "పిల్లల్లో ఇంత విషం నింపి వెళ్ళిపోయిందా ఆ పెద్ద మనిషి" మనసులో ఉక్రోషం, కోపం ఎగదన్నుకొచ్చాయి అనసూయకి.

"వయసుకి మించి మాట్లాడకండి.." కటువుగా చెప్పింది.

"అయితే నువ్వు వాడి 'పార్టీ' అన్నమాట" వెంకిగా అంది ఆమని.

"వాడితో ఇక 'కటీఫ్' అక్కా" చెప్పింది తరంగిణి.

"అయ్యో నామాట వినండమ్మా"

"ఇలా అయితే నీతో కూడా మాట్లాడం మమ్మీ" అంది ఆమని.

నిరుత్తరురాలైంది అనసూయ. కాలంతోపాటు వాళ్ళిద్దరిలోనూ ద్వేషమూ పెరిగింది.

అక్కయ్యలతో ఆడుకోవాలని సద్గుణ్ చిన్న హృదయం అల్లాడిపోయేది.

"నువ్వూ నేనూ ఆడుకుందాంరా కన్నా.." అనేది అనసూయ.

"మా మంచి అమ్మ.." అని కావలించుకునేవాడు సద్గుణ్. ఒకరోజు మరిది కృష్ణమూర్తి ఫోన్ చేశాడు. "వదినా చెప్పేంతవాణ్ణి కాదు, ఎవరో తెలియని పిల్లాడి కోసం మా అందర్నీ దూరం చేసుకుంటావా?"

"లేదయ్యా.. మీరే దూరమయ్యారు. భౌతికంగా దూరమై ఆయన అన్యాయం చేశారు, దూరమై మీరు అన్యాయం చేస్తున్నారు. ఒక పసివాడికి అండగా నిలిస్తే కులం, గోత్రం అంటూ అత్తయ్యగారు పిల్లలకు విషం నూరిపోశారు" బాధగా చెప్పింది అనసూయ.

కృష్ణమూర్తి ఏమీ మాట్లాడలేదు. "అమ్మ పిల్లల్ని చూడాలంటోంది" సండే మార్నింగ్ వచ్చి పిల్లల్ని తీసుకెళ్తా".

"మీ ఇష్టం. పిల్లల్ని మరింత పాడు చేయకండి" అని ఫోన్ పెట్టేసింది.

ఆదివారం పిల్లల్ని తీసుకెళ్ళడానికి వచ్చాడు కృష్ణమూర్తి. పోతూ పోతూ సద్గుణ్‌ని చూశాడు. తెల్లగా బొద్దుగా ముద్దుగా ఉన్నాడు. ముచ్చటగా ఉన్నాడనిపించింది. ముద్దాడేందుకు అభిజాత్యం అడ్డొచ్చింది.

"మా బాబాయ్" దర్పంగా కృష్ణమూర్తిని పొదివి పట్టుకొని చెప్పారు పిల్లలు.

"ఐతే నాకూ బాబాయేగా" అన్నాడు సద్గుణ్. నొసలు చిట్లించారిద్దరూ..

డైవర్ట్ చేసింది అనసూయ. "వెంటనే పంపించు కృష్ణమూర్తీ, ప్రాజెక్ట్ వర్క్స్ చాలా పెండింగ్‌లో ఉన్నాయ్ వీళ్ళకి" అంది.

"అన్నీ కంప్లీట్ చేశాం మమ్మీ" అన్నారు పిల్లలు.

"బోలెడు రిమార్క్స్ ఉన్నాయ్. మీరొచ్చాక చూద్దాం" అంది అనసూయ. అంతలో సద్గుణ్ తన నోట్స్ తెచ్చి, "అమ్మా నాకన్నీ వెరీగుడ్సే వచ్చాయ్" అన్నాడు. మూతి మూడు వంకర్లు తిప్పారు పిల్లలు.

"సరే, పెందలాడే బయలుదేరండి" తొందర చేసింది.

కల్మషం లేని మనసుతో "బాయ్ అక్కా" అన్నాడు సద్గుణ్. ఆమని, తరంగిణి వెళ్ళాక, "నన్ను కూడా బాబాయ్‌తో పంపించవచ్చు కదమ్మా" అడిగాడు. ఏం చెప్పాలో తెలియక, "నీకు టేబుల్స్ నేర్పించాలిరా" అంది.

"నాకు ట్వంటీ వచ్చు. క్లాసులో అందరికీ టెన్నే.." అన్నాడు గొప్పగా.

దగ్గరకు తీసుకొని హత్తుకోకుండా ఉండలేక పోయింది అనసూయ.

"నువ్వు ఏకసంథాగ్రాహివిరా" మెచ్చుకుంది.

కాల చక్రం గిర్రున తిరిగింది.

సద్గుణ్ పదవతరగతిలో మంచి మార్క్స్ తెచ్చు కున్నాడు.

ఆమని, తరంగిణి ఈర్ష్యాద్వేషంతో రగిలిపోయారు. దాంతో సద్గుణ్‌ని వేరే స్కూల్‌లో వేసింది అనసూయ.

"మాకంటే వాణ్ణి మంచి స్కూల్లో వేశావ్. అందుకే వాడికి అన్ని మార్కులొచ్చాయ్" అంది ఆమని.

"అడక్కుండానే వాడికి 'డౌట్స్' క్లారిఫై చేస్తావ్, మేం అడిగినా చెప్పవు" కంప్లైంట్ చేసింది తరంగిణి.

నిజానికి సద్గుణ్ కోసం కొత్తగా బుక్స్ కూడా కొన లేదు అనసూయ. తరంగిణి బుక్స్, నోట్సే ఇచ్చింది.

"నీ నోట్స్ చదవడం వల్లే మంచి మార్కులు వచ్చాయక్కా" అన్నాడు సుద్గుణ్ ఆనందంగా.

"అంతమాత్రాన మాతో సమానం అనుకోకు" ఆమని దూకుడుగా అంది. నిజానికి అందరూ నిద్ర పోయినా, చదువుతూ ఉంటాడు సద్గుణ్.

"ఇక పడుకో నాన్న" అన్నా.. "క్లాసులో ఫస్ట్ రావాలి మమ్మీ, నేను అమ్మ కొడుకును కదా, నీకు క్రెడిట్ తేవాలి" అనేవాడు.

ఎప్పుడన్నా దిగులుగా కన్పిస్తే, "నువ్వు అమ్మ కొడుకువిరా" అని దగ్గరకు తీసుకునేది. సద్గుణ్ ఆనంద పడిపోయేవాడు.

ఆలోచనలతోనే డ్రైవింగ్ చేస్తున్నాడు సద్గుణ్. క్షణాల్లో ట్రాలీని ఢీ కొట్టకుండా తప్పించాడు.

"ఏంటండీ, అంత పరధ్యానం" కాస్త కోపంగా అంది సరస్వతి. స్పృహలోకొచ్చాడు సద్గుణ్. జ్ఞాపకాలు తెగాయి. 'బండి' పక్కకు ఆపాడు.

సద్గుణ్ నెంబర్ చూసి ఫోన్ 'లిఫ్ట్' చేసి "ఏంటి నాన్నా, అప్పుడే చేరారా?" అడిగింది అనసూయ.

"లేదమ్మా, సడన్‌గా గుర్తొచ్చావు, మాట్లాడదాం అనిపించింది" అన్నాడు.

త్రుటిలో తప్పిన ప్రమాదం విషయం చెప్పలేదు. "జాగ్రత్తగా వెళ్ళు నాన్నా" అంది.

ఫోన్ కట్ చేసింది అనసూయ. సద్గుణ్ ముఖం ఆమె ముందు మరో సారి కదలాడింది.

అంతులేని 'జాలి'తో నిండిపో యింది. చుట్టూ వందలమంది పరి వారం, శ్రేయోభిలాషులు, అణకువగల భార్య.. దేనికీ కొదువలేదు. అయినా వీడికి అంతులేని వేదన. అనసూయ మనసు గతంలోకి వెళ్ళింది.

***

అక్కయ్యల ప్రేమకోసం పరితపిస్తున్నాడు సద్గుణ్. అత్త చిమ్మిన విషం వాళ్ళ మనసంతా కమ్ముకు పోయింది. సద్గుణ్‌ని వాళ్ళు పురుగులా చూడడం సహించలేకపోయేది. ఇంటర్‌లో సద్గుణ్ స్టేట్ ర్యాంక్, ఎంసెట్‌లో టాప్‌ర్యాంక్. సద్గుణ్ పేరు మారు మ్రోగి పోయింది. అప్పుడు ఫోన్ వచ్చింది అనసూయకు. అది సూర్యనారాయణ ఫోన్.

"కంగ్రాట్స్ అనసూయా.." ఆమె అత్త ఎంత అవ హేళన చేసిందో అతడికి తెలుసు.

"ఒక్కసారి వాణ్ణి చూసుకోవాలని, తనివి తీరా హత్తుకోవాలని ఉంది అనసూయా" అన్నాడు.

"వస్తారా, సద్గుణ్‌ని మీ దగ్గరకు పంపనా" అడి గింది.

"వచ్చే స్థితిలో లేను అనసూయా!"

ఆమె మనస్సు కీడు శంకించింది. వెంటనే సద్గు ణ్‌తో యానం బయలుదేరింది. యానంకి పది కిలో మీటర్ల దూరంలోని ఏటిమొగలో ఉంటున్నాడాయన. వీఆర్ఎస్ ఇచ్చి అక్కడ సెటిలయ్యాడు.

మంచం పట్టాడు. అనసూయ, సద్గుణ్‌లను చూసి లేచాడు. సద్గుణ్ సంస్కారంతో నమస్కారం చేశాడు.

"దీర్ఘాయుష్మాన్‌భవ. నీ గురించి పేపర్లలో, టీవీలలో చూశాను" అంటూ అభినందించాడు.

"థాంక్యూ సర్, మీరు నన్ను అమ్మకి అప్పగించక పోతే, నేను ఏమై పోయేవాణ్ణో" సద్గుణ్ జ్ఞాపక శక్తికి ఆశ్చర్యపోయాడు సూర్యనారాయణ.

"సార్, మానాన్న ఎవరో తెలియకపోయినా నష్టంలేదు. దేవుడు అమ్మానాన్నలను ఇద్దరినీ ఈ దేవత రూపంలో ఇచ్చాడు" సద్గుణ్ మాటలకు చలించి పోయాడు సూర్యనారాయణ.

అనసూయకి కళ్ళ వెంట నీళ్ళొచ్చాయి.

"కృతజ్ఞతా వర్షంలో ఎప్పుడూ నన్ను తడిపేస్తుం టాడు సూర్యనారాయణగారూ" అంది.

"సద్గుణ్.. అమ్మతో నేను మాట్లాడుతుంటా, నువ్వు మా వాడితో వెళ్ళి ఊరు చూసిరా" అన్నాడు, అప్పుడే లోపలికి వచ్చిన ఒక వ్యక్తిని చూపిస్తూ. "నా కొడుకు రాందాస్. ఇక్కడే పోస్ట్ మాస్టర్" చెప్పాడు.

రాందాస్ నమస్కారం చేశాడు. సద్గుణ్‌ని తీసు కొని రామదాస్ వెళ్ళిపోయింతర్వాత వగరుస్తూ కూర్చున్నాడు సూర్యనారాయణ. ఏదో చెప్పాలని తపిస్తున్నాడని అర్థమైంది అనసూయకు.

"సద్గుణ్ నా అక్రమ సంతానం, నా కొడుకని చెప్పుకోలేని అశక్తుణ్ణి, నా బిడ్డని పెంచి పెద్ద చేసినం దుకు కృతజ్ఞతలు" అని చెబుతారా" ఊహించుకుంది అనసూయ. కానీ నిమిషం తర్వాత సూర్యనారాయణ ఒక చిన్న డైరీ ఇచ్చాడు. అది చదివాక ఆమె నిటా రుగా కూర్చుంది. ముఖంలో రంగులు మారాయి. "వాడి జన్మ రహస్యం చెప్పకుండానే కన్ను మూస్తా నేమో అనుకున్నా. ఎందుకైనా మంచిదని రాసి పెట్టుకున్నా. నాకు కేన్సర్ అని కన్‌ఫర్మ్ అయ్యాక నేను ఆలోచించింది వీడి గురించే. నీకు అప్పగించాక

## జమునగా సమంత

పెళ్ళి కుదిరిన తరువాత సమంత సినిమాలు తగ్గిస్తుం దని అందరూ అనుకున్నారు. కానీ అవన్నీ రూమర్లే అని తన చేతలతో తేల్చి చెప్పేస్తోంది సమంత. తెలుగులో కన్నా తమిళంలో సినిమాలకు యమ స్పీడుగా ఓకే చెప్పేస్తోంది. ఈ స్పీడులోనే ఓ సినిమాకి వెంటనే ఓకే చెప్పేసింది. అదే మహానటి సావిత్రి జీవిత కథ ఆధా రంగా తీస్తున్న సినిమా. ఈ సినిమాలో సమంత జమునగా నటించబోతోందట! ఈ పాత్రకు మొదట చాలా మంది పేర్లు పరిశీలించినా, చివరకు సమంత అయితేనే సరిపోతుందని భావించారట! సమంత కూడా ఈ సిని మాకు వెంటనే ఓకే చెప్పేసిందట! అక్కినేని కుటుంబంతో సావిత్రికి, జమునకు విడదీ యరాని బంధం ఉంది. ఈ సినిమా చేయడానికి ఇది కూడా ఓ కారణం అంటున్నారు కోలీవుడ్ జనాలు.

నాకు మనశ్శాంతి లభించింది. అప్పుడే ఈ విషయం చెబితే నీ మనసు ఎలా స్పందిస్తుందో తెలీదు, నీలోని మాతృ ప్రేమని వినియోగించుకున్నాను.” అన్నాడు వగరుస్తూ.

అనసూయ హృదయం దు:ఖంతో నిండిపోయింది. వెక్కి వెక్కి ఏడ్చింది. “అయామ్ సారీ అనసూయ! నిన్ను ఇలా ఏడిపిస్తాననుకోలేదు” అన్నాడు పశ్చాత్తాపంతో. “మీరు ఇప్పుడు చెప్పడమే కరెక్ట్. అప్పుడే తెలిసుంటే నా రియాక్షన్ ఎలా ఉండేదో” అంది.

“ఆయన పోయినప్పటికన్నా ఇప్పుడే బాధగా ఉంది” అంది అనసూయ. సూర్యనారాయణ ఏమీ మాట్లాడలేదు. పొద్దుపోయాక సద్గుణ్, రాందాస్ వచ్చారు. “ఊరు సూపర్‌గా ఉందమ్మా. ఎక్కడ చూసినా కొబ్బరి చెట్లు, పచ్చటి పైర్లు, క్యాథలిక్ చర్చ్, ఈఫిల్ టవర్, హార్బర్. అన్నీ చూశా” అన్నాడు ఉత్సాహంగా. అనసూయ స్పందించలేదు. మొదటిసారిగా సద్గుణ్‌ని తేరిపారా చూసింది. “ఏంటమ్మా కొత్తగా చూస్తున్నావ్” అడిగాడు.

“అవున్రా, నాక్కూడా అంతా కొత్తగా ఉంది” అంది.

తిరుగు ప్రయాణంలో అనసూయ ఏం మాట్లాడలేదు. సద్గుణే గలగలా మాట్లాడేస్తున్నాడు.

ఇంటికి చేరేసరికి ఆమని, తరంగిణి ఎదురు చూస్తున్నారు. “ఎక్కడికెళ్ళారు.. అమ్మా కొడుకులు” అడిగింది వ్యంగ్యంగా ఆమని. “నాకు కొడుకైతే నీకు తమ్ముడేగా” తల్లి మాటకు చురుగ్గా చూసింది ఆమని. తల్లి అలా ఎప్పుడూ రిటార్ట్ ఇవ్వలేదు. అదే మొదటిసారి.

“రేపు ఉదయం మీ నానమ్మని చూడ్డానికి ఊరెళ్తున్నాం అందరం” అంది అనసూయ.

“వాడు కూడానా?” అడిగింది ఆమని.

“ఏం వాడు మనిషి కాడా? మీలాగా ఎంత కాలం దూరదూరంగా తిరుగుతాడు. వాడికి హక్కు లేదా?” అంది కోపంగా. తల్లి ధోరణి అయోమయం అనిపించింది ఆమనికి.

“నానమ్మకి ‘వీడి’ ముఖమంటేనే గిట్టదు. చూస్తే మరింత ఇరిటేషన్ వస్తుంది.” అంది తరంగిణి.

“అదీ చూద్దాం” మొండిగా అంది అనసూయ. ఆరు నెలలుగా మాటా పలుకు పడిపోయి మంచాన ఉంది నాగమణి. చుట్టపు చూపుగా కూడా పోయింది లేదు అనసూయ.

“దానికి ఒళ్ళంతా పొగరు.” మంచాన పడే ముందు రోజు కొడుకు కృష్ణమూర్తితో అందట.

ఆ మాట ఆమని తనకి చెప్పింది. “నిజమే ఎంత పొగరు లేకపోతే మగరాయుడిలా ఈ ఇంటిని చూసుకుంటాను” అంది అనసూయ వ్యంగ్యంగా.

“సద్గుణ్ నువ్వు కూడా రెడీకా”

“నిజమా.. అమ్మా..” అన్నాడు సంభ్రమాశ్చర్యాలతో.

“నిజమేరా.. నీక్కూడా నానమ్మే కదా!”

సద్గుణ్ ముఖం మతాబులా వెలిగిపోయింది.

సడన్‌గా పిల్లలతో కలిసివచ్చిన వదినను ఆప్యాయంగా ఆహ్వానించాడు కృష్ణమూర్తి. సద్గుణ్ రావడంతో నాగమణి ముఖం అప్రసన్నంగా మారింది. అత్తగారి పక్కన కూర్చుంది అనసూయ.



## రాశీకి ఏమైంది

*తన అందంతో కుర్రకారు గుండెల్లో చోటు సంపాదించుకున్న రాశీఖన్నా ఈమధ్య జీవితం గురించి తెగ ఫిలాసఫీ చెబుతోంది “అందంగా ఉన్నవాళ్లను చూసి, ‘మనం అలా లేం’ అని అదే పనిగా బాధపడిపోతారు కొంతమంది అమ్మాయిలు. అది వారి ఆత్మవిశ్వాసాన్ని దెబ్బతీస్తుంది. దేవుడిచ్చిన రూపం గురించి ఆలోచించి బాధపడే బదులు మీరు ఎందులో బెస్టో తెలుసుకుని, ‘మనకు మనమే బెస్ట్’ అనుకుని చూడండి.. మీ కాన్ఫిడెన్స్ లెవెల్ పెరుగుతుంది. జీవితాన్ని ఎలా తీసుకుంటున్నాం? అనేదాని మీదే మన మనశ్శాంతి ఆధారపడి ఉంటుంది. మన కోసం మనం బతకాలి. ఇతరుల కోసం బతకడం మొదలుపెడితే జీవితంలో రాజీపడాల్సి వస్తుంది” అని అంటోంది ఈ అందాల తార. రాశీ మాటలు విన్నవారందరూ రాశీకి ఏమైంది అనుకుంటున్నారట.*

“సద్గుణ్, నానమ్మ కాళ్ళకు నమస్కారం పెట్టు నాయనా” చెప్పింది. అత్తవైపు తిరిగి, “మీ మనవడు స్టేట్ ఫస్ట్ వచ్చాడు అత్తయ్యా” అంది.

“వీడు నా మనవడేంటి” నాగమణి కళ్ళలో అప్రయత్నంగా క్రోధం ప్రతిఫలించింది.

చాలాకాలం తర్వాత వచ్చిన వదినతో కృష్ణమూర్తి గొడవ పడదల్చుకోలేదు. కూరగాయలు తేవడానికి అంటూ కృష్ణమూర్తి బయటకు నడిచాడు. అతడి భార్య శారద వంటపనిలో నిమగ్నమైంది. ఆమని, తరంగిణి టి.వి. చూస్తున్నారు. సద్గుణ్ కూడా వెళ్ళి యానం విశేషాలు చెబుతున్నాడు వాళ్ళకి. అత్త మంచానికి దగ్గరగా కుర్చీ లాక్కుని కూర్చుంది అనసూయ. కోడలు అలా పక్కన కూర్చోవడం అదే మొదటిసారి. “ఏమిటన్నట్టు..” చూసింది నాగమణి.

“మీ అబ్బాయి నాకు ద్రోహం చేశాడు అత్తయ్యా!”

అర్థంకానట్టు కళ్ళు రెపరెపలాడిస్తూ అనసూయ కేసి చూసింది నాగమణి.

అంటరాని వాడని మీరు దూరం పెట్టిన సద్గుణ్, స్వయాన మీ అబ్బాయి రక్తం. దళితుడైన సూర్యనారాయణ చెల్లెలితో సంబంధం పెట్టుకున్నారాయన. ఆయన ‘కన్న’ బిడ్డ వాడు. ఇప్పుడు చెప్పండి వాడు అంటరాని వాడా? ధర్మపత్నికి అన్యాయం చేసిన మీ అబ్బాయి అంటరాని వాడా?”

అనసూయ ప్రశ్నకు బిత్తరపోయి చూసింది నాగమణి.

“ఏంటీ? నమ్మకం లేదా! వాణ్ణి చూడండి ఎక్కడో చూశాను ఈ ముఖం అనుకునేదాన్ని. అచ్చు మీ కొడుకు పోలికే. గమనించండి. మీ అభిజాత్యానికి ఇప్పుడు ఏ సమాధానం చెప్పుకుంటారు? వీడు మీ అబ్బాయిలా ద్రోహి కాదు అత్తయ్యా. ప్రేమకు పర్యాయపదం. మీ కొడుకు బిడ్డే అని తెలిసినప్పుడు నాకు ఒక నిమిషం కళ్ళు తిరిగాయి. ఆ పసివాడి మీద కూడా కోపం వచ్చింది. గంటసేపు వాడితో మాట్లాడలేదు. వాడికి సంబంధం లేని ‘తప్పు’కి వాణ్ణి ఎందుకు బాధ్యుణ్ణి చేయాలని నన్ను నేను సముదాయించుకున్నా.

ఎన్నో ఏళ్ళుగా వాడు అక్కయ్యల ప్రేమ కోసం పరితపిస్తూనే ఉన్నాడు. కులం, గోత్రం లేని వాడని అవహేళనచేసి మీరే నిజమైన అంటరాని వారిగా మారిపోయారు. ఆ పసి హృదయాన్ని గాయపరిచారు.” నాగమణి మాట్లాడలేదు. ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరుగుతున్నాయ్.. చేతులెత్తి కోడలికి నమస్కరించింది.

“ఈ భూమ్మీద మీకుతప్ప ఎవరికీ ఈ నిజం చెప్పను. నోరు పడిపోయిన మీరు బాహ్య ప్రపంచానికి చెప్పలేరు. తన తండ్రి ద్రోహ చరిత్రను నా పిల్లలకు కూడా చెప్పను. ఏదో ఒకరోజు వాళ్ళు మనసు మారి తమ్ముడిలో రక్తసంబంధాన్ని వాళ్ళే చూసుకుంటారు” అనిచెప్పి క్షణం కూడా ఆగకుండా పిల్లల్ని తీసుకొని రోడ్డు మీదకి వచ్చేసింది అనసూయ. తల్లి హడావిడిగా ఎందుకు రిటన్ అవుతుందో అర్థంకాక కొట్టు మిట్టాడారు ఆమని, తరంగిణి. “నానమ్మ నిన్ను ఏమైనా తిట్టిందా అమ్మా?” అడిగాడు సద్గుణ్.

“అనే స్థితిలో ఆమె లేదు కదరా..” అంది అనసూయ.

కాల చక్రం గిర్రున తిరిగింది. సద్గుణ్ మెడిసిన్ పూర్తి చేసి ‘ఫార్మా’ కంపెనీ పెట్టాడు. సద్గుణ్ మళ్ళీ ఫోన్ చేయడంతో అనసూయ ఆలోచనలు తెగాయి. ఇహలోకంలోకొచ్చింది. “సూర్యనారాయణగారు పోయారటమ్మా.. రాందాస్‌గారు ఇప్పుడే ఫోన్ చేశారు..” చెప్పాడు సద్గుణ్.

“అయ్యో...” అంది అప్రయత్నంగా అనసూయ.

“అంతదూరం జర్నీ నువ్వు చేయలేవమ్మా.. నేను

సరస్వతి అంతిమ సంస్కారానికి హాజరై వస్తాం" చెప్పాడు.

"సరే నాయనా.." అంది అనసూయ.

సూర్యనారాయణ దగ్గర్నుంచి వచ్చినప్పట్నుంచి అనసూయ మానసికంగా బాగా కుంగిపోయింది. భర్త తనకు 'ద్రోహం' చేశాడన్న ఆలోచన ఆమెలోని స్త్రీ హృదయాన్ని కుంగదీసింది. తత్ఫలితంగా ఆమె ఆరోగ్యం చెడిపోయింది. తాను పోయే లోపు 'అక్కా, తమ్ముళ్ళ'ని కలపాలన్నదే ఆమె సంకల్పం.

దానిని భగవంతుడు బలంగా గుర్తించినట్టున్నాడు రెండు సంఘటనలు చక...చకా జరిగాయి.

ఆమని భర్త విశ్వరూప్ పనిచేసే ఐ.టి కంపెనీ మూత పడటంతో ఆ కుటుంబం వీధిన పడినంత పనైంది. విషయం తెలిసిన సద్గుణ్ వెంటనే స్పందించాడు. తన కంపెనీలో 'వాటా' ఇచ్చి యం.డి పోస్ట్ కూడా ఇచ్చాడు. ఆమనిది అవునూ, కాదూ అని చెప్పలేని పరిస్థితి.

కాలేజ్ లెక్చరర్‌గా పని చేస్తున్న తరంగిణి క్లాస్ రూంలో పడిపోయింది. హుటాహుటిన హాస్పిటల్‌కి తరలిస్తే 'బ్రెయిన్'లో 'బ్లడ్' క్లాటయ్యిందని తేల్చారు వైద్యులు.

నిర్లక్ష్యం చేస్తే పెరాలసిస్ వచ్చే ప్రమాదం ఉందని హెచ్చరించారు వైద్యులు.

అక్కని ఫారిన్ పంపించి ప్రాణాలు కాపాడాడు సద్గుణ్.

కాలం గిర్రున తిరిగి మళ్ళీ సంక్రాంతి వచ్చింది. అందరూ ఒక దగ్గర చేరారు. సద్గుణ్ కళ్ళలో కోటి మతాబులు.. అక్కలూ, తమ్ముడూ కలిసి తల్లి సమాధి సందర్శించడానికి వెళ్ళారు.

అప్పటికి అనసూయ కాలం చేసి ఆరునెలలైంది.

"మనం ఇలా కలిసిన దృశ్యం చూస్తే అమ్మ ఎంతో సంతోషపడేది" అంది ఆమని.

"నువ్వు లేకుంటే మా పరిస్థితి ఏంటి తమ్ముడూ, మాకు అమ్మా నాన్న నువ్వే అయ్యావు" తరంగిణి కన్నీళ్ళు పెట్టుకుంది. "ఏంటక్కా ఇది" అక్క కన్నీళ్ళు తుడిచాడు సద్గుణ్. "నువ్వు మాకు దేవుడిచ్చిన మా మంచి తమ్ముడివిరా" అంది ఆమని. "మనది రక్తసంబంధం కంటే గొప్ప సంబంధంరా.." అంది తరంగిణి.

మకర సంక్రాంతి తర్వాత, మాత పితృ కర్మలు చేశారు.

దూరం నుండి కాకులు రెండూ అనసూయమ్మ ఆత్మశాంతి కోసం పెట్టిన పిండాన్ని ఇష్టంగా తింటున్నాయి.

"అవి మన అమ్మా నాన్నలేమో" అన్నాడు అప్రయత్నంగా సద్గుణ్.

"అవును మన అందరి నాన్నా ఒక్కడే" నవ్వుతూ అంది ఆమని.

సద్గుణ్ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఆరు నెలల క్రితం అనసూయమ్మ ఫోన్ చేసింది.

"రేపటికల్లా నువ్వు ఇక్కడ ఉండు నాయనా" అంది ఆయాసంగా.

'ఎందుకని' అడగలేదు సద్గుణ్. రాత్రికి రాత్రే వెళ్ళి తల్లిని చూశాడు.

సద్గుణ్ మీదే ప్రాణం నిలుపుకున్నట్టు ఎదురు చూస్తోంది.

"నీకో విషయం చెప్పాలి నాన్నా" అంది రొప్పుతూ.




## ఇప్పుడు

అవును..ఇప్పుడు
నువ్వూ నేనూ ఎదురుపడినా
మాట్లాడుకోవడం మానేశాం!
నీకూ నాకూ మధ్య
సెల్లుభూతమొచ్చి తిష్టవేశాక
మనసువిప్పి మాట్లాడుకోవడం మానేశాం!
ఇదివరకే నయంగదా!
నీవూ నేనూ తరచు కలుసుకునేవాళ్లం
అనుభూతులనెన్నో తనివితీరా పంచుకునేవాళ్లం



కష్టమొస్తే ఓదార్చుకునేవాళ్లం
గట్టెక్కేందుకు కలసే ఓ దారిని కనుక్కునేవాళ్లం!
ఆనందపుగడియలైనా సరే
పరస్పరం పంచుకోవడం ఆనవాయితీ
ఇదివరకు మనలోకి మనం
పచ్చనికవితల్లా ప్రసరించేవాళ్లం
తడితనంతో గుండెల్ని తడుముకునేవాళ్లం
ఇప్పుడు మనమధ్యకి సెల్లులొచ్చేసాయి
సెల్లులేని ఇల్లులేదిపుడు
సెల్లువల్ల ఏ ఇల్లూ ఇల్లులా లేదు
సెల్లువల్లే మనం మనంలా లేము
ఎవరిలోకం వారిదే
ఎవరిపోకడ వారిదే
సందేశాలకే బాంధవ్యాలు పరిమితం
ఆచరణకొచ్చే సరికి అవన్నీ శూన్యాలు!
ఇప్పుడు మనమంతా
సెల్లుమాయలో చిక్కుకుపోయాం
మానవత్వాన్ని పోస్టింగుల్లోనే బతికిస్తున్నాం
వీధుల్లో ఆకలితో అల్లాడే
అనాథపిల్లాడి ఫోటోలను తీసి చూపిస్తున్నాం
అంతేగానీ
ఓ ముద్దబెట్టి ఆదరించడం మానేశాం
చీమ చిటుక్కుమన్నా
పిట్ట ఎగిరినా
ఆఖరికి మనం అన్నం తింటున్నా
అవన్నీ పోస్టింగులుగా మలచి మురుస్తున్నాం!
మనం ఏ చప్పుడు చేయాలన్నా
ఇప్పుడు సెల్లే దిక్కయిపోవడం శోచనీయం
ఇపుడందరం..
సెల్లువ్యూహంలో ఇరుక్కుపోయాం
నిన్నూ నీ వేషాల్నీ నువ్వు చూపిస్తుంటే
నన్నూ నా వేషాల్నీ నేను ప్రకటించుకుంటున్నా!
మనక్కావలిసింది "లైకుల" భాషొక్కటే
మనం ఎవరిలోకం వారిగా తచ్చాడుతున్నాం
ఎవరికివారే యమునాతీరుగా మారిపోయాం!
ఇప్పుడు..
నువ్వూ నేనూ
ఎదుటున్న మనుషుల్ని చూడ్డం మాని
సెల్లుని చూడడమే మరిగాం
సెల్లులోనే ఇతరుల్ని చూడ్డానికి మారాం!
నిజమైన విలువైన
మానవసంబంధాల్ని కత్తిరించుకుంటూ
కృత్రిమమైన చెలువులేని
సెల్లుబంధాలతాళ్లని పేనుకుంటున్నాం!
ఇపుడు..
తెల్లారిలా మనం మనుషుల్లా లేం
ఒక సెల్లు పనిముట్టులా ఉన్నాం
ఇపుడు మనం మనంలా లేం
చిన్న సెల్లుకి బానిసల్లా తయారయ్యాం!

**–మెట్టా నాగేశ్వరరావు**

"ఏంటమ్మా" అడిగాడు. డైరీ చూపించింది. అప్రయత్నంగా పేజీలు తిప్పాడు.

"దయాకర్ నా చెల్లితో సంబంధం పెట్టుకుంటాడని ఊహించలేదు. భయపడి ఎవరికీ చెప్పకపోవడం వల్ల అది నెలతప్పి ఐదు నెలలైంది. 'అబార్షన్' చేస్తే తలకీ బిడ్డకీ ఇద్దరికీ ప్రమాదం అన్నారు డాక్టర్లు.

నా కాళ్ళా వేళ్ళా పడ్డాడు. తప్పైపోయిందన్నాడు. భార్యకి తెలిస్తే ఆత్మహత్య చేసుకుంటుందని భయపడ్డాడు. బిడ్డని కని నా చెల్లి చనిపోయింది. వీణ్ణి నేను సాకుతానని తీసుకెళ్ళి అనాథాశ్రమంలో వదిలాడు. నెల రోజులు కన్పించలేదు. నెల తర్వాత మళ్ళీ వచ్చి 'నిమ్నజాతి' కులం పిల్లతో కలిసి బిడ్డని కన్నానని తెలిస్తే మా అమ్మ నన్ను వెలివేస్తుంది. నా భార్య నాకు దక్కదు. ప్లీజ్ సూర్యనారాయణ, నా బిడ్డను కాపాడు అంటూ కాళ్ళా వేళ్ళా పడ్డాడు. ఆ భారాన్ని నేనే భరించాలనుకున్నా. నా వ్యాధీ.. నా అంతరాత్మ పిల్లాణ్ణి నీకు అప్పగించమని బోధించింది. బహుశా దయాకర్‌ది రోడ్డు ప్రమాదం కాదనుకుంటున్నా.

తీవ్రమైన డిప్రెషన్‌కి లోనయ్యి రోడ్డుకి అడ్డంగా నడిచి ప్రాణాలు పోగొట్టుకున్నాడు. నీకిదంతా చెప్పగలనో లేదోనని ఈ డైరీలో రాస్తున్నానమ్మా" సూర్యనారాయణ డైరీ అది. అర్థమయ్యీ కానట్టూ అనసూయవైపు చూశాడు సద్గుణ్.

"ఆయన కొడుకివే నాన్నా నువ్వు. నీ తోబుట్టువులైన అక్కలు వాళ్ళు. మీ నాన్న రక్తం పంచుకు పుట్టిన వాళ్ళు ఇవాళ కాకున్నా రేపైనా తప్పక నీతో కలుస్తారు, దిగులు పడకు నాన్నా" అంటూ కన్ను మూసింది అనసూయ. సూర్యనారాయణ డైరీని కూడా తల్లి చితిలో వేసి దహనం చేశాడు సద్గుణ్.

**సెల్: 99897 73549**




**'సారు చాలా బిజీ. ఒక్క నిమిషం కూడా ఆలస్యం చేయటానికి వీలుపడదు. మీరు అడగాలని అనుకుంటున్నది ఏదో తర్వాత అడగండి. ఇక్కడ పని పూర్తిచేసుకుని హాస్పిటల్‌కి వచ్చేయండి' నిదానంగా చెప్పాడు డ్రైవర్, ఆ లీడర్‌కి.**

**'అదే... ఆ పని గురించే మాట్లాడాలి. వాడు రాయుడిపల్లి నించి ఎటో జంప్ అయి పోయినాడు. వాడి బుల్లెట్ బండి అక్కడే ఉండిపోయింది' అన్నాడు లీడర్.**

'అయితే ఇంకేంటి? పోయి ఆ బండి దగ్గరే కూర్చోండి. తప్పకుండా వచ్చేస్తాడు' అన్నాడు డ్రైవర్.

'ఆళ్ళు... ఆ ఇంటివాళ్ళు అందుకు ఒప్పుకోవటం లేదు?' అన్నాడు లీడర్.

కనులు చిట్లిస్తూ తన బాస్‌వైపు చూశాడు డ్రైవర్. 'రాయుడిపల్లి ఏమంత పెద్దదికాదు. అక్కడి జనం కూడా ఏమంత తెలివైనవాళ్ళు కాదు' అన్నాడు.

'నువ్వు నాకు చెప్పాల్సిన అవసరం లేదు. నాకు తెలుసు. మన గుర్రపోడు ఎక్కడ ఉన్నాడోకాని, వాడిని వాళ్ళకి తగిలించు. వాడే చూసుకుంటాడు' అసహనంగా అన్నాడు బాజిరెడ్డి.

'ఫోను ఒకసారి ఇవ్వండి' చేయిజాచాడు డ్రైవర్, తన ఫోను ఏమయిపోయిందో చెప్పకుండా.

విసుగ్గానే చూస్తూ తన ఫోనును అతనికి అందించాడు బాజిరెడ్డి.

'అరేయ్ గుర్రపోడా, నువ్వు వెంటనే చింతలపల్లి వచ్చేయ్. ఇక్కడవాళ్ళని తీసుకుని రాయుడిపల్లి పోయి అక్కడ జరగాల్సింది ఏమిటో దగ్గరుండి జరిపించు' ఫోన్ చేసి, అవతలి పక్క నుంచి సమాధానం రాగానే చెప్పాడు డ్రైవర్.

'మీ పని సజావుగా జరిగిపోతుంది. మా మనిషి మిమ్మల్ని అక్కడికి తీసుకుపోతాడు. రాయుడిపల్లిలో వాడికి చాలామంది తెలిసినవాళ్ళున్నారు' తన మాటల్ని శ్రద్ధగా వింటున్న లీడర్‌కి చెప్పాడు.

'అన్నా... ఓయ్ అన్నా! ఒక్క నిముషం ఆగు. నేను చెప్పేది వినిపించుకో' అవతల నుంచి గుర్రపోడు కంగారుగా అరుస్తున్న అరుపుల్ని పట్టించుకోకుండా ఫోన్‌ని ఆఫ్‌చేసి వెహికల్‌ని ముందుకు పోనిచ్చాడు.

***

పాంటుజేబులో ఉన్న సిగరెట్ పాకెట్‌ని బయటికి తీసి, సిగరెట్‌ని పెదవుల మధ్య పెట్టుకుంటూ నడుస్తున్న వెట్టికి చాలా సన్నగా వినిపించింది ఏదో కారు వేగంగా వస్తున్న శబ్దం.

సిగరెట్ వెలిగించుకోవాలన్న కోరికను వెంటనే వాయిదా వేసేసుకుని రోడ్డు దిగి ఒక పక్కగా నిలుచున్నాడు అతను.

బాజిరెడ్డి జనం గాని, తన కోసం పిచ్చి పట్టినట్టు వెతికే గ్రానైట్ మైన్స్ ముఠాగాని ఆ కారులో ఉండి ఉంటేనే తను ప్రాబ్లమ్ ఫేస్ చేయవలసి వస్తుందని అనిపిస్తున్నా కూడా అవతలికి అడుగు వేయలేదు.

సిటీ వైపునుంచి రావటం లేదు అది. చింతలపల్లి వైపునుంచి వస్తోంది. తనకోసం గాలించేవాళ్ళు సిటీ నుంచే వస్తారు.

చూస్తూ చూస్తూ ఉండగానే సమీపంలోకి వచ్చేసింది ఆ వెహికల్. ఒక అడుగు రోడ్డు మీదికి వేసి, చేతిని ముందుకు జాచాడు అతను.

చీకటి సమయం కావడం వల్ల రోడ్డుమీద ఎవరూ కనిపించరన్న నమ్మకంతో మహా స్పీడుగా నడుపుతున్న ఆ డ్రైవర్ ఉలికిపడి, బ్రేకుల మీద కాలు వేసినట్లున్నాడు. కీచు ధ్వనులు చేస్తూ, కొంచెం వంకరటింకరగా నడుస్తూ పాతిక గజాల దూరం పోయి ఆగింది అది.

పరిగెత్తుకుంటూ పోయి డ్రైవర్‌ని పలకరించాడు వెట్టి. 'దారి మధ్యలో నా వెహికల్ పాడైపోయింది. మీరు సిటీకి వెళుతున్నట్లయితే, దయచేసి కాస్తంత లిఫ్ట్ ఇవ్వగలరా?'

మిర్రిమిర్రి చూశాడు డ్రైవర్. తన గొంతు ఎండుకుపోతున్నట్టు గుటకలు మింగాడు.

'లిఫ్టు అడిగాను సారూ. సిటీ దాకా తీసుకుపో–' మధ్యలోనే ఆగిపోయింది వెట్టి మాట. చలిగాలి వీస్తున్నట్టు ఒక్కసారిగా జలదరించింది ఒళ్ళు. సూదుల మాదిరి లేచి నిలుచున్నాయి మెడమీది వెంట్రుకలు.

వెనక్కి జంప్ చేయాలని, అతి వేగంగా పొదల్లోకి పారిపోవాలని అనిపించింది. కాళ్ళు మాత్రం కొంచెంగా కూడా కదలలేదు.

తను ఆపబోతున్నది బాజిరెడ్డి కారునని ముందుగానే గ్రహించలేకపోయినందుకు తనను తానే నిందించు



కుంటూ అలాగే నిలుచుండిపోయాడు.

***

నిద్ర పట్టలేదు ప్రత్యూషకి. చిరాకుగా తల విదిలించి, తను కూర్చున్న కుర్చీలో నుంచి లేచింది.

డాక్టరుగారు ఇచ్చిన టాబ్లెట్‌ని వేసుకున్న వెంటనే, ఎటువంటి పొజిషన్‌లో నిద్రకు ఉపక్రమించిందో, ఆ విధంగానే నిద్రపోతున్నది పిచ్చమ్మి. ఒక్క అంగుళం కూడా అవతలికి ఇవతలికి జరగడం లేదు.

ఆమెకు నిద్రాభంగం కలుగకూడదని డైనింగ్ హాల్‌లో నుంచి కదిలించలేదు ఎవరూ. తాము కూడా అదే మాదిరి డైనింగ్ టేబిల్ మీద తలలు పెట్టుకుని కునికిపాట్లు పడుతున్నారు.

'ఏమిటి ప్రత్యూషా?' ప్రత్యూష కుర్చీలో నుంచి లేచిన వెంటనే కనులు తెరుస్తూ అడిగింది శివారెడ్డి భార్య.

'గొంతు ఎండుకుపోతున్నట్లుంది వదినమ్మా. మంచి నీళ్ళు తాగాలి' అంటూ కిచెన్‌వైపు నడిచింది ప్రత్యూష.

డైనింగ్ టేబిల్ మీద ఉన్న వాటర్ బాటిల్స్ వైపుగాని, మంచినీళ్ళ జగ్గుల వైపుగాని ఆమె చూడలేదు. తనలో తను నవ్వుకుంటూ తాను కూడా లేచి ఆమెను అనుసరించింది శివారెడ్డి భార్య.

'సంపంగి మీద నీకు ఎలర్జీ ఎక్కువైపోయింది. అది ఏం చేస్తోందో చూడటం కోసం లేచావు. దాహం తీర్చుకోవటానికి కాదు' పక్కగా నడుస్తూ చిన్నకంఠంతో అన్నది.

'అది ఒక కట్లపాము. దాని లక్షణాలు తెలిసిన తర్వాత కూడా తెలియనట్టు నటించటం చాలా కష్టం' చెప్పింది ప్రత్యూష.

'నిజమే. కాని ఏ పని చేయటానికైనా సమయం సందర్భం ఉంటాయి. ఇప్పటికిప్పుడు మనం సంపంగి జోలికిపోతే, ఎటువంటి ఉపయోగం ఉండదు. తనకు ఏమీ తెలియదని, తను వట్టి అమాయకురాలినని అంటుంది. మన పనివాళ్ళందరూ దాన్నే సమర్ధిస్తారు. లేనిపోని రగడ' చిన్నగా వినవచ్చింది శంకరయ్య కంఠం.

అదిరిపడి వెనక్కిచూశారు ప్రత్యూష, శివారెడ్డి భార్య. వాళ్ళ కదలికలు తన నిద్రను కూడా చెడగొట్టాయి కాబోలు, పై పంచెతో ముఖం తుడుచుకుంటూ తను కూడా వచ్చేశాడు.

'అది కాదు నాన్నా.. అది ఇప్పుడు ఏం చేస్తోందో...' అంటూ మొదలుపెట్టబోయిన కూతురి వైపు కొంచెం సీరియస్‌గానే చూశాడు శంకరయ్య.

'అర్ధరాత్రి దాటి చాలాసేపయింది. ఈ టైములో నువ్వు నేను తప్ప ఇంకెవరూ మెలుకువగా ఉండటం జరగదు. నిద్రపోతున్నదాని దగ్గరికిపోయి ఏం చేద్దామని నీ ఉద్దేశం? గొంతుపిసికి చంపేస్తావా?' కోపంగా అడిగాడు.

'మీరు అనవసరంగా కోపం చేస్తున్నారు శంకరయ్య..' వెంటనే శివారెడ్డి భార్య.

'మీరు ఊరుకోండమ్మా... రానురాను వీళ్ళకి తొందరపాటు ఎక్కువైపోతోంది. ఇది నవ్వులాటలకు సంబంధించిన విషయం కాదు. సంపంగి జోలికి మనం పోయిన మరుక్షణం ఆ బాజిరెడ్డి కలగజేసుకుంటాడు. వాడు పెట్టే పెటకాల్ని తట్టుకోవటం చాలా కష్టం. వచ్చేయండి వెనక్కి' చిన్న కంఠంతోనే చాలా గట్టిగా కసురుకున్నాడు శంకరయ్య.

తల వంచుకుని తిరిగి డైనింగ్ రూమ్‌లోకి బయలుదేరిన ప్రత్యూషవైపు జాలిగా చూసి తల ఎగురవేసింది శివారెడ్డి భార్య.

'తనతోపాటు నేను కూడా వచ్చాను. మరి నన్ను కసురుకోలేదేమిటి?' అని అడిగింది.

మటుమాయం అయిపోయింది శంకరయ్య ముఖంలోని కోపం. 'ఇద్దరినీ కలిపే వెనక్కి తిరగమని చెప్పాను కదా తల్లీ, వదిలి పెట్టలేదు కదా' అన్నాడు.

చిన్నగా నవ్వి తల విదిలించింది ఆమె. 'ఆ విఠల్‌బాబు వచ్చిన తరువాతనే అంతా గందరగోళం అయిపోతున్నది. ఈ

## జరిగిన కథ

వెట్టి అసలు పేరు విఠల్‌రెడ్డి. తన పెత్తనాన్ని సవాలు చేసిన వెట్టిని అంతమొందించాలనుకుంటాడు బాజిరెడ్డి. చౌడేశ్వరి ఆలయానికి వెళ్ళిన వెట్టి బసవప్పను, అతడి బృందాన్ని చావమోదుతాడు. పఠాన్‌కి ప్రణవినిచ్చి పెళ్ళి చేయడానికి తాంబూలాలు పుచ్చుకుంటారు. రాయుడిపల్లిలో చౌడేశ్వరికి జరిగిన అపచారమేమిటో తెలుసుకున్న వెట్టి, అడ్డదారి గుండా కదిరి బయలుదేరతాడు. దారిలో అతడికి చౌడేశ్వరి ఆత్మశిల కనిపిస్తుంది. దాంతోపాటు అడవిలో పఠాన్ తారసపడతాడు. అతణ్ణి అరెస్ట్ చేయిస్తాడు. పిచ్చిపూజారికి ఆత్మశిల గురించి చెప్పి, ఎవరికీ తెలియకుండా ఆ తల్లిని యథాస్థానంలో ఎలా ప్రతిష్ఠించాలో ఆలోచించమంటాడు. పఠాన్ అరెస్టు విషయం తెలిసి హడావిడిగా ఇద్దరు లాయర్లతో పాటు చింతలపల్లి వెళతాడు బాజిరెడ్డి. కానీ పఠాన్‌ని విడిచిపెట్టడానికి ససేమిరా అంటాడు సబ్బిరెడ్డి. శివారెడ్డి ద్వారా ఫోన్ చేయించితేనే పఠాన్ బయటకు రాగలడని అర్థమై, వెనక్కి బయలుదేరతాడు బాజిరెడ్డి. బసవప్ప మనుషులు అతడి కారుకి అడ్డంగా నిలబడతారు.

**ఆ తర్వాత....**



గొడవలన్నిటికీ కారకుడు అతనే. వచ్చిన తర్వాత నిల బెట్టి కడిగేయాలి' అన్నది. అక్కడితో ఆగలేదు. 'చెడి పోయిన నిద్రలు ఎలాగూ చెడిపోయాయి. మొఖాలు కడుక్కుని టీలు తాగుదాము' అంటూ వెనక్కిచూసి 'సంపంగీ, ఓయ్ సంపంగీ...' అని బిగ్గరగా పిలిచింది.

మూడు క్షణాల తరువాత ముడి విడిపోయిన శిరో జాల్ని తిరిగి గట్టిగా మెలిపెట్టి ముడి వేసుకుంటూ పరుగు లాంటి నడకతో వారి దగ్గరకి వచ్చింది సంపంగి.

'మాకు నిద్రలు చెడిపోయాయి. టీలు పెట్టి తీసు కురా..' ఆర్డర్ ఇచ్చి డైనింగ్ హాలు వైపు తిరిగింది శివా రెడ్డి భార్య.

ఆ మాటలు తనకు అర్థం కానట్టు కనులు పెద్దవి చేసి అలాగే చూస్తూ నిలబడి పోయింది సంపంగి.

'మేము నిద్రలు లేచాము. మాకు టీలు కావాలి. అర్థం అయిందా?' ఒక్కొక్క మాటా ఒత్తి ఒత్తి పలు కుతూ మరోసారి చెప్పింది ఆమె.

అప్పటికి వదిలిపోయింది సంపంగి నిద్ర మత్తు. గబగబా తల ఊపి, కిచెన్‌లోకి పరుగు తీసింది.

***

'నువ్వు గుడి దగ్గరికని వచ్చింది ఎప్పుడు?' డోర్ తెరిచి వెట్టిని వెనుక కూర్చోమని తల ఊపుతూ అడి గాడు ముందు సీట్లో ఉన్న బాజిరెడ్డి.

శరవేగంతో ఆలోచించి సమాధానం ఇచ్చాడు వెట్టి. 'అయ్యో... ఏం చెప్పమంటారు సారు. రావటం అయితే ఎక్కడా ఆగకుండా సూటిగా వచ్చేశాను. దర్శనం అయిన తర్వాత నుంచీ నాకు కష్టాలు మొదలయ్యాయి' ఎంతో చిరాకు పడుతున్నట్టు చెప్పాడు.

'కష్టాలు మొదలయ్యాయా? ఏం కష్టాలు? బాగానే ఉన్నావుగా' కనులు చిట్లిస్తూ అడిగాడు బాజిరెడ్డి.

అటు తిరిగి ఇటు తిరిగి ఆ సంభాషణ గుడి దగ్గర జరిగిన గలాటా మీదికి వస్తుందని వెట్టికి తెలుసు. అందుకే ముందు జాగ్రత్తలు తీసుకుని, తను గుడి దగ్గ రికి వెళ్ళేసరికి ఆ గొడవ జరిగిపోయిందని చెప్పాడు. రాయుడిపల్లి రవీంద్రను తన బండిమీద ఎక్కించుకుని తీసుకుపోయిన మాటను కూడా తానే చెప్పాడు.

'బండి అక్కడే ఉండిపోయింది. చేజేతులారా చేసు కున్న కర్మ' అన్నాడు.

'ఏమిటా కర్మ?' అతను ఊహించినట్లే అడిగాడు బాజిరెడ్డి.

'అడవిని గురించి అన్నీ తెలిసిన పోటుగాడి మాదిరి వద్దు వద్దని వాళ్ళు హెచ్చరిస్తున్నా వినిపించుకోకుండా ఒంటరిగా ఊరి బయటికి వచ్చి దారి తప్పాను. నడిచి నడిచి కాళ్ళు పనికి రాకుండా పోయినయ్. మీరు కని పించకపోయినట్లయితే ఇంకా నడుస్తూ ఉండేవాణ్ణి' అన్నాడు వెట్టి.

'అడివిలో నీకు వేరే జనం ఎవరూ కనిపించలేదా?' అడిగాడు బాజిరెడ్డి.

'కనిపిస్తే ఇన్నిబాధలు పడాల్సిన అవసరం ఉండేది కాదు గదా. కోతులు, కుందేళ్ళు, రెండు పాములు తప్ప ఇంకేమీ కనిపించలేదు' అంటున్న వెట్టి వైపు చూశాడు బాజిరెడ్డి కనుచివరల నుంచి.

విండోని ఆనుకుని కూర్చుని ఉన్నాడు వెట్టి. అత నికి, బాజిరెడ్డి సారుకి మధ్య జరుగుతున్న సంభాషణను అర్థం చేసుకోవటానికి శక్తివంచన లేకుండా ప్రయ త్నాలు చేస్తున్నారు అతని పక్కనే ఉన్న అడ్వకేట్లు.

కనిపించిన మరుక్షణం కాళ్ళు కీళ్ళు విరిచేసి, కాటికి

**దూరంగా వస్తున్న కారుని చూసి లిఫ్ట్ అంటూ చేయి ఊపాడు వెట్టి. రోడ్డుకు అడ్డంగా నిలబడ్డాడు. సడన్ బ్రేకుతో ఆగిన కారులోని వ్యక్తులను చూసి ఒళ్ళంతా జలదరించింది వెట్టికి. మెడమీది వెంట్రుకలు నిక్కబొడుచుకున్నాయి. అక్కడి నుంచి వేగంగా పొదల్లోకి పారిపోవాలని ప్రయత్నించాడు. ఇంతకీ ఆ కారులో ఉన్నదెవరు?**

పంపించేయటానికి సిద్ధంగా ఉన్నారు తన జనం. వాళ్ళు చాలదన్నట్టు ఆ బసవప్పని వెతుక్కుంటూ వచ్చిన గ్రానైట్‌మైన్స్ వాళ్ళని కూడా రెచ్చగొట్టి రాయుడిపల్లి వైపు పంపించటం జరిగింది.

మరెవరికీ కనిపించని ఆ శాల్తీ తమకు కనిపించటం ఒక విడ్డూరమైతే, ధైర్యంగా రోడ్డుకు అడ్డంగా నిలబడి తమ కారులోనే కూర్చోవటం ఇంకో విడ్డూరం.

అప్పటికప్పుడు ఆలోచించి ఒక బ్రహ్మాండమైన నిర్ణయం తీసుకున్నాడు బాజిరెడ్డి. చిన్నగా గొంతు సవ రించుకుని తమ డ్రైవర్ వైపు చూశాడు.

తెల్లవారకముందే సిటీ సరిహద్దుల దగ్గరికిపోయి, అనుకోకుండా తమ చేతుల్లోకి వచ్చిన పెద్దమనిషిని, అక్కడ కాపలాకాస్తున్న తమ జనానికి అప్పగించాలన్న కోరికతో, మహా వేగంగా నడుపుతున్నాడు అతను వెహికల్‌ని.

'చీకటి సమయం రా... ఇంత స్పీడు పనికిరాదు. తగ్గించు' చిన్న కంఠంతో అతన్ని హెచ్చరించాడు బాజి రెడ్డి.

అయోమయంగా చూసి, యాక్సిలేటర్ మీది పాదాన్ని కొంచెంగా వెనక్కి తీసుకున్నాడు డ్రైవర్.

'వెనకాల ఉన్న మన లాయర్లు నీ స్పీడ్ చూసి భయపడుతున్నట్లున్నారు. రోడ్డు పక్కకు తీసి కాసేపు ఆపు. కాళ్ళు తిమ్మిరి తగ్గిపోయేటట్టు రెండుసార్లు అటూ ఇటూ తిరుగుతాను' అన్నాడు బాజిరెడ్డి.

'పరవాలేదు సారూ. మాకేమీ ఇబ్బందిగా లేదు. పోనీయమనండి' అంటూ అబ్జెక్ట్ చేశాడు ఒక లాయరు.

అప్పటికే మరింత స్లో అయింది వెహికల్. రోడ్డు పక్కకు పోయి ఆగింది. 'దిగండి... దిగి కాళ్ళూ చేతులు రూడించుకోండి. ఈ దారిలో ప్రయాణం మీకు అల వాటు లేనట్టు కనిపిస్తోంది' తను సీట్లోనుంచి ఒక్క అంగుళం కూడా అవతలికి జరగకుండా చెప్పాడు బాజిరెడ్డి.

రోడ్డు పక్కకు ఉన్న డోర్‌ని తెరిచి కిందికి దిగారు వాళ్ళు. బాజిరెడ్డి సూచించినట్టే చేతుల్నీ, కాళ్ళనూ విది లిస్తూ పది అడుగులు అవతలికి పోయారు.

'నువ్వేమిటి? నువ్వు దిగవా? వెట్టిని అడిగాడు బాజిరెడ్డి.

నడిచి నడిచి కాళ్ళు పట్టేసినట్టు ఉండటం వల్ల చిరునవ్వు నవ్వుతూ తల అడ్డం తిప్పాడు వెట్టి.

'అయితే హ్యాపీగా కూర్చో. మేము కూడా దిగు తాము' అంటూ ముందుగా తను దిగాడు బాజిరెడ్డి. తరువాత దిగాడు డ్రైవర్.

సడన్‌గా వచ్చేసింది వెట్టికి అనుమానం. చటు క్కున డోర్ హ్యాండిల్‌ని పట్టుకుని బలంగా గుంజాడు.

అప్పటికే లాక్ అయిపోయి ఉంది అది. ఒక్క సారిగా ఎగసుకు వచ్చిన ఆందోళనను అదిమి పట్టు

## లక్ కోసం ఎదురుచూపు

అలియాస్ జానకి సినిమాతో తెలుగు తెరకు పరిచయం అయిన నటి అనీషా ఆంబ్రోస్. చాలా కాలంగా సరైన బ్రేక్ రాక ఒక్క హిట్టైనా కొట్టాలని చూస్తోంది ఈ ముద్దుగుమ్మ. గోపాల గోపాల, మనమంతా లాంటి సినిమాల్లో చేసిన పాత్రలకు మంచి గుర్తింపు వచ్చినా.. బ్రేక్ మాత్రం రాలేదు. సర్దార్ గబ్బర్‌సింగ్ సినిమాలో పవన్ సరసన నటించే అవకాశం వచ్చినట్టే వచ్చి చేజారిపోవటం కూడా ఈ ముద్దుగుమ్మను నిరాశపరిచిన విష యమే. ఇప్పుడు తాజాగా మంచు మనోజ్ హీరోగా తెరకెక్కుతున్న 'ఒక్కడు మిగిలాడు' సినిమాలో చేస్తున్న పాత్రైనా తనకు బ్రేక్ ఇస్తుందని ఆశి స్తోంది ఈ అమ్మడు. చూద్దాం ఏమవుతుందో?

కుంటూ, లాయర్లు దిగినవైపు జరిగాడు అతను.

అదే సమయంలో వెలిగింది డ్రైవర్ దగ్గర ఉన్న లైటర్. వేగంగా కదిలి దాన్ని ముందుసీటు మీద పడ వేసి, తను తెరిచిన డోర్‌ని టపుక్కున మూసేశాడు అతను.

అర్థం అయిపోయింది వెట్టికి, రెండవ వైపు ఉన్న డోర్ కూడా లాక్ అయిపోయి ఉంటుందని.

సీటుమీద పడిన వెంటనే మూరెడెత్తుకు లేచింది లైటర్‌లో నుంచి వెలువడిన అగ్ని జ్వాల. సీటు అంటుకున్నది. నల్లటి పొగలు సుడులు తిరుగుతూ కారు లోపలి భాగాన్ని కంటామినేట్ చేయటం మొదలుపెట్టాయి.

'శభాషయిన ఆలోచన చేశారు సార్...? మాడి మసి అయిపోతాడు. ఇంకో పది నిమిషాల్లో ఆయిల్ ట్యాంకు కూడా అంటుకుంటుంది. ముక్కలు ముక్కలై గాలిలోకి ఎగిరిపోతాడు' కారుకు దూరంగా జరుగుతూ ఆనందంగా అన్నాడు డ్రైవర్.

కాళ్ళు, చేతుల్ని విదిలించుకుంటూ అవతలికి పోయిన అడ్వకేట్లకు అర్థం కాలేదు అసలు సంగతి. 'అయ్యో.... అయ్యో... మంటలు మంటలు' అంటూ అరిచి కేకలు పెట్టబోయారు.

'పోండి... దూరంగా పోండి... ఆయిల్ ట్యాంకు పగిలిందంటే మీరు కూడా ముక్కలు ముక్కలైపోతారు' కరుకు కంఠంతో వారిని హెచ్చరించాడు బాజిరెడ్డి.

అప్పుడు కూడా అవగతం కాలేదు వారికి, అతని ఆలోచన ఏమిటో. గుబగుబలాడుతున్న గుండెల్ని చిక్కబట్టుకుని దూరంగా పరుగు తీశారు.

క్షణక్షణానికి పెరిగిపోతున్న అగ్నిజ్వాలను చూడగానే చలిగాలి వీచినట్లు జలదరించింది వెట్టి శరీరం. ఏ మాత్రం ఆలస్యం చేసినా తాను సజీవ దహనం అయిపోక తప్పదని తెలిసిపోయింది. పిడికిలి బిగించి విండో గ్లాసు మీద దబదబా మోదాడు.

టప్పుటప్పుమని శబ్దం అయితే వినవచ్చింది గాని, అద్దం పగలలేదు. కనీసం అటూ ఇటూ కదలను కూడా కదలలేదు. ఎడమ కాలు జాచి, రెండో వైపున ఉన్న అద్దాన్ని బలంగా తన్నాడు.

అది కూడా నిలువరించింది అతని ప్రయత్నాన్ని. వట్టి చేతులతోనో కాళ్ళతోనో అద్దాలను పగలగొట్టడం కుదిరే పని కాదని తెలిసిపోయింది అతనికి. బలమైన పనిముట్టు ఏదైనా కనపడుతుందేమోనని కలియ చూశాడు కారు లోపలి భాగాన్ని.

కమ్ముకుంటున్న పొగల్ని భరిస్తూ, ఎంతోసేపు వెతకవలసిన అవసరం లేకపోయింది. తలను పక్కకు తిప్పిన మరుక్షణం అతనికి కనిపించాయి కారు వెనుక భాగంలో, సీటుకు వెనుక అద్దానికి మధ్యలో ఉండే ఖాళీ ప్రదేశంలోని వాటర్ బాటిల్స్.

దూరాభార ప్రయాణంలో గొంతులు తడుపుకోవటానికి, బాజిరెడ్డి అడ్వకేట్లు తమ వెంట తెచ్చుకున్నవి అవి. నోటికి వచ్చిన దేవతల పేర్లన్నిటినీ తలుచుకుని మనస్సులోనే కృతజ్ఞతలు తెలియచేసుకుంటూ వాటిని అందుకుని ఓపెన్ చేశాడు. ముందు సీటు సగ భాగాన్ని ఆవరించుకోబోతున్న మంటల మీద వాటిలోని నీటిని వంపేశాడు.

మరో రెండు క్షణాల్లో అదుపు తప్పబోతున్నట్టు కనిపించిన ఆ మంటలు చిటుక్కున మలిగిపోయాయి.

ఖాళీ అయిన బాటిల్స్‌ని కిందికి వంచి, వెనుక సీటులో నుంచి స్టీరింగ్ ముందుకు జంప్ చేశాడు అతను.

హడావుడిగా కిందికి దిగి, అతని అంతు చూడాలన్న కోరికతో తపించిపోయిన బాజిరెడ్డి డ్రైవర్, రెండు తప్పులు చేశాడు.

లైటర్ సాయంతో కారుకు నిప్పు పెట్టేముందు, లోపల ఉండిపోయిన వాటర్ బాటిల్స్‌ని గురించి పట్టించుకోకపోవటం ఒక తప్పు అయితే, తను దిగేటప్పుడు కారు కీస్‌ని తనతో పాటు తీసుకోక పోవడం రెండవది.

చీకటితో నిండి ఉంది కారు లోపలి భాగం. అయినా సరే చేతిని ముందుకు జాచిన వెంటనే వెట్టికి తగిలాయి అవి. పెదవుల మీదికి రాబోయిన చిరునవ్వును అదిమి పట్టుకుంటూ, చిటికెలో స్టార్ట్ చేశాడు. గేర్ మార్చి ముందుకు దూకించాడు.

'ఆపు.. ఆపేయ్.. వాడిని ఆపేయ్..' కంగారుగా అరిచాడు బాజిరెడ్డి.

మంటల్లో పడి మాడి మసి అయిపోవాల్సిన ఆ శాల్తీ, ప్రమాదం నుంచి తప్పించు కోవటమే కాకుండా, తన కారులోనే దూరంగా పారిపోతూ ఉండటాన్ని చూసి తట్టుకోలేక పోయాడు బాజిరెడ్డి. కింద కనిపించిన పలుగు రాయిని ఒకదాన్ని అందుకుని బలంగా విసిరాడు. ఆ రాయి గాలిలోకి లేస్తున్న సమయంలోనే, వంద అడుగుల దూరం వెళ్ళిపోయింది కారు.

బాజిరెడ్డి మాదిరిగా రాళ్ళను విసరటం అయితే విసరలేదుగాని, వేగంగా పరిగెత్తాడు డ్రైవర్.

అతను పది అడుగుల దూరం కూడా పోకముందే డేంజర్ లైట్లు తప్ప మరేమీ కనిపించనంత దూరం వెళ్ళిపోయింది కారు. రోడ్డు మీద ఉన్న ఒక మలుపు తిరిగి, మటు మాయం అయిపోయింది.

***

'వెట్టి వచ్చాడా లేదా..?' ఉదయం ఏడు గంటల సమయంలో నిద్ర లేచీ లేవగానే భార్యను అడిగాడు శివారెడ్డి.

తల అడ్డం తిప్పింది ఆమె.

'విచిత్రంగా ఉంది. అసలు తను గుడి దగ్గరికి పోయి ఉంటాడా?' మళ్ళీ అడిగాడు శివారెడ్డి.

'మీకు ఎంత తెలుసో, మాకు కూడా అంతే తెలుసు' ముక్తసరిగా అన్నది ఆమె.

'తెలియదని వదిలేస్తే ఎలా రాజీ? ఎవరినైనా పంపించి తెలుసుకోవటం బాగుంటుంది. పంపించు' అంటూ ఒక్క క్షణం ఆగి 'శంకరయ్యగారిని పిలువ్. నేను మాట్లాడతాను' అన్నాడు శివారెడ్డి.

ప్రత్యూష గాని, ప్రణవి గాని ఆ మాటలు వింటే, అప్పటికప్పుడు గుడి దగ్గరికి ప్రయాణం మొదలుపెడతారని ఆమెకు తెలుసు. అంతకుముందు ఆ ప్రపోజల్‌ని అడ్డుకున్నాడు శంకరయ్య. ఇప్పుడు అభ్యంతరం చెప్పటానికి వీలు లేని పరిస్థితి.

'సంపంగి..' నిలబడిన చోటు నుంచి కదలకుండా పిలిచింది ఆమె.

అంతకుముందు అబ్జర్వ్ చేయలేదు గాని, సంపంగి గుణం ఎటువంటిదో తెలుసుకున్న తర్వాత ప్రత్యూష మాదిరిగా తను కూడా క్లోజ్‌గా అబ్జర్వ్ చేయటం మొదలుపెట్టింది సంపంగి కదలికల్ని.

మొట్టమొదటిసారిగా ఆమెకు తెలిసి వచ్చింది ఒక

## రొమాన్స్‌కు సై



త్వరలో సెట్‌పైకి వెళ్లనున్న నడిగైయన్ తిలగం(మహానటి) చిత్రంపై చిత్ర పరిశ్రమలో కుతూహలం నెలకొంది. ఈ చిత్రంలో హీరోగా నటిస్తున్న విజయ్ సేతుపతితో రొమాన్స్‌కు బ్రిటీష్ బ్యూటీ అమీజాక్సన్ సై అంది. ప్రస్తుతం యువ కథానాయకుల్లో వరస విజయాలతో దూసుకుపోతున్న నటుడు విజయ్ సేతుపతి నటిస్తున్న కవన్ చిత్రం విడుదలకు సిద్ధం అవుతోంది. తాజాగా మరో నూతన చిత్రానికి విజయ్ సేతుపతి గ్రీన్‌సిగ్నల్ ఇచ్చారు. దర్శకుడు గోకుల్ ఈ చిత్ర కథను తయారు చేయడంపై దృష్టి సారించారు. ఇందులో విజయ్‌సేతుపతికి జంటగా ఇంగ్లీష్ భామ అమీజాక్సన్ నటించనున్నారన్నది కోలీవుడ్ టాక్. వీరి కలయికలో తెరకెక్కనున్న తొలి చిత్రం ఇదే. సూపర్‌స్టార్‌కు జంటగా 2.0 చిత్రాన్ని పూర్తి చేసిన అమీ తదుపరి చిత్రం కోసం అభిమానులు ఆసక్తిగా ఎదురుచూస్తున్నారు

విషయం. తాను తన భర్త దగ్గరికి వచ్చినప్పుడల్లా ఆ గది గుమ్మం దగ్గరే నిలబడి ఉంటున్నది సంపంగి. ఇప్పుడు కూడా అదేపని చేసింది.

'వస్తున్నా తల్లీ' అంటూ పిలుపు పెదవుల్ని దాటిన వెంటనే గదిలోకి అడుగుపెట్టింది.

పళ్ళు బిగించి చెంప పగిలిపోయేటట్లు కొట్టాలన్న కోరికను అతి బలవంతంగా అదుము కుంటూ 'శంక రయ్యగారిని పిలుచుకురా' అని చెప్పింది శివారెడ్డి భార్య.

తల ఊపి బయటికి పోయింది సంపంగి.

రెండు నిమిషాల తరువాత గబగబా లోపలికి వచ్చాడు శంకరయ్య. వెనుకే ప్రత్యక్షమైంది ప్రణవి.

ఆశ్చర్యాల్లో కెల్లా ఆశ్చర్యకరమైన విషయం ఏమి టంటే వారిద్దరి వెనుకే వచ్చింది పిచ్చమ్మి.

సూదంటురాళ్ళ వంటి శివారెడ్డి భార్య కళ్ళకు వెంటనే కనిపించింది, ఆమె ముఖంలో వస్తున్న ఒక మార్పు.

అందమైన వదనం పిచ్చమ్మిది. చేయివేస్తే మాసి పోయేంతటి చక్కటి రంగు. ఎంత చక్కటి రంగు అయినా, అందులో ఏదో జీవం లోపించినట్టు కళా కాంతులు చాలా స్వల్పంగా ఉండేవి. ఇప్పుడు సరిదిద్ద బడింది ఆ లోపం. కళకళలాడి పోతున్నది ముఖం.




'ఏమిటిరా? ఏమైంది? శంకరయ్యగారితో ఇప్పుడు నీకు పనేమిటి?' లోపలికి వస్తూనే అడిగింది ఆమె శివా రెడ్డిని.

'తను గుడికిపోయి పూజ చేయించి వస్తానని అదే పోక పోయాడు. ఏమయిపోయాడో తెలుసుకోవాలి కదా.. వదిలేస్తే బాగోదుకదా...' అన్నాడు శివారెడ్డి.

'శంకరయ్యగారు.. విన్నారు కదా' శంకరయ్య కేసి తిరుగుతూ చెప్పింది పిచ్చమ్మి. 'వెంటనే వెళ్ళి రండి' అన్నది.

వెళ్ళటం తనకు ఇష్టం లేనట్టు ముఖం పెట్టాడు శంకరయ్య. 'అమ్మా... అదీ... ఇప్పటికిప్పుడు బయలు దేరాలంటే...' అంటూ మాటను నాన్చటం మొదలుపెట్ట బోతుండగా, సుడిగాలి మాదిరి ఆ గదిలోకి దూసుకు వచ్చింది ప్రత్యూష.

'కంగారుపడాల్సిన అవసరం లేదు. వచ్చేశాడు' లోపలికి వస్తూనే ఎనౌన్స్ చేసింది.

పిచ్చమ్మి పెదవులమీద ప్రత్యక్షం అయింది అంద మైన నవ్వు. ప్రణవి ముఖం విప్పారింది. శంకరయ్య అయితే ఎగిరి గంతేసినంత పని చేశాడు. 'ఎప్పు డనగానో రావాల్సినవాడు ఇంత ఆలస్యం చేసినందుకు ఊరికే వదిలిపెట్టకూడదు. నిలబెట్టి కడిగేయాల్సిందే' అంటూ గది బయటికి పోవటానికి రెడీ అయ్యాడు.

అతను మూడు అడుగులు కూడా వేయకముందే, చిన్నచిన్న అడుగులు వేస్తూ లోపలికి వచ్చాడు వెట్టి.

వెంటనే ముక్కుల్ని గట్టిగా మూసుకున్నది పిచ్చమ్మి. ఆ పని తను కూడా చేయబోయి అతి బల వంతంగా తనను తాను కంట్రోల్ చేసుకున్నది ప్రణవి.

'ఎన్నిసార్లు చెప్పినా నీ పాడు అలవాట్లను నువ్వు కొంచెం కూడా మార్చుకోవటం లేదు. నీ ఇష్టం వచ్చి నట్టు చెప్పాపెట్టకుండా మాయం అయిపోవటం, స్నానం గీనం చేయకుండా రోజులకు రోజులు రోడ్ల పట్టుకు తిరగటం' చిరుకోపంతో అన్నది పిచ్చమ్మి.

చిరునవ్వు నవ్వుతూ పాంటుజేబులో నుంచి భద్రంగా వెంటబెట్టుకు తిరుగుతున్న చౌడేశ్వరి ప్రసా దాన్ని బయటికి తీశాడు వెట్టి.

'ఆగండి.. అది ఎన్నిరోజుల క్రితందో.. ఎన్నెన్ని క్రిములు, కీటకాలు ఉన్నాయో...' అంటూ వెంటనే అతన్ని ఆపేశాడు, అంతకుముందే వచ్చి అక్కడి సంభా షణలన్నిటినీ ఆకళింపు చేసుకున్న డాక్టరు.

'అది మా తల్లి ప్రసాదం. పదిహేడు రోజుల పాటు నిలువ ఉంచినా చెడిపోదు. మరేం ఫరవాలేదు' వెంటనే చెప్పింది పిచ్చమ్మి.

బయటికి తీసిన పాలిథిన్ సంచిని శివారెడ్డి భార్యకు అందించాడు వెట్టి 'ప్రసాదం శుభ్రంగానే ఉంది తల్లీ. నా ఒళ్ళు మాత్రం పరమ అసహ్యంగా ఉంది. మీరే ఇవ్వండి' అంటూ దూరంగా జరిగి నిలబడ్డాడు.

అతని అవతారం ఎంత అసహ్యంగా ఉన్నదో డాక్ట ర్‌కే కాదు అతని పక్కనే ఉన్న నర్సుకు కూడా అర్థమై పోయింది.

'శుభ్రంగా ఉండవలసిన ఈ గదిని కంటామినేట్ చేయటానికి వచ్చినట్లుంది. ముందు అర్జంటుగా బయ టికి పోవాలి.' ముఖం ముడుచుకుంటూ స్పీడ్‌గా చెప్పింది.

చివ్వున ఆమెకేసి తిరగబోయిన ప్రణవి చేయిపట్టు కుని వెంటనే వెనక్కి లాగింది ప్రత్యూష.

'ఆ మాటల్లో అసత్యం ఏమీ లేదు. తాను వెళ్ళి స్నానం చేసి డ్రస్ మార్చుకు వస్తాడు. వెళ్ళనీ' అంటూ సర్ది చెప్పింది.

పాలిథిన్ సంచిలో నుంచి చిన్నపొట్లాన్ని బయటికి తీసి అందులోని అయ్యవారి కుంకుమను శివారెడ్డి నుదుటన పెట్టింది అతని భార్య. సెపరేట్‌గా ఉన్న ప్రసాదాన్ని రెండు పలుకులు చేతిలో ఉంచింది.

'ఆగండి తల్లీ.. అలా పెట్టేయకండి' అంటూ ముందుకు అడుగు వేయబోయిన డాక్టర్‌కి తన చేతిలో ఉన్న పలుకుల్ని చూపించాడు శివారెడ్డి.

నూనెలో వండిన పదార్థాలు కావు అవి. తెల్లగా మెరిసిపోతున్న పటిక బెల్లపు ముక్కలు.

'తొందరపడ్డాను. సారీసర్!' అంటూ వెనక్కి తగ్గాడు డాక్టర్.

చేతిలోని పలుకుల్ని శివారెడ్డి నోటిలో వేసు కుంటూ ఉండగానే, పరుగులాంటి నడకతో గది ముందుకు వచ్చాడు బాజిరెడ్డి.

'వాడు... ఆ రాస్కెల్‌ని వెంటనే మన పొలిమేరలు దాటిపోయే వరకు చింత బరిసెలతో కొట్టి కొట్టి వద లాలి. వాడు వట్టి దొంగ. తలకు మాసిన వాడు' అంటూ లోపలికి వచ్చాడు.

శివారెడ్డి మీదనే ఉన్నది అతని చూపు. ఒక పక్కగా నిలబడి ఉన్న వెట్టిని చూడటం కుదరలేదు.

'ఏం జరిగింది? ఎందుకు అంతకోపం?' నోటిలో వేసుకున్న పలుకుల్ని చప్పరిస్తూ అడిగాడు శివారెడ్డి.

'వాడు నా కారును దొంగిలించి పారిపోయాడు. మనం తొందరపడకపోతే దూరంగా వెళ్ళిపోతాడు' అన్నాడు బాజిరెడ్డి.

'నువ్వు తొందరపడే ఉంటావు. నీ మనుష్యుల్ని పంపే ఉంటావు' చటుక్కున అన్నది పిచ్చమ్మి.

విసురుగా ఆమెకేసి తిరిగి ఏదో అనటానికి తెరి చిన నోటిని రక్కున మూసుకున్నాడు బాజిరెడ్డి.

పిచ్చమ్మి వెనుకే నిలబడి ఉన్న వెట్టిని మొట్టమొదటి సారిగా చూడటమే అందుకు కారణం.

'నేను మీ కారును దొంగిలించటం ఏమిటి సారు? చౌడేశ్వరి గుడి దగ్గర్నించి వెనక్కి వస్తూ అడవిలో దారి తప్పిన నన్ను రక్షించి, అర్జంటుగా ఇంటికి పొమ్మని మీరే ఇచ్చారు కారుని. మర్చిపోయారా?' అతని మాటలు తనకు విపరీతమైన ఆశ్చర్యాన్ని కలిగిస్తు న్నట్టు అడిగాడు వెట్టి.

'నేను నీకు నా కారుని ఇవ్వటం ఏమిటి?' కోపంగా అడిగాడు బాజిరెడ్డి.

'అడవి దారిలో మీకు నేను కనిపించానా లేదా?' అడిగాడు వెట్టి.

అతను ఏం చెప్పదలుచుకున్నాడో ఊహించటానికి ప్రయత్నిస్తూ తల ఊపాడు బాజిరెడ్డి.

ఆ సమయంలో ఆ దారిలో మీరు కనిపిస్తారని నేను కలలో కూడా ఊహించలేదని మీతో అన్నాను. మర్చిపోయారా?' అడిగాడు వెట్టి.

ఏదో ఒక విధంగా బాజిరెడ్డిని తికమక పెట్టి, అతని ఆగ్రహాన్ని అయోమయం కింద కన్వర్ట్ చేయా లని అతని ఉద్దేశం.

అనుకోని విధంగా నెరవేరింది అది.

'అవును బాజిరెడ్డిగారూ... అంత రాత్రివేళ మీరు ఆ అడివిదారిలోకి వెళ్ళవలసిన అవసరం ఎందుకు వచ్చింది?' అడగనే అడిగాడు శివారెడ్డి.

'అదీ... ఎందుకు వెళ్ళవలసి వచ్చిందంటే –' అంటున్న బాజిరెడ్డి మాట పూర్తికాక ముందే 'నాకు తెలుసు. నేను చెపుతాను' అన్నాడు వెట్టి.

***(ఇంకా వుంది)***

## హెపటైటిస్ వైరస్ కట్టడి సాధ్యమే

**హెపటైటిస్** అనగానే అందరికీ హెపటైటిస్ బి గుర్తుకువస్తుంది. కానీ అదొక్కటే కాదు అందులో చాలా రకాలున్నాయి. హెపటైటిస్ అంటే కాలేయంలో కణాలు వాచిపోయి ఫైబ్రోసిస్, సిర్రోసిస్‌కు దారితీస్తుంది. దీంతో కాలేయ పనితీరు మెల్లగా తగ్గి ప్రాణాంతకంగా మారుతుంది. ఈ వ్యాధి వచ్చిన తర్వాత శాశ్వత పరిష్కారాన్ని చూపే చికిత్స ఇతర వైద్యవిధానాలలో లేదు. కానీ హోమియో వైద్యంలో అద్భుతమైన చికిత్స ఉంది.

**ఇవీ కారణాలు :** ఎక్కువ మందితో సెక్సువల్ కాంటాక్ట్స్ పెట్టుకోవడం, అపరిచితుల నుంచి సేకరించిన రక్తం అంటే హెపటైటిస్ వైరస్ ఉన్న రక్తాన్ని ఎక్కించడం, స్వలింగ సంపర్కం, ఒకరు వాడిన సిరంజీలు మరొకరు వాడటం వల్ల కూడా హెపటైటిస్ వచ్చే అవకాశం ఉంటుంది. తల్లి గర్భవతిగా ఉన్నపుడు ఈ వ్యాధి సోకినట్లయితే కడుపులోని బిడ్డకు కూడా సంక్రమించే అవకాశం ఉంటుంది.

**లక్షణాలు :** ఆకలి లేకపోవడం, వాంతి వస్తున్నట్లుగా ఉండటం, ఒళ్లంత నొప్పులు, మూత్రం పచ్చగా రావడం జరుగుతుంది. తరువాత నెమ్మదిగా కామెర్లు మొదలవుతాయి. దీంతో పాటు చర్మంపై దద్దుర్లు కనిపిస్తాయి. హెపటైటిస్ బి వ్యాధి చాలా ఆలస్యంగా బయటపడుతుంది. కొన్ని సందర్భాలలో సంవత్సరాల తర్వాత బయటపడవచ్చు. దీన్ని క్రానిక్ ఇన్‌ఫ్లమేషన్ ఆఫ్ లివర్ లేదా క్రానిక్ హెపటైటిస్ అంటారు. వీరిలో కామెర్ల వ్యాధి తగ్గకుండా అలాగే ఉంటుంది.

**హోమియో చికిత్స :** హెపటైటిస్ బి, సి వైరస్‌లు కాలేయంలో మల్టిపుల్ అయ్యే అవకాశం ఎక్కువగా ఉంటుంది. దీన్ని రెప్లికేషన్ అంటారు. ఈ రెప్లికేషన్ అయ్యే పద్ధతిని హోమియోపతి మందుల ద్వారా అడ్డుకోవచ్చు.

## వెరికోస్ వీన్స్ ఎప్పటికీ తగ్గవా?

**కొందరు** వ్యక్తులను గమనించినట్లయితే కాలి పిక్కల భాగంలో నరాలు మెలిపడిపోయి, ఉబ్బి, నీలం రంగులో కనిపిస్తుంటాయి. ఈ సమస్యను వెరికోస్ వెయిన్స్ అంటారు. సిరలు మెలిపడటం వల్ల ఈ సమస్య ఉత్పన్నమవుతుంది.

**ఎవరిలో ఎక్కువ:** ఈ సమస్య వయసు పైబడిన వారిలోనే కనిపిస్తుంది. స్త్రీలలో, స్థూలకాయుల్లో, వ్యాయామం చేయని వారిలో ఎక్కువగా కనిపిస్తుంది. కుటుంబ సభ్యుల్లో ఎవరికైనా ఈ సమస్య ఉంటే పిల్లలకు వచ్చే అవకాశం ఉంటుంది. స్థూలకాయుల్లో, ఎక్కువ సార్లు గర్భం ధరించిన వారిలో ఈ సమస్య కనిపిస్తుంది. వయసు పైబడటం వల్ల కూడా రక్తనాళాల్లో కవాటాలు దెబ్బతిని, సిరలు పనిచేయలేని స్థితి తలెత్తుతుంది. ఎక్కువ సేపు నిలబడటం వల్ల కాలి పిక్కల దగ్గర ఉన్న కండరాలు పనిచేయడం మానేస్తాయి. పంపింగ్ మెకానిజం తగ్గి రక్తాన్ని పైకి పంపించలేకపోతుంది. ఫలితంగా వెరికోస్ వెయిన్స్ సమస్య ఉత్పన్నమవుతుంది.

**లక్షణాలు :** సిరలు ముదురు నీలం రంగులో, చర్మం కింద ఉబ్బిపోయి, మెలిపడి కనిపిస్తుంటాయి. కాలు బరువుగా ఉంటుంది. కాలి పిక్కల దగ్గర నొప్పి ఉంటుంది. ముఖ్యంగా ఎక్కడైతే వెరికోస్ వెయిన్స్ సమస్య ఉందో అక్కడ నొప్పి ఉంటుంది. నడుస్తున్నప్పుడు నొప్పి తీవ్రత చాలా ఎక్కువగా ఉంటుంది. కాళ్లను పరిశీలించి నిర్ధారణ చేయవచ్చు.

**హోమియో చికిత్స :** హోమియో వైద్యంతో ఈ సమస్య సమూలంగా తొలగిపోతుంది. హోమియో వైద్యంలో మూలకారణాన్ని తొలగించే విధంగా చికిత్స ఉంటుంది. కాబట్టి వ్యాధి నుంచి పూర్తిగా విముక్తి లభిస్తుంది.

**Dr. K Ravikirane**
**M.D.,M.sc(psych), P.G(virology)LONDON**
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్
**మాస్టర్స్ హోమియోపతి**
అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్,
విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి
ఫోన్ : 7842 106 106, 9032 106 106
V6లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2:30కి
సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2:30కి
10టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 4:30కి డాక్టర్‌గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.



## ఆటిజం సమస్యకు అద్భుతమైన వైద్యం

**మానసిక** ఎదుగుదల సక్రమంగా ఉన్నప్పుడే పిల్లల్లో సంపూర్ణ అభివృద్ధి కనిపిస్తుంది. అయితే కొందరు పిల్లల్లో మానసిక ఎదుగుదల లోపిస్తుంది. తోటి పిల్లలతో ఆడుకోలేకపోతారు. భాషాభివృద్ధి బాగా కుంటుపడుతుంది. తన తోటి పిల్లలతో ఆడుకోవాల్సిన దశలో ఒంటరిగా ఉండిపోతారు. శారీరకంగా ఆరోగ్యంగా ఉన్నట్లు కనిపించినా మానసిక లోపం కారణంగా తీవ్రమైన ఇబ్బందులు పడుతుంటారు. ఈ సమస్యను ఆటిజం అంటారు.

**లక్షణాలు :** వస్తువులను పట్టుకోలేకపోతారు. ఒక చేతిలో నుంచి మరో చేతిలోకి వస్తువులను తీసుకోలేకపోతారు. ఆటిజం లక్షణాలు మొదటి మూడు సంవత్సరాల్లో బయటపడతాయి. కొందరిలో మాత్రం పుట్టినప్పటి నుంచి కనిపిస్తాయి. మరి కొందరిలో పుట్టినప్పుడు బాగానే ఉన్నా 18నుంచి 36 నెలల కాలంలో ఆకస్మాత్తుగా లక్షణాలు బయటపడతాయి. తమ వయస్సు వారితో స్నేహం చేయలేకపోతారు. తమ ఆసక్తులను ఇతరులతో పంచుకోలేరు.

**హోమియో చికిత్స :** మానసిక ఎదుగుదల సక్రమంగా లేని పిల్లలకు హోమియో చికిత్స ఇప్పించడం ద్వారా ఎదుగుదల సక్రమంగా జరిగేలా చేసే అవకాశం ఉంది. ఆటిజంతో బాధపడుతున్న పిల్లలను వదిలేయకుండా హోమియో వైద్యుల దగ్గరకు తీసుకెళ్లి చికిత్స ఇప్పించడం ద్వారా ఆరోగ్యవంతమైన జీవితం గడిపేలా చేయవచ్చు. పిల్లల బిహేవియర్‌లో మార్పులు తీసుకువచ్చి ఏకాగ్రత నిలిపేలా చేయడంలో హోమియో చికిత్స అద్భుతంగా పనిచేస్తుంది. మెదడులో రసాయన సమతుల్యత నిలిచేలా చేయడంలోనూ మందులు బాగా పనిచేస్తాయి. అయితే పిల్లలను తొలిదశలోనే గుర్తించి చికిత్స ఇప్పించడం అవసరం.

## హెచ్ఐవి, హెర్పిస్‌లకు ఇదొక్కటే పరిష్కారం

**హెచ్ఐవి** అంటే చికిత్స లేని వ్యాధి అనుకుంటారు. కానీ హోమియో మందులు వాడితే హెచ్ఐవి ఉన్నా హాయిగా బతికేయవచ్చు. ఈ వ్యాధి పేరు చెబితేనే ప్రతీ ఒక్కరూ భయపడిపోతారు. నిజానికి హోమియోలో హెచ్ఐవి వైరస్‌ను కట్టడి చేసే మందులు ఉన్నాయి. హెచ్ఐవి ఎక్కువ విస్తరిస్తుండటానికి కారణం దీని లక్షణాలు కొన్ని ఏళ్ల తరువాత బయటపడటమే. అప్పటి వరకు వారికి హెచ్ఐవి ఉన్న విషయం కూడా తెలియదు. రోగనిరోధక శక్తి తగ్గినపుడు వ్యాధి లక్షణాలు బయటపడతాయి. విరేచనాలు కావడం, బరువు తగ్గడం, అవకాశవాద వ్యాధులు విజృంభించడం, చిన్న చిన్న వాతావరణ మార్పులను తట్టుకోలేకపోవడం, త్వరగా వ్యాధులు వస్తుండటం జరుగుతుంది.

**హెర్పిస్ సింప్లెక్స్**

పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. నీటిపొక్కులు ఎర్రగా ఉండి దురద ఉంటుంది. నీటిపొక్కులు పగిలి ఎర్రగా పుండు పడుతుంది. ఇటువంటి సమయంలో తగు చికిత్స తీసుకోకపోతే ఇతరులకు సోకే ప్రమాదం ఉంది. లైంగిక కలయిక ద్వారా సంక్రమించే ఈ వ్యాధిని హెర్పిస్ అని అంటారు.

**హోమియో చికిత్స :** హోమియో మందులతో రోగనిరోధక శక్తి బలపడుతుంది. తద్వారా హెచ్ఐవి రోగుల్లో అవకాశవాద వ్యాధులన్నీ దూరమవుతాయి. వైరల్‌లోడ్ బాగా తగ్గిపోతుంది. ఆరోగ్యవంతమైన జీవనం గడపడానికి ఆస్కారం లభిస్తుంది. హెర్పిస్ సింప్లెక్స్ వంటి లైంగిక వ్యాధుల నివారణకు కూడా హోమియో చికిత్స అద్భుతంగా పనిచేస్తుంది. హోమియో చికిత్స మూలకారణాన్ని తొలగిస్తుంది. సాధారణంగా హెర్పిస్ తగ్గినట్టే తగ్గి మళ్లీ వస్తుంది. అయితే హోమియో చికిత్స అనంతరం వ్యాధి మళ్లీ తిరగబెట్టడం ఉండదు.




# శతధన్వుని సంహారం: అక్రూరుని మహిమ

**కృష్ణుడు వారణావతానికి వెళ్ళడంతో అదే అదనుగా శతధన్వుడు ఓ ప్రణాళిక రచించాడు. ఆ ప్రణాళిక ప్రకారం ఓ అర్ధరాత్రి అంతఃపురంలోనికి ప్రవేశించాడు. అక్కడ నిద్రిస్తున్న సత్రాజిత్తును సంహరించాడు. శ్యమంతకాన్ని స్వాధీనం చేసుకున్నాడు. ఆ సంగతి తెలిసి, కంటికీ మంటికీ ఏకధారగా ఏడ్చింది సత్యభామ. తండ్రి మరణవార్త కృష్ణునికి తెలియజేసేందుకు వాయువేగంతో దూసుకుపోయే గుర్రాలను పూన్చి, రథం మీద వారణావతానికి బయల్దేరింది. త్వరగానే చేరుకున్న దక్కడికి. కృష్ణుణ్ణి కలిసి, జరిగింది వివరించింది. దుఃఖించింది.**

సత్రాజిత్తు సంహారాన్ని తట్టుకోలేకపోయాడు కృష్ణుడు. చాలా బాధపడ్డాడు. తానూ కళ్ళు చెమర్చు కున్నాడు. శతధన్వుణ్ణి వదిలేది లేదని, అతని అంతు చూస్తానన్నాడు. సత్యభామసహా ద్వారకా నగరానికి చేరుకున్నాడు. అన్న బలరాముణ్ణి సంప్రదించాడు కృష్ణుడు. శతధన్వుని క్రూరత్వాన్ని తెలియజేశాడతనికి. ఎట్టి పరిస్థితుల్లోనూ శతధన్వుణ్ణి వదిలేది లేదన్నాడు కృష్ణుడు. అతన్ని సంహరించి తీరుతానన్నాడు. శ్యమంతకాన్ని సొంతం చేసుకుంటానన్నాడు. శ్యమంతకంకోసం శతధన్వుడు ఇంత దురాగతానికి పూనుకుంటే, ఆ మణి నిజంగా అతని దగ్గర ఉండి ఉంటే...అతన్ని శిక్షించడంలో తప్పు లేదన్నాడు బలరాముడు. తమ్ముడికి అండగా నిలిచాడు.

అన్నదమ్ములిద్దరూ తనని తుదముట్టించేందుకు సిద్ధమయ్యారని తెలిసి వణికిపోయాడు శతధన్వుడు. సహాయం కోసం కృతవర్మను ఆశ్రయించాడు.

రేపు బలరామశ్రీకృష్ణులతో నేను యుద్ధం చేయాల్సి వస్తే నువ్వు నాకు తోడుగా ఉండాలి. ఉంటావని ఆశిస్తాను అన్నాడు శతధన్వుడు. అతని చేతులు పట్టుకున్నాడు.

ఉండను! ఉండలేను అన్నాడు కృతవర్మ. వారితో వైరాన్ని నేను ఎట్టి పరిస్థితుల్లోనూ కోరుకోను అన్నాడు. క్షమించమన్నాడు. వెంటనే అక్రూరుణ్ణి ఆశ్రయించాడు శతధన్వుడు.

రేపు బలరామశ్రీకృష్ణులకూ, నాకూ జరగబోయే యుద్ధంలో నీ సహాయసహకారాలు కావాలి అని ప్రార్థించాడు శతధన్వుడు. అతని కాళ్ళు పట్టుకున్నాడు. వీలుకాదన్నట్టుగా తలూపాడు అక్రూరుడు. పైగా కృష్ణుడు ఎలాంటివాడో తేటతెల్లం చేశాడతనికి.

శతధన్వా! కృష్ణుని చక్రాయుధం ముందు ఎంతటి వారైనా నిలువలేరు. అలాంటి వ్యక్తితో నేను కావాలని వైరం తెచ్చుకోలేను. పైగా అన్నిరకాలుగా నేను అతన్ని శరణు వేడాలనుకుంటున్నాను. ఇంతకు ముందు ఇలా నేను మాట్లాడలేదని నువ్వు అనవచ్చు. అప్పుడు అజ్ఞానం కొద్దీ అలా ప్రవర్తించాను అన్నాడు అక్రూరుడు.

శతధన్వునికి ఒక్క క్షణం కరచరణాలు ఆడలేదు. ప్రాణాల మీదికి వచ్చినప్పుడుగానీ మిత్రులెవరు? శత్రువులెవరన్నది తెలియదనుకున్నాడు. ఆందోళన చెందాడు.

నన్ను కాపాడేవాళ్ళు లేనప్పుడు నేను ఈ ద్వారకలో ఉండలేను. ఇక్కణ్ణుంచి వెళ్ళిపోతాను అన్నాడు శతధన్వుడు. దాచిన శ్యమంతకాన్ని తీసి అక్రూరునికి అందించాడు.

ఈ మణిని నీ దగ్గర ఉంచు. కంటికి రెప్పలా కాపాడు. ప్రాణాపాయం కలిగినా ఈ మణి నీ దగ్గర ఉన్నదన్న సంగతి ఎవరికీ తెలియకూడదు. నాకు ఈ సహాయం చేసిపెట్టు అన్నాడు శతధన్వుడు. అక్కణ్ణుంచి నిష్క్రమించాడు.

మందిరానికి చేరుకుంటూనే ప్రయాణానికి సిద్ధమయ్యాడు. అతని వద్ద 'నితంబిని' అని పేరుగల ఆడగుర్రం ఉంది. అది వాయువేగ మనోవేగాలతో పరుగుదీస్తుంది. ఒక్కరోజులో నూరుయోజనాలు దాటిపోగలదది. ఆ గుర్రాన్ని అధిరోహించాడు శతధన్వుడు. పూర్వోత్తర దిశాముఖుడై ప్రయాణించాడు. తనని కాపాడగలిగేది నితంబిని మాత్రమేనని విశ్వసించాడతను.

**చక్రాయుధంతో శతధన్వుణ్ణి సంహరించాడు శ్రీకృష్ణుడు. కానీ అతడి దగ్గర శ్యమంతకమణి దొరకలేదు. దాంతో బలరాముడు ఆగ్రహించాడు. కృష్ణా! నీలాంటివాడు కూడా డబ్బుకి దాసోహం కావాల్సివచ్చిందంటే అసహ్యంగా ఉంది అంటూ తమ్మునితో బంధం తెంచుకుని వెళ్ళిపోయాడు బలరాముడు. మరి శ్యమంతకమణి ఏమైంది? బలరామకృష్ణులు తిరిగి ఒక్కటయ్యారా లేదా?**

ఎప్పుడైతే శతధన్వుడు ద్వారక విడచి పారిపోయాడని తెలుసుకున్నాడో ఆ వెంటనే అన్న బలరామునిసహా రథాన్ని తీసుకుని బయల్దేరాడు కృష్ణుడు. శతధన్వుని వెంబడించాడు. నూరుయోజనాలు పరుగుదీసి పరుగుదీసి అలసిపోయింది నితంబిని. మరిక పరుగుపెట్టలేకపోయింది. కిందపడి ప్రాణాలు విడిచింది. తనని రక్షిస్తుందనుకున్న గుర్రం తనని వీడిపోయినా, ఆందోళన చెందలేదు శతధన్వుడు. తీవ్ర వేగంతో పరుగుదీసి, విదేహపురం పరిసరప్రాంతానికి చేరుకున్నాడు. అదంతా గమనించిన శ్రీకృష్ణుడు, అన్న బలరామునితో అన్నాడిలా.

పరుగుదీసి పరుగుదీసి మన గుర్రాలు కూడా నితంబిలాగే ప్రాణాలు వదులుకుంటాయేమోనని పిస్తోంది. కాబట్టి ఓ పని చేద్దాం. నువ్వు రథాన్ని నెమ్మదిగా పోనియ్యి. నేను కిందికి దిగి శతధన్వుని వెంబడిస్తాను. శతధన్వుడు బలంకొద్దీ పరుగుదీస్తున్నా, పెద్దగా ముందుకు పోవడం లేదు. ఇదే అవకాశంగా నేను అతన్ని సంహరిస్తాను.

నీ ఇష్టం అన్నాడు బలరాముడు.

అంతే! రథం మీద నుంచి కిందికి దూకి, శతధన్వుని చూశాడు కృష్ణుడు. అల్లంత దూరంలో ఉన్నాడు శతధన్వుడు. మెల్లగా పరుగుదీస్తున్నాడు. అదే అదనుగా చక్రాయుధాన్ని ప్రయోగించాడు కృష్ణుడు. అది శరవేగంగా వెళ్ళి శతధన్వుని శిర్సాన్ని ఖండించింది. అయినా అతని మొండెం పరుగుదీసింది. కాసేపు పరుగుదీసి పరుగుదీసి కింద పడిపోయింది. అప్పుడక్కడికి చేరుకున్నాడు కృష్ణుడు. శ్యమంతకమణికోసం ఆ మొండాన్ని ఇటు తిప్పీ అటు తిప్పీ చూశాడు. ఎక్కడా మణి కనిపించలేదు. ఆసరికి అక్కడకి చేరుకున్నాడు బలరాముడు.

మణి దొరికిందా? అడిగాడు.

లేదన్నాడు కృష్ణుడు.

శతధన్వుని చంపి లాభం లేకపోయింది అన్నాడు కృష్ణుడు. ఏం చెయ్యాలో తోచక శూన్యంలోకి చూస్తూ నిల్చున్నాడు. ఆ క్షణం అతని ప్రవర్తన బలరామునికి నచ్చలేదు. కోపాన్ని తెప్పించింది.

మణిలేదు. పైగా మనిషిని సంహరించావు. ధనాశ చాలా చెడ్డది కృష్ణా! నీలాంటివాడు కూడా డబ్బుకి దాసోహం కావాల్సివచ్చిందంటే అసహ్యంగా ఉంది. నువ్వు నా తమ్ముడిలా లేవు. రాక్షసుడిలా ఉన్నావు. బాధగా ఉంది. భరించలేకపోతున్నాను. ఇక నీతో నా బంధం నిలువదు. నేను నీతో మాట్లాడలేను. నీ నోట అన్నా అని పిలిపించుకోలేను. వద్దు! వెళ్ళు! ఎక్కడికి వెళ్తావో వెళ్ళు, నీ ఇష్టం అన్నాడు బలరాముడు. కృష్ణుణ్ణి వదలి ముందుకు నడిచాడు.

అన్నా! అన్నా! ఇందులో నాకేపాపం లేదన్నా! ఇదంతా సత్రాజిత్తు సంహారంతో వచ్చింది. అర్థం చేసుకో అని కృష్ణుడు ఎంతగా చెప్పినా, బతిమలాడినా బలరాముడు వినిపించుకోలేదు.

ఒట్టు అన్నా! నాకేపాపమూ తెలీదు. నా మీద ఒట్టు అన్నాడు కృష్ణుడు. అయినా క్షమించలేదు బలరాముడు. పైగా అన్నాడిలా.

నీ మాయలు నా దగ్గర సాగవు కృష్ణా!

బలరాముని మాటలకు దిగ్భ్రాంతి చెందాడు కృష్ణుడు. అచేతనంగా నిల్చున్నాడు. కృష్ణుణ్ణి వదలి రథం మీద ముందుకు సాగాడు బలరాముడు. మిథిలానగరానికి చేరుకున్నాడు. జనకమహారాజును సందర్శించి, కొన్నాళ్ళు విడిది చేశాడక్కడ.

ఏం చెయ్యాలో పాలుపోక ఒంటరిగా ద్వారకకు చేరుకున్నాడు కృష్ణుడు.

బలరాముడు మిథిలలో ఉన్నాడని తెలుసుకున్నాడు దుర్యోధనుడు. భయభక్తులతో అతన్ని సమీపించాడు. పూజలు చేసి గౌరవించాడతన్ని. అనుగ్రహాన్ని సంపాదించాడు.

మీరు నా గురువు! నేను మీ శిష్యుణ్ణి! దయచేసి గదాయుద్ధంలో నాకు మెళకువలు నేర్పండి అని అడిగాడు దుర్యోధనుడు. తప్పకుండా అన్నాడు బలరాముడు. దుర్యోధనునికి మెళకువలు నేర్పి, గదాయుద్ధంలో అతన్ని తిరుగులేని యోధుణ్ణి చేశాడు.

కొన్నాళ్ళు గడిచాయి.

ఉగ్రసేనుడు ఆదిగా యాదవప్రముఖులు బలరాముణ్ణి సందర్శించారు.

కృష్ణుడు చెప్పింది నిజం. శ్యమంతకమణి విషయంలో అతనేపాపమూ ఎరుగడు. నేటికీ అది అతనికి దక్కలేదు. అన్నదమ్ములు ఇలా విడిపోవడం మర్యాదకాదు. దయచేసి రండి. ద్వారకకు వెళ్ళిపోదాం అన్నారు.

మీరు అనుకున్నట్టుగా మణికోసమే శతధన్వుణ్ణి కృష్ణుడు సంహరించలేదు. లేనిపోని అనుమానాలు పెట్టుకోవద్దు. రండి! ద్వారకకు బయల్దేరండి అన్నారు. అనేక విధాలుగా నచ్చజెప్పారు. దాంతో బలరాముడు ద్వారకకు చేరుకున్నాడు.

శ్యమంతకమణిని భక్తిశ్రద్ధలతో సేవించడంతో అక్రూరునికి అది ప్రతిరోజూ ఎనిమిది బారువుల బంగారాన్నేగాక, అసంఖ్యాకంగా నవరత్నాలను కూడా ప్రసాదించసాగింది. మణి ప్రసాదించిన బంగారం లోగానీ, రత్నాలలోగానీ ఏ మాత్రం మిగుల్చుకోక అదంతా దానధర్మాలు, యజ్ఞయాగాలు, హోమాలు, బాంధవపూజలకే వెచ్చించాడు అక్రూరుడు. పెద్దల శుభాశీస్సులు అందుకున్నాడు.

ప్రతిదినమూ యజ్ఞాన్ని నిర్వహిస్తూ ఇంతటి మహాదాత మరి భూమి మీద పుట్టడు, పుట్టబోడు అనిపించుకున్నాడు. అలా అరవైరెండేళ్ళపాటు నిరాఘాటంగా యజ్ఞయాగాదులూ, దానధర్మాలూ చేశాడు అక్రూరుడు. ఫలితంగా యాదవరాజ్యంలో ఈతి బాధలూ, రుగ్మతలూ అన్న మాటే లేకపోయింది. సమస్త సన్మంగళంగా విరాజిల్లింది.

రోజులు అలా గడుస్తోంటే...ఒకనాడు భోజవంశీయులు కొందరు ఒక్కుమ్మడిగా శత్రుఘ్నుయాదవుణ్ణి సంహరించారు. దాంతో ఇరు వంశాల్లో అడపాదడపా కలతలూ కలహాలూ చెలరేగసాగాయి. అది అక్రూరునికి నచ్చలేదు. ద్వారకలో ఉండలేకపోయాడతను. బంధుమిత్రాదులతో కలసి వేరొక నగరానికి తరలిపోయాడు. ఆ క్షణం నుండి ద్వారకలో ఉత్పాతాలు ప్రారంభమయ్యాయి. అనావృష్టి, మహామారి, అగ్నిహోత్రసహా భయంకరవ్యాధులు చుట్టుముట్టాయి. పౌరులంతా వణకిపోసాగారు. భయాందోళితులై నిలువలేకపోయారు. కృష్ణుణ్ణి సమీపించారు.

స్వామీ! ఏమిటిదంతా? అని అడిగారు.

సమాధానం కృష్ణునికి కూడా దొరకలేదు. గతంలో ఎప్పుడూ ఇలాంటి ఉత్పాతాలు సంభవించలేదు. పైగా ఉత్పాతాలన్నీ ఒక్కసారిగా చుట్టుముట్టాయి. కారణం ఏమై ఉంటుంది? ఆలోచనలో పడ్డాడు కృష్ణుడు. ఏ కారణమూ లేకుండా ఇలాంటి దుర్దశ పట్టదు. ఏదో కారణం ఉండితీరాలి. అదేమిటి? అంతుచిక్కక తల పట్టుకున్నాడు కృష్ణుడు. అప్పుడు నందకుడు కలుగజేసుకున్నాడు. అతను యాదవవృద్ధుడు. చెప్పాడిలా.

కృష్ణా! ఇప్పుడు ఈ పరిస్థితికి నాకు తెలిసి ఓ కారణం ఉంది. అది ఏమిటంటే...అక్రూరుని తండ్రి శ్వఫల్గుడు నివసించే దేశంలో ఎలాంటి ఈతిబాధలు గానీ, ఆపద్భీతిగానీ, దుర్భిక్షాదిపీడగానీ ఉండదు. పూర్వం కాశీదేశాధీశ్వరుని రాజ్యంలో అనావృష్టి సంభవించినప్పుడు పెద్దల మాటలు విని, ఆ రాజు శ్వఫల్గుణ్ణి ప్రార్థించాడు. అతన్ని తన దేశానికి రప్పించి, దోషాన్ని తొలగించుకున్నాడు. అనావృష్టి అప్పుడు నశించింది. అంతకు ముందు జరిగిన సంఘటన ఇంకొకటి ఉన్నది.

కాశీదేశాధీశ్వరుని భార్య గర్భవతి అయింది.



నవమాసాలూ నిండాయి. అయినా ప్రసవించక పన్నెండేళ్ళపాటు అదే విధంగా గర్భం ధరించి ఉన్నదామె. అందుకు రాజు ఎంతగానో ఆశ్చర్యపోయాడు. తపోమహిమవల్ల ఆ గర్భంలో ఉన్న శిశువు కుమార్తె అని తెలుసుకున్నాడు. ఆ పిల్లను అడిగాడిలా.

తల్లీ! ఇంకా ఎంతకాలం మీ అమ్మను బాధపెడతావు? దయతలచి తొందరగా బయటకు రాతల్లీ! నిన్ను చూసి ఆనందిస్తాను.

నేను తొందరగా బయటకు రావాలంటే నువ్వొక పని చెయ్యాలి తండ్రీ! రోజుకి ఒక ఆవు చొప్పున మూడేళ్ళపాటు నువ్వు దానం చెయ్యాలి. చేస్తే నేను తప్పకుండా బయటకు వస్తాను. నా కోరిక కాదనకు అన్నది కూతురు.

తప్పకుండా అని, కూతురు కోరినట్టుగానే చేశాడు రాజు. అప్పుడు ఆ పిల్ల తల్లిగర్భం నుండి బయట పడ్డది. జన్మించింది. నిరంతరం గోదానం వల్ల జన్మించిన కారణంగా ఆ పిల్లను 'గాందిని' అన్నారంతా. పెరిగి పెద్దదయిందామె. అలా పెరిగిపెద్దదైన గాందినిని, తనకు పూజనీయుడు, ఆప్తుడైన శ్వఫల్గునికి అర్పించాడు రాజు. వారిద్దరికీ వివాహం జరిపించాడు. ఆ పుణ్యదంపతుల బిడ్డే అక్రూరుడు. అక్రూరుని మహిమలు అన్నీ ఇన్నీ కావు. అతను లోకపూజ్యుడు. ధర్మాత్ముడు. అతడు ఈ ద్వారకను విడిచి వెళ్ళిపోయిన కారణంగానే ఇప్పుడు ఈ ఉత్పాతాలని నాకు అనిపిస్తున్నది. కనుక అన్యథా భావించక అతన్ని వీలైనంత త్వరగా ద్వారకకు రప్పించండి. అన్నీ సర్దుకుంటాయి.

సరేనన్నాడు కృష్ణుడు. అక్రూరుడు అంతకు ముందు చేసిన అనేక తప్పుల్ని క్షమించాడు. ఉగ్రసేనుని అనుమతి తీసుకున్నాడు. ద్వారకకు అక్రూరుణ్ణి రప్పించాడు. అక్రూరుడు ద్వారకలో అడుగుపెట్టగానే ఉత్పాతాలు తగ్గుముఖం పట్టాయి. తర్వాత తర్వాత పూర్తిగా తొలగిపోయాయి.

—అరణి

# స్నేహభావంతో మెలగాలి

**తప్పులు చేయడం చాలా సహజం. అందులోనూ టీనేజర్లు తెలిసో తెలియకో కొన్నిసార్లు దుడుకుతనం కొద్దీ కావాలనే తప్పులు చేస్తుంటారు. కొన్ని తప్పులు క్షమార్హం కానివి ఉంటే మరికొన్ని చిన్న చిన్న పొరపాట్లు ఉండవచ్చు. ఈ పొరపాట్ల వల్ల చివాట్లు తింటుంటారు.. తప్పు చేసినప్పుడు తల్లిదండ్రులు వాళ్ళను విమర్శిస్తుంటారు. కానీ ఎప్పుడూ విమర్శించడం సరికాదు. ఎప్పుడూ పొగడటం కూడా సరికాదు.**

'కన్నవారి ప్రేమ కనిపించే ఆకలివంటిది, యవ్వన ప్రేమ తినిపించే అన్నం వంటిది' అంటారు. టీనేజ్ తల్లిదండ్రులు తమ పిల్లలపట్ల బాధ్యతా రాహిత్యంగా ఉంటే వారి భవిష్యత్తు అంధకారం అవుతుందనడంలో సందేహమేమీ అక్కర్లేదు. అందుకే వారిని అప్పుడప్పుడూ విమర్శించాలి, అప్పుడప్పుడూ పొగడాలి కూడా...

అయితే ఈ విమర్శలు, పొగడ్తలనేవి ఎలా ఉండాలంటే...

## విమర్శ ఎలా ఉండాలి?

చాలామంది తల్లిదండ్రులు తమ పిల్లల్ని అవసరం ఉన్నా లేకున్నా విమర్శిస్తుంటారు. మావాడు ఇలా ఉంటాడు, మా అమ్మాయి ఇలా ఉంటుంది అంటూ పిల్లల సమక్షంలోనే ఇతరులముందు విమర్శిస్తూ చెబుతుంటారు. తల్లిదండ్రులు తమ పిల్లలపై చేసే విమర్శలలో చాలా భాగం అనవసరమైనవీ, ఏ ఉపయోగం లేనివేననుకోవాలి. ఆ విమర్శలు పిల్లలకు కోపం రప్పిస్తాయి. ప్రతీకార భావం రేపుతాయి. వయసులో ఉన్న కుర్రాణ్ణి ఊరికే విమర్శిస్తూ కూర్చుంటే ఆ కుర్రాడు తనను తాను నిందించుకోవడానికి అలవాటు పడతాడు. తనమీద తనకు విశ్వాసం పోయి ఇతరుల్ని చిన్నచూపు చూడడానికి అలవాటు పడతాడు. ఇతరుల్ని సందేహంగా చూసే స్థితికి వస్తాడు. ప్రతి దానికి వేరే వాళ్ళను అనుమానిస్తూ ఎవరిపైనా నమ్మకం పెంచుకోలేక భవిష్యత్తు విషయమై బెంగటిల్లుతుంటాడు.

భవిష్యత్తు గురించి టీనేజర్లు తమంతట తాము ఆలోచించుకునేలా తల్లిదండ్రుల విమర్శలు ఉండాలి తప్ప వాళ్ళ మనసును గాయపరిచేదిలా ఉండకూడదు. అతడి వ్యక్తిత్వాన్ని గాయపరిచేదిగా ఉండకూడదు.

ఉదాహరణకు కుర్రాడు ఒక సబ్జెక్ట్‌లో ఫెయిలైతే తల్లిదండ్రులకు కోపం రావడం సహజమే. నువ్వు పనికిమాలిన వాడివి అంటూ అతడి స్నేహితుల్ని పోలుస్తూ తల్లిదండ్రులు తిట్టకూడదు. దగ్గరగా తీసుకుని లాలనగా మాట్లాడాలి. "చూడు నువ్విప్పుడు ఫెయిలయ్యావు, సరే పోనీ జరిగిందేదో జరిగిపోయింది. ఇప్పుడేం చేద్దాం. ట్యూషన్‌కి వెళతావా, నీకు ఎందుకు ఈ సబ్జెక్ట్ కష్టంగా ఉంది?" అంటూ అనునయంగా మాట్లాడాలి. అలాంటి విమర్శ కుర్రవాడికి సంకల్పబలం కలిగిస్తుంది. తల్లిదండ్రుల విమర్శలు సమస్య పరిష్కరించేదిగా ఉండాలిగానీ మనస్సు గాయపరిచేదిగా ఉండకూడదు.

## సూటిపోటి మాటలు వద్దు

చిన్నప్పుడు తమను ఎలా ట్రీట్ చేశారనే విషయాలు తల్లిదండ్రుల మనస్సుల్లో ముద్రపడిపోయి ఉంటాయి. తమకు తెలియకుండానే పిల్లల్ని కూడా అలానే ట్రీట్ చేయడానికి వారు ప్రయత్నిస్తుంటారు. అయితే పేరెంట్స్ ముందుగా దీన్నుంచి బయట పడాలి. తిట్టడం, అవమానించడం లాంటి విషయాల్లో తల్లిదండ్రులు తమవైన పద్ధతులు, పదాలు ఉపయోగిస్తూ ఉంటారు. కోపం వచ్చినప్పుడు తరచు వాటినే పిల్లలమీద ప్రయోగించడానికి సిద్ధపడుతుంటారు. మొదట వ్యంగ్యోక్తులు, అపహాస్యానికి సంబంధించిన పదాలు ప్రయోగించకుండా, వాటిని తమలోంచి తొలగించుకునేందుకు ప్రయత్నించాలి. ఆ పడికట్టు పద్ధతులు, పదాలవల్ల తల్లిదండ్రులు తమకు తాము అపకారం చేసుకున్న వాళ్లవుతారు. దీనివల్ల పిల్లల్లో ప్రతిఘటన భావం కలిగే అవకాశం ఉంది.

ఒక ఇంట్లో ఇంటిపని జరుగుతోంది. చేసే పని చూసి ఆ ఇంట్లో ఉండే టీనేజ్ కుర్రవాడికి కూడా ఆపని చేయాలనిపించింది. ఒకటి రెండుసార్లు ప్రయత్నించాక చిన్న పొరబాటు జరిగి పనిమొత్తం చెడిపోయింది. దాన్ని చూడగానే తల్లిదండ్రులు కోపం ఆపుకోలేకపోయారు.

'బుద్ధిలేదురా గాడిదా! అసలు నువ్వు ఆ పని జోలికెందుకు పోయావు? నీకేపనీ చేతగాదు. జన్మలో నేర్చుకోలేవు' అన్నాడు తండ్రి అందరి ముందూ. ఆపని ఏమో కానీ పిల్లవాడి మనసుకు అయిన గాయం ఖర్చు మాత్రం విలువకట్టలేం. మాటిమాటికీ పిల్లల్ని కించపరుస్తూ మాట్లాడితే వారిలో ఆత్మ విశ్వాసం కొరవడుతుంది. 'మరి కోప్పడొద్దంటారా పిల్లల్ని?' అనేవాళ్లూ లేకపోలేదు. కోపం రావడం సహజమే కానీ జరిగిపోయినదాన్ని మార్చలేం కదా. 'జాగ్రత్తగా చేసుంటే బాగుండేదికదా' అంటే వారి వ్యక్తిత్వం గాయపడదు. పరుష పదజాలం టీనేజర్స్‌లో కోపాన్ని, నేరభావాన్ని కలిగిస్తాయి.

తల్లిదండ్రుల పట్ల వ్యతిరేక భావాన్ని సృష్టిస్తాయి. మాటిమాటికీ ఇలాంటి పదాలతో తిడుతూ ఉంటే కుర్రవాళ్లు న్యూనతాభావంతో కుంగి



పోతారు. చదువులో, జీవితంలో ఇతరులతో పోటీ పడాలనే ఆసక్తి కోల్పోతారు.

### తక్షణ కోపం తగదు

తల్లిదండ్రులెప్పుడూ ఒక విషయం బాగా గుర్తుంచుకోవాలి. కుర్రవాడివల్ల ఏదైనా పొరబాటు జరిగి నష్టం వాటిల్లినప్పుడు వెంటనే కోపం ప్రదర్శించకూడదు. ఆ పూర్వాపరాల గురించి చర్చిస్తూ కూర్చోకూడదు. కుర్రవాడు మానసికంగా కుంగిపోకుండా అతనికి ప్రోత్సాహం అందించాలి.

ఉదాహరణకు ఒక మనిషి నీళ్ళల్లో మునిగి ఈత రాక ఉక్కిరిబిక్కిరి అవుతున్నప్పుడు, 'ఈత రానపుడు నీళ్ళల్లోకి ఎందుకు దిగావు? దిగకుండా ఉండాల్సింది, ఎప్పుడైనా సరే ఈత నేర్చుకోవడం చాలా మంచిది' అంటూ ఒడ్డున నిలబడి ఎవరైనా వృథా మాటలు మాట్లాడతారా? ముందుగా నీళ్ళల్లోకి దూకి అతన్ని బయటకి లాగడమే ముఖ్యం కదా!

అలాగే టీనేజర్స్ చేసే తప్పుల విషయంలో కూడా, కుర్రాడికి మొదట ఏ సహాయం చేస్తే కుదుట పడతాడని ఆలోచించాలితప్ప విమర్శల యుద్ధంలోకి దూకడం మంచిదికాదు.

టీనేజర్లు చేసే తప్పులు ఏవి ఎంత ప్రమాదకరమైనవో, ఏవి ఎంత ప్రమాదకరంకాదో తల్లిదండ్రులు పెంపకం ద్వారా తెలియచేయాలి. అద్దం పగలగొట్టడం, పాలు ఒలకబోయడం లాంటి చిన్న చిన్న పనులకే కంగాళీ చేయకూడదు. ఒకవేళ నిజంగానే చేయకూడని తప్పు చేస్తే తప్పకుండా విమర్శించవచ్చు. కానీ అందరి ముందూ కాకుండా ఒంటరిగా ఉన్నప్పుడు విమర్శించాలి.

### పొగడ్తల విషయంలో

కొందరు తల్లిదండ్రులు పిల్లల్ని పొగడ్తలతో దారికి తెచ్చుకోవచ్చు అనుకుంటారు. ఇది కొంత వరకు ఓకే కానీ, అది తిమించి ఆ పొగడ్తలు సరైన పద్ధతిలో లేకపోతే పిల్లలకు అపకారం కలిగే ప్రమాదం కూడా ఉంది.

ప్రశంస ఎప్పుడూ పిల్లల్లో ఆత్మవిశ్వాసం పెంపొందించి భద్రతా భావం అందించేదిగా ఉండాలి. 'వాళ్ల అంతగా పొగుడుతున్నారు, నేను దీనికి తగినట్లు ఉంటానా అనుకుని ఆ ప్రశంస తాలూకూ అర్హతలకు తగినట్లు ఉత్తమంగా ఉండే ప్రయత్నం చేసేట్టుగా ఉండాలితప్ప ప్రయత్నించి విఫలమై ఆందోళనకు గురయ్యేట్టు ఉండకూడదు. ముఖస్తుతి ప్రశంస వద్దు. ప్రశంస కుర్రవాడిపైన కాకుండా, అతడు సాధించిన తీరుతెన్నులపైనే ఉండాలి. అలాగే పిల్లవాణ్ణి నాలుగు పొగడ్తలు పొగిడి ఆ మధ్యలో ఒక విమర్శ ఇరికించకూడదు. అలా చేయడం వల్ల ఆ పొగడ్తలు నిష్ఫలం కావడం మాత్రమేకాదు, కుర్రవాళ్లకు తమ తల్లితండ్రులు జోకర్లలా కనిపించే అవకాశం ఉంది.

## ప్రశంసలతో అనుభూతి

ప్రతి పొగడ్తలోనూ రెండు భాగాలు ఉన్నాయి. ఒకటి మనం అనే మాటలు, రెండోది వాటివల్ల కుర్రవాడు పొందే అనుభూతి! మనం పొగిడిన భావమే కుర్రవాడిలో తన పట్ల తనకూ ఉంటే అతడు దానిని ఆనందంగా స్వీకరిస్తాడు. అలా కాక అతనికి తనమీద తనకు అంత నమ్మకం లేకపోతే మనల్ని అనుమానంగా చూస్తాడు. లేకపోతే ఆ పొగడ్తకు తగినస్థాయిలో ఉండటానికి ప్రయత్నించి చేతకాక చతికిలబడితే తన మీద తాను విశ్వాసం కోల్పోతాడు.

ప్రతి కుర్రవాడికి తన వ్యక్తిత్వానికి సంబంధించి కొన్ని అభిప్రాయాలుంటాయి. మన ప్రశంసలు వాళ్ళ అభిప్రాయాలకు తగ్గట్లు వాస్తవబద్ధంగా అనునయ పూర్వకంగా నిర్మాణాత్మకంగా ఉండాలి. అలా లేనప్పుడు అతను గందరగోళంలో పడి ఆందోళనకు గురయ్యే అవకాశం ఉంది.



### అవమానించకండి

పిల్లల మీద కోపం ప్రదర్శించడంలేదంటే వాళ్లను మనం పట్టించుకోవడం లేదన్నమాట! వాళ్ల పట్ల యధాలాపంగా ఉంటున్నామని అర్థం. తల్లిదండ్రులు పిల్లల సంబంధాల్లో ఇలాంటి యాంత్రిక పద్ధతి అంత ఆరోగ్యకరమైన విషయం కాదు. కోపం ప్రవహించే నదిలాంటిది. అది మనస్సును ఆవరించినప్పుడు లోపలినుంచి కూడా ఎక్కువసేపు బిగపట్టి ఉంచలేం. అలా అనిచెప్పి పిల్లల్ని కోపంతో నానా మాటలని అవమానించడమూ మంచిది కాదు.

కోపం ప్రదర్శించడానికి ఒక పద్ధతి ఉంది. కోపంలో పెద్దవాళ్లు టీనేజర్స్ తాలూకు వ్యక్తిత్వాన్ని కించపరిచే పొరపాటు ఎన్నడూ చేయకూడదు.

పిల్లలకు ఆమాత్రం సున్నితంగా చెప్పగానే వాళ్లు వినాలి. బాల్యం నుంచి వారు మనమాట వినేట్టుగా అలవరచాలి. ఆదర్శవంతమైన పెంపకం, అర్థవంతమైన పెంపకం ఆకస్మికంగా టీనేజ్ ప్రారంభంలో అలవడదు. పసిప్రాయం నుంచే ఆ అలవాటు చేయాలి. అలాంటి సక్రమ పెంపకం జరిగినప్పుడు ఇలాంటి ఇబ్బందులు వచ్చే అవకాశం ఉండదు.

ఇక్కడ మరో సంగతి కూడా చెప్పుకోవాలి. పిల్లల మనస్సు గాయపర్చకుండా కోపగించుకోవడం అంత తేలికైన విషయం కాదు, అందుకు పేరెంట్స్ మానసికంగా సిద్ధమై ఉండాలి. ముందు పేరెంట్స్ ఉద్వేగంలో కొట్టుకుపోకుండా చూసుకోవాలి. ఈ విషయంలో తల్లిదండ్రులకు స్వీయశిక్షణ అవసరం.

పిల్లల మీద ఆంక్షల్ని విధించడంలో అప్పటి కాలానికి ఇప్పటికాలానికి చాలా తేడా ఉంది. పూర్వం పిల్లల అభిప్రాయాలు, అనుభూతులు లెక్కలోకి తీసుకోకుండా కఠినమైన ఆంక్షలు విధించేవారు. ఇప్పుడలా కాదు తల్లిదండ్రులు టీనేజర్స్ అభిమానాన్ని గౌరవిస్తున్నారు. కుర్రాళ్ళ ఫీలింగ్స్‌నూ, కోరికల్నీ పెద్దలు గౌరవించాలి. అదే సమయంలో సమాజానికి అంగీకారంకాని ప్రవర్తన ఉంటే నిరోధించాలి. వాళ్ళ అభిప్రాయాల్ని, దృక్పథాల్ని గౌరవించాలి. టీనేజర్స్‌కి స్నేహితులుగా మెలగాలి. అలా ఉండలేకపోతే, కనీసం మార్గదర్శకులుగా ఉండాలి! ఆ మార్గదర్శకత్వం గౌరవపూర్వకంగా స్నేహపూర్వకంగా ఉండాలి. అదే తల్లిదండ్రుల కర్తవ్యం!

## లక్ష్యాల విలువ చెప్పాలి

పిల్లలకు కొన్ని విలువలు బోధించడం, లక్ష్యం నిర్దేశించడం తల్లిదండ్రుల బాధ్యత. అది ఎవరూ మర్చిపోకూడదు. మనం ఏ విలువల్ని గౌరవిస్తామో వాళ్ల నుంచి ఏమి ఆశిస్తున్నామో స్పష్టంగా తెలియచేయాలి.

బహుశా పెద్దవారి విలువల్ని కుర్రవాళ్ళు తిరస్కరించవచ్చు. అలా తిరస్కరించడం వ్యక్తిత్వాన్ని ప్రదర్శించడంగా వాళ్ళు భావిస్తారు. అయినా ఫర వాలేదు. ఏ పిల్లలూ గుడ్డిగా తల్లిదండ్రుల అభిప్రాయాలను అనుకరించడం ద్వారా పరిపూర్ణులు కారు. అందుకే పిల్లల తిరస్కార ధోరణిని తల్లిదండ్రులు టాలరేట్ చేయాలి. మీరు బోధించే విలువలూ లక్ష్యాలూ వాళ్ళకు టార్చిలైట్ కాంతిలా ఉపయోగపడాలి.



– లతాకమలం
lathakamalam.me@gmail.com



# ఉత్తమ ఇల్లాలుడు

-ప్రఫుల్లచంద్ర

**ఆరు పెళ్ళిచూపులయ్యాయి. అయినా శరత్‌కి పెళ్ళి కుదరలేదు!**

**అతడు చూసిన అమ్మాయిలందరూ అందగత్తెలే. ఆస్తిపరులే. పెద్ద జీతాలతో మంచి ఉద్యోగాలే చేస్తున్నారు. అటువైపు, ఇటువైపు అందరూ ఆమోదించినా ఆఖరు క్షణంలో నాకీ పెళ్ళి ఇష్టం లేదు అనేస్తున్నాడు శరత్. కారణం చెప్పడు. పెళ్ళిచూపుల్లో అమ్మాయి, అబ్బాయి ఏకాంతంగా మాట్లాడుకునే సందర్భంలో ఏదో జరుగుతోంది. అదేమిటో శరత్ తల్లిదండ్రులకు తెలియడంలేదు. ఇంతలో ఏడో పెళ్ళి చూపులకు ముహూర్తం ముంచుకొచ్చింది. ఇదే ఆఖరు. ఇంక పెళ్ళిచూపులకు మేం రాం. తాడోపేడో తేల్చుకో అని ముందుగానే హెచ్చరించారు తల్లిదండ్రులు.**

ప్రియను చూసి ఇంటికొచ్చాక పిల్ల నచ్చిందా అని అడిగితే శరత్ మాట్లాడలేదు. ఒక్కసారిగా మహోగ్రుడైపోయాడు తండ్రి రంగనాథ్. "పోరా! పోయి చావు! నీ ఇష్టం వచ్చినట్టు అఘోరించు" అని రంకెలు వేశాడు.

"నాన్నా! పిల్ల నచ్చింది" గబుక్కున చెప్పేసి "కానీ....కానీ..." అని నసిగాడు శరత్.

'ఏమిట్రా కానీ?" గద్దించాడు రంగనాథ్.

ఎప్పుడో ఒకప్పుడు చెప్పాల్సిందే. అందుకే అప్పటికప్పుడే చెప్పడానికి ధైర్యం కూడదీసుకున్నాడు శరత్. "చెప్పరా, చెప్పు!" ఈసారి అమ్మ అందుకుంది.

సీలింగ్ ఫ్యాన్‌మీద దృష్టి నిలిపి తనలో తను గొణుక్కున్నట్టు "భార్యాభర్తల్లో ఒకరే ఉద్యోగం చేయాలన్నది నా ఉద్దేశం నాన్నా" అన్నాడు శరత్.

పక్కనే బాంబు పడ్డట్టు అదిరిపోయారు అమ్మానాన్నా!

'వీడికిదేం పోయేకాలం! ఇద్దరూ ఉద్యోగాలు చేస్తే బోలెడు జీతం. లోన్ తీసుకుని డూప్లెక్స్ హౌస్ కట్టుకోవచ్చు. కార్లో తిరగొచ్చు. పిల్లల్ని ఘనమైన స్కూళ్ళలో చదివించవచ్చు. ఎంత హోదా! ఎంత గౌరవం! ఇవన్నీ ఈ బడుద్ధాయికి తెలియదా?'

తండ్రి ఆలోచన అర్థమైంది కాబోలు "అది కాదు నాన్నా! ఇద్దరూ ఉద్యోగాలకు పోతే అలనాపాలనా లేక పిల్లలు చెడిపోతారు. యువకుల్లో నేరప్రవృత్తి పెరగడానికీ, అమ్మాయిలు మోసపోతూ ఉండడానికీ ఒక కారణం వారికి తల్లిదండ్రుల ప్రేమ, పెంపకం సరిగా అందకపోవడమే అని శాస్త్రజ్ఞులు అంటున్నారు".

"ఆc! బోడి శాస్త్రజ్ఞులు!" వెటకారంగా అన్నాడు రంగనాథ్.

"అందుకని మేం ఒక నిర్ణయానికి వచ్చాం. తను ఉద్యోగం చేస్తుంది. నేను మానేస్తాను".

గబగబా చెప్పి హమ్మయ్య!" అనుకున్నాడు శరత్.

అమ్మానాన్నలకు అది ఇంకో పెద్ద షాక్. కొయ్యబారిపోయారు ఇద్దరూ. ముందుగా తేరుకున్న అమ్మ ఇదేం చోద్యంరా అంటూ నోరు నొక్కుకుంది. "అదేమో మగరాయుడులా ఉద్యోగం చేస్తుందా?! నువ్వేమో ఆడంగి వెధవలా అంట్లు తోముకుంటూ ఇంట్లో కూచుంటావా?! నీకిదేం పోయేకాలంరా?" నాన్న హూంకరించాడు. ఆ రోజు భారంగా ఘోరంగా జరిగిపోయింది. మర్నాడు కాస్త తేటబడ్డాక సౌమ్యంగా చెప్పాడు శరత్, "ఉద్యోగం మానేసి ఇంట్లో కూచోడానికి ఏ అమ్మాయీ ఒప్పుకోవడం లేదు. గతంలో ఆరు పెళ్ళి చూపులూ అందుకే ఫెయిలయ్యాయి. ప్రియ మాత్రం నేనే ఎందుకు ఉద్యోగం మానెయ్యాలి? మీరు మానేసి ఇంటి పట్టున ఉండొచ్చుకదా అని ప్రశ్నించింది. ఇదో కొత్త ఆలోచన. ప్రయత్నించి చూద్దాం అనిపించింది. ఒక ఏడాదిపాటు కష్టనష్టాలు రుచి చూస్తాం. అలవాటైపోతే సరే. లేకపోతే అప్పుడు తను ఉద్యోగం మానేస్తుంది. నేను చేస్తాను".

అక్కడ ప్రియ ఇంట్లోనూ తర్జన భర్జనలే. శోకాలూ, ఆక్రోశాలే. "నీ జీతం అంతా మింగేయడానికి భలే ప్లాన్ వేశాడు. చివరకు చిప్ప చేతికిచ్చి వదిలేసిపోతాడు. మరోదాన్ని పెళ్ళి చేసుకుంటాడు. అసలు మగాడు ఆడ పనులు చేయగలడా? వాడో పెద్ద కిలాడీలాగున్నాడు" అని పెద్ద రంధి. కానీ శరత్, ప్రియ మధ్య మాత్రం తరచు ఫోన్‌లో కబుర్లు, అప్పుడప్పుడు కాఫీషాప్‌లో కలవడాలు, అభిప్రాయాల మార్పిడి, చర్చలవల్ల గౌరవం

పెరిగి ప్రేమ అంకురించింది. “ఒక కొత్త ఐడియాను నాటాం. అది మొలకెత్తి దృఢంగా ఎదగడానికి అవకాశం ఇద్దాం. ఓ ఏడాది తర్వాత అవసరం అయితే....” అని కాసేపు ఆగి “అలాంటి అవసరం రాకుండా జాగ్రత్త పడదాం” అన్నాడు శరత్.

***

ఇదంతా నిన్నా, మొన్నా జరిగినట్టుందిగానీ, వారి పెళ్ళయి ఏడేళ్ళయింది.

పెళ్ళయిన మొదట్లో ఇద్దరూ ఉద్యోగాల్లో ఉన్నారు. రెండేళ్ళ తర్వాత ఆమె గర్భవతి అయింది. సెలవు పెట్టింది. అతడు రాజీనామా చేసి డాక్టర్ సూచనల ప్రకారం కన్నతల్లిలా, కంటికి రెప్పలా, ఆమెను కాచుకున్నాడు. బాబు పుట్టిన మూడు నెలలకు ఆమె మళ్ళీ ఉద్యోగంలో చేరింది.

సెవెన్ ఇయర్ ఇచ్ అని ఆంగ్లేయులు చెప్తారు. ఎంత అన్యోన్య దాంపత్యమైనా ఏడేళ్ళ కాపురం తర్వాత వైముఖ్యం ప్రవేశించి పక్కచూపులు చూస్తారనేది వాళ్ళ సిద్ధాంతం. కానీ వీరి దాంపత్యం నిత్య నూతనం. ఉల్లాసభరితం. చీకూచింతా లేదు. అంతా టైమ్ ప్రకారం క్రమబద్ధంగా సాగిపోతోంది. టైమ్ టేబుల్ ప్రకారం బాబుకి రెండేళ్ళు నిండగానే వారి జీవితంలో పాప ప్రవేశించింది. పాపవల్ల పని పెరిగింది గానీ ప్రేమ తరగలేదు.

కొత్త ఐడియా మొలకెత్తి దృఢంగా నాటుకుంది.

యదాప్రకారం పన్నెండు గంటలకు ప్లే స్కూలు నుంచి పాపను ఇంటికి తీసుకొచ్చి కాళ్ళూ చేతులూ శుభ్రంగా కడిగి కథలు చెబుతూ అన్నం తినిపించి నిద్రపుచ్చాక తనూ భోజనం చేశాడు శరత్. తర్వాత గిన్నెలు తోముతూ ఉండగా, “అన్నయ్యగారూ! అంట్లు తోముతున్నారా? మీకిదేం ఖర్మ! తప్పుకోండి నేను తోముతాను” అంటూ పక్కింటావిడ పరువాల పంకజం వచ్చింది. అదేం చోద్యమో! ఆమె ఎప్పుడొచ్చినా పైట జారిపోతుంది. దాన్ని సవరించుకోడానికి కాస్త ఎక్కువ సమయమే తీసుకుంటుంది. ఈసారీ అంతే! చొరవగా అతన్ని పక్కకు నెట్టి సింక్‌లో గిన్నెలు కడగడం ప్రారంభించింది, అతను వద్దంటున్నా వినకుండా. ఈ మధ్య ఆమె రాకలు ఎక్కువయ్యాయి. ఈ వ్యవహారం కట్ చేయాలని “నీ రాకలు చూసి ఎవరైనా నోరు పారేసుకోవచ్చు. నీ మంచికే చెబుతున్నా. ఇంక ఇక్కడకు రాకు” అని ఖచ్చితంగా చెప్పేశాడు శరత్.

**ఆరు పెళ్ళి చూపులైపోయాయి. ఏ సంబంధమూ కుదరలేదతనికి. అబ్బాయి, అమ్మాయి ఏకాంతంగా మాట్లాడుకునే సమయంలో ఏదో జరుగుతోందన్నదే తల్లిదండ్రుల సందేహం. అదేంటో అంతుబట్టడంలేదు వారికి. ఏదో పెళ్ళిచూపుల్లో అమ్మాయి ఓ షరతు పెట్టింది. నసుగుతూనే తల్లిదండ్రులకి ఓకే చెప్పాడతను. ఇంతకూ ఆమె షరతేంటి? వాళ్ళ కాపురం సజావుగా సాగిందా? లేదా?**

చివ్వున కన్నీళ్ళు పెట్టుకుని “నేనలాంటి దాన్ని కాదు అన్నయ్యా! నువ్వే అమాయకుడివి. నీ భార్య ఆఫీసులో మగవాళ్ళతో ఇకఇకలూ, పకపకలూ! చెప్పుకుంటే సిగ్గుచేటు! మా వారిని బుట్టలో వేసుకుంది! దాన్ని నువ్వు హద్దుల్లో పెట్టకుంటే నీ కొంప, నా కొంపా కొల్లేరే! అది చెప్పడానికే వస్తున్నా. చెప్పలేక పోతున్నా. ఇవాళ చెప్పేశాను. ఇంక రానులే” అంటూ రోషంగా విసవిసా వెళ్ళిపోయింది. మౌనంగా వెళ్ళి పాప పక్కనే నడుంవాల్చాడు. ముచ్చటగా కనిపిస్తున్న పాప ముంగురులు సవరిస్తే నిద్రలోనే నవ్విన పాప మరింత ముచ్చటగా కనిపించింది. దాని చెక్కిలిపై ముద్దుపెట్టి నిద్రలోకి జారిపోయాడు.

అలవాటుగా రెండు గంటలకు మేల్కొని కంప్యూటర్ గదిలోకి వెళ్ళాడు. టేబుల్‌మీద చిందరవందరగా పడి ఉన్న ఫైళ్ళు, కాగితాలు నీటుగా సర్దుకుని ఒక ఫైలు తెరిచి సరిచూసుకున్నాడు. కంప్యూటర్‌లో దాన్ని ఫీడ్ చేస్తుండగా, హఠాత్తుగా అనూహ్యంగా ప్రియ లోనికి వచ్చింది!

ఆ ఇంటికి బయట నుంచి లోపల నుంచి కూడా తాళం వెయ్యవచ్చు. తియ్యవచ్చు. ఇద్దరి దగ్గరా చెరో తాళం చెవీ ఉంటాయి. అందుకే లోనికి రాగలిగింది. వచ్చి డిటెక్టివ్‌లా చుట్టూ చూసింది.

భార్యవైపు చూస్తూ “ఆనందరావు చెప్పాడా?” అని మృదువుగానే అడిగాడు. ఉలికిపడింది. “మీకెలా తెలుసు?” అన్న ప్రశ్న ఆమె గొంతుదాటి రాలేదు! సమాధానం చెప్పకుండా కుర్చీలో కూలబడింది.

“పనీపాటా లేని మెదడు, దయ్యాల నిలయం. పెళ్ళాం సంపాదన మీద బతికే మగవాణ్ణి అసలే నమ్మకూడదు. మీ ఆయన అందగాడు. నవ్విస్తూ ఆడవాళ్ళని పడగొట్టడంలో సిద్ధహస్తుడు. చెప్పుకుంటే సిగ్గు సిగ్గు! మా ఆవిడ మీ ఆయన వలలో పడింది. ఆడవాళ్ళ నుంచి డబ్బు వసూలు చేసుకుంటున్నాడు మగవేశ్య!” అని తన ఆఫీసులోనే పనిచేసే పక్కింటి ఆనందరావు గద్గద స్వరంతో కన్నీళ్ళు పెట్టుకుని కొన్ని రోజులుగా నస పెడుతూనే ఉన్నాడు.

మొదట్లో పట్టించుకోకపోయినా వినగా వినగా...

శరత్ బాత్‌రూమ్‌లో ఉన్నప్పుడు బీరువా తెరిచి చూసింది. అతని బ్యాంకు ఖాతా పెరుగుతూ ఉంది. అతని ఖర్చులకోసం తను ఉంచిన డబ్బు అలాగే ఉంది. ఇదెలా సాధ్యం? అనుమానం మొలకెత్తింది.

అందుకే హఠాత్తుగా రెయిడింగ్‌లా దూసుకు వచ్చింది. కానీ శృంగభంగం!

ఒక్కసారిగా పశ్చాత్తాపం అలముకుని ఉక్కిరిబిక్కిరి అయింది. ‘ఛీ ఛీ..! శరత్ అలాంటివాడు కాదు. తనే తొందరపడింది.

ఏ మగాడైనా సూర్యోదయానికి ముందేలేచి కల్లాపి జల్లి ముగ్గులు పెడతాడా? పిల్లల్ని టాయిలెట్‌కి తీసుకువెళ్ళి స్నానాలు చేయిస్తాడా? వాళ్ళకి ముస్తాబులు చేసి హోం వర్కు చేయిస్తాడా? ఎవరికేది ఎప్పుడు అవసరమో అది కమ్మగా వండి పెడతాడా? కార్యేషు దాసి....అంటూ భార్యకు ఉండాల్సిన లక్షణాలు చెప్పారుగానీ అవన్నీ శరత్‌లో ఉన్నాయి! అతడు ఉత్తమ భర్త! ఔను నిజం!!

సెలవు రోజుల్లో కూడా పని అంతా ఒక్కడే చేస్తాడు. తనను చేయనివ్వడు. తన ఫ్రెండ్స్ ఇంటికి వచ్చినప్పుడు కూడా టిఫిన్, టీ తనే తీసుకువస్తాడు. ఒకసారి తన ఫ్రెండ్స్ హద్దు మీరారు. “పకోడీ బ్రహ్మాండంగా ఉంది సార్. ఫ్రంట్ గదిలో టిఫిన్ సెంటర్, కర్రీ పాయింట్ పెట్టుకోండి. భలే లాభాలు” అంది షర్మిల. “రేపు మా ఇంట్లో చిన్న ఫంక్షన్ ఉంది. మీరు వచ్చి వంట చేస్తారా ప్లీజ్” అడిగేసింది స్మిత. తనకు పిచ్చి కోపం వచ్చేసింది. “ఆయన వంట చేయడం మా ఒప్పందంలో భాగం. అడ్డమైనవాళ్ళకోసం వంట చేయడం, అమ్ముకోవడం.... అంత ఖర్మ పట్టలేదు మాకు. అతిథులుగా వచ్చారు, అలాగే ఉండండి, హద్దు మీరకండి” అరిచేసింది తను. షర్మిల, స్మిత బిక్కచచ్చిపోయి అలాగే ఉండిపోయారు. శరత్‌కు సారీ చెప్పారు. అప్పుడు తనకంత కోపం వచ్చిందే, మరి ఇప్పుడు ఆనందరావు మాటలు ఎందుకు నమ్మింది? కోపం ఎందుకు రాలేదు? శరత్‌ని ఎందుకు అనుమానించింది?” ఆలోచిస్తూ ఉండిపోయింది ప్రియ.

“ఆనందరావు చెప్పాడా? అడిగితే జవాబు చెప్పవేం?” మళ్ళీ అడిగాడు శరత్. ఏం చెప్తుంది? టేబుల్ మీదున్న ఫైళ్ళు తెరిచి చదువుతున్నట్టు ఉండిపోయింది. ఇప్పుడు పత్రికారంగం కూడా ఔట్ సోర్సింగ్ ఉపయోగించుకుంటోంది. ఒక తెలుగు వారపత్రిక ఒక సంచికలో ప్రచురించవలసిన మెటీరియల్ శరత్‌కి పంపిస్తోంది. వాటిని టైపుచేసి పేజీలు వారీగా కూర్చి బొమ్మలు, జోకులు, సినిమా బిట్స్, వింతలు, విశేషాలు చేర్చి పత్రిక రూపంలో కంప్యూటర్ ద్వారా పత్రికా ఆఫీసుకు మెయిల్ చేస్తాడు శరత్. వాళ్ళు ప్రచురిస్తారు. శరత్ ఉపసంపాదకుడు, చిత్రకారుడు,

## ఐటెంపాపగా రకూల్?



రకూల్‌ప్రీత్‌సింగ్ ఏమిటి? ఐటెంసాంగ్ చేయడం ఏమిటి? అన్న అనుమానం వస్తోందా? కానీ ఈ వార్త నిజమయ్యేటట్టు ఉంది అంటున్నారు సినీజనాలు. స్టార్ హీరోయిన్లు ఐటెంసాంగ్‌లు చేయడం కొత్తేమీ కాదు. దానికి రకూల్ మినహాయింపు కాదు అని కూడా అంటున్నారు. ఇంతకూ అసలు సంగతేమిటంటే....‘జనతా గ్యారేజ్’లో ఐటెం సాంగ్ చేసిన కాజల్‌కు ఎంత పేరొచ్చిందో అందరికీ తెలిసిందే! తనకూ అంత పేరు రావాలన్న కోరిక రకూల్‌కి చాలా కాలం నుంచి ఉందట! ఆ కోరికను తారక్, బాబీ తీర్చబోతున్నారట! జూనియర్ ఎన్టీఆర్ కొత్త సినిమాలో రకూల్ చేత ఐటెంసాంగ్ చేయించే ఆలోచనలో ఉన్నారట! అయితే కోలీవుడ్‌లో యమ బిజీగా ఉన్న రకూల్ ఐటెంసాంగ్ చేస్తుందా? అన్న అనుమానాన్ని పలువురు వ్యక్తం చేస్తున్నారు. కాకపోతే స్టార్ హీరో సినిమాలో కనుక ఒప్పుకోవచ్చని కూడా అంటున్నారు.

డి.టి.పి నిపుణుడన్నమాట. అందుకే అతనికి ప్రతి ఫలం బాగానే ముడుతోంది. అదీగాక అతడు బీటెక్ చదివే రోజుల్లోనే అవకాశం కుదిరి నేర్చుకున్న ఫ్రెంచ్ భాష ఇప్పుడు ఉపయోగపడింది. డిల్లీలోని ఫ్రెంచ్ రాయబార కార్యాలయానికి ఫ్రెంచ్ నుంచి ఇంగ్లీషు లోకి, ఇంగ్లీషు నుంచి ఫ్రెంచ్ భాషలోకి అనువాదం చేసే మనిషి కావాలని నెట్‌లో ప్రకటించారు. శరత్ కొన్ని అనువాదాలు వాళ్ళకు పంపించాడు. అవి వాళ్ళకు నచ్చడంతో అతనికి పని అప్పగించారు. పారితోషికం బాగానే ఇస్తున్నారు. "నా బ్యాంక్ ఖాతా పెరగడానికి కారణం ఇదీ. నువ్వు అనుకున్నది కాదు" మృదువు గానే చెప్పాడు శరత్. కానీ ఛెళ్ళున తగిలింది ఆమెకు.

సగటు భర్తలానే ప్రియ కూడా సెలవురోజుల్లో ఇంట్లో ఏ పనీ చెయ్యదు. ఆమె ఎప్పుడూ కంప్యూటర్ గదిలోకి వెళ్ళనేలేదు. వెళ్ళివుంటే అక్కడి సాహితీ సౌర భాలు ఆమెను తాకేవి. భర్త ఏం చేస్తున్నాడో అప్పుడే ఆమెకు తెలిసేది. కొత్తగా ఇప్పుడీ అనుమానం వచ్చేదే కాదు. ఆమె కళ్ళల్లో కన్నీళ్ళు గిర్రున తిరిగాయి. "నాదే తప్పు. నాదే తప్పు.." అంటూ అతని పాదాలపై వాలి




పోయింది. ఆమెను లేవదీసి హృదయానికి హత్తు కుని, "నా తప్పూ ఉంది లేవోయ్. నేను చేస్తున్న ఔట్ సోర్సింగ్ గురించి ముందుగానే నీకు చెప్పి ఉండా ల్సింది" అన్నాడు.

***

శరత్, ప్రియల విచిత్ర దాంపత్యం గురించి తెలుసుకున్న ఒక ఛానల్‌వారు తమ మహిళా కార్య క్రమంలో వాళ్ళిద్దరినీ ఇంటర్వ్యూ చేశారు. వివాహా నికి ముందు జరిగిన విషయాలు క్లుప్తంగా చెప్పాడు శరత్. మీ విచిత్ర ఒప్పంద దాంపత్యం హాయిగా ఉందా? అని ప్రియను అడిగింది యాంకర్.

"మొదట ఇటువైపు, అటువైపు ఎన్నో విమర్శలు, అభ్యంతరాలు వచ్చినా మా మధ్య నమ్మకం, ప్రేమ ఇనుమడించి పెళ్ళికి దారితీశాయి. కొత్త కాపురంలో నిప్పు రాజెయ్యడానికి శకునులు, మంథరమ్మలు ఎంతో మంది ప్రయత్నించి ఓడిపోయారు. నేను నిశ్చయంగా చెప్పగలను. ఎన్నో కుటుంబాలకన్నా మేం హాయిగా ఉన్నాం" చెప్పింది ప్రియ.

"మగవాళ్ళు పిల్లల్ని సరిగ్గా పెంచగలరా?" అడి గింది యాంకర్.

"ఈనాటి పిల్ల రాక్షసుల్ని చూడండి. ఎవరింటికి వెళ్ళినా అన్నీ పీకి పారేస్తారు. సెల్‌ఫోన్లు లాక్కుని గేమ్స్ ఆడుకుంటారు. టీవీలో కార్టూన్ షో తప్ప మరేదీ చూడనివ్వరు. కానీ మా పిల్లలు రత్నాలు! పెద్దలకు నమస్తే చెప్పి ముచ్చటగా మాట్లాడతారు. ఎవరింటికి వెళ్ళినా బుద్ధిగా కూచుంటారు. ఇది వద్దు, అది వద్దు అనకుండా పెట్టినవన్నీ నీట్‌గా తింటారు. నేనైతే పిల్లల్ని మా ఆయనంత చక్కగా పెంచలేను!"

"మీ ఆయనకు ఉత్తమ ఇల్లాలు అవార్డు ఇవ్వొచ్చు నన్నమాట!" నవ్వింది యాంకర్. "ఉత్తమ ఇల్లాలు కాదు, ఉత్తమ ఇల్లాలుడు!" సవరించాడు శరత్. మైక్ బద్దలయ్యేట్టు నవ్వింది యాంకర్. తర్వాత అడిగింది, "అయితే మీకు ఏ సమస్యా లేదన్నమాట!" "జీవితం అంటేనే సమస్యల సమాహారం! ఒకటి పోతే మరొ కటి దాపురిస్తుంది! సహనంతో, సదవగాహనతో సమస్యలు పరిష్కరించుకుంటేనే సంసారం సవ్యంగా సాగుతుంది. సమస్యలు పరిష్కరించుకుని ఇంత వరకూ మేం హాయిగా ఉన్నాం" అన్నాడు శరత్.

"కానీ వారం రోజుల క్రితమే ఒక జటిలమైన సమస్య తలెత్తింది" గంభీరంగా అంది ప్రియ.

"చెప్పండి, చెప్పండి" ఆత్రపడింది యాంకర్.

"ఏడేళ్ళ మా బాబుకి వాడి ఫ్రెండ్స్ చెప్పారట, ఆ ఫ్రెండ్స్‌కి వాళ్ళ తల్లిదండ్రులు చెప్పారు. నేనువాడి కన్నతల్లిని కాదనీ, ఆంటీ అనీ! దాంతో ఈ ఆంటీ మన ఇంట్లో ఎందుకు ఉందీ? పంపించేయండి అంటూ వాడు తండ్రిని అడిగాడు. షాక్ అయ్యాం మేం".

యాంకర్ కూడా షాక్ అయినట్టే కనిపించింది.

"నిజానికి తప్పంతా నాదే. సగటు భర్తలాగా నేను కూడా ఇంట్లో ఏ పనీ చేయను. ఆయన పిల్లల్ని బాగా చూసుకుంటున్నారు కదా అని నేను వెనక్కు తగ్గాను. సెలవు రోజుల్లో కూడా పిల్లలకు స్నానాలు చేయించడం, కథలు, కబుర్లు చెప్పడం లాంటివి చేసే దాన్ని కాదు. పిల్లలు కేరింతలు కొడుతూ తండ్రితో ఆడుకుంటూ ఉంటే చూసి ఆనందించేదాన్నేగానీ, వారి ఆటల్లో నేను చేరేదాన్ని కాదు. అందుకే వాళ్ళ దృష్టిలో ఆంటీగా మిగిలిపోయాను. నా పిల్లలకు అమ్మగా చేరువ కాలేకపోయాను" దీనంగా అంది ప్రియ.

"ఈ సమస్యకు పరిష్కారం ఏమిటి? ఆయన్ను ఉద్యోగానికి పంపి మీరు మానేస్తారా?" అడిగింది యాంకర్. ప్రియ మాట్లాడలేదు. గంభీరంగా ఉండి పోయింది. శరత్ అందుకున్నాడు. "భార్యాభర్తల్లో ఒకరే ఉద్యోగం చేయాలన్నది నా నిర్ణయమే. అందుకు ఒక కారణం ఉంది. మా నాన్నగారి ఆత్మీయ మిత్రుడు వెంకట్ పెద్ద ఉద్యోగి. ఆయన భార్య ఐటీ కంపెనీలో టీమ్ లీడర్. చెరో లక్షా జీతం. ఒకే కొడుకు. ఆలనా పాలనా చూసేందుకు ఆయాను నియమించారు. వాడికి పదేళ్ళు రాగానే బెస్ట్ హాస్టల్ ఉన్న సూపర్ స్కూల్లో చేర్పించారు. అడిగినవన్నీ కొని ఇచ్చారు. స్మార్ట్ ఫోన్, ల్యాప్‌టాప్, డిజిటల్ కెమెరా ఇచ్చారు. పదమూడవ ఏట బైక్ కూడా కొని చ్చారు. అన్నీ ఇచ్చారుగానీ, ప్రేమ ఇవ్వలేకపో యారు. ఎందుకంటే ఆ తల్లిదండ్రులిద్దరూ ఎప్పుడూ బిజీ! పోటీపడి ఇంకా ఎక్కువ పని చెయ్యాలి, ప్రమో షన్ సాధించాలి, ఇంకా ఎక్కువ జీతం పొందాలి.. అదే లక్ష్యం" ఏకబిగిన చెప్పి ఆగాడు శరత్.

దీర్ఘంగా ఊపిరిపీల్చుకుని అన్నాడు, "వాళ్ళకి జీవితం కన్నా జీతం మీదే ఎక్కువ దృష్టి. ఇంట్లో కన్నా ఆఫీసులోనే ఆనందం. హఠాత్తుగా ఓ రోజు ప్రిన్సిపల్ నుంచి వెంటనే రమ్మని ఫోన్. తక్షణం బయలుదేరి వెళ్ళి చూశాడు. కొయ్యబారిపోయాడు వెంకట్. పోలీ సుల మధ్య వాళ్ళబ్బాయి! ఆ పదమూడేళ్ళ కుర్రాడు పదేళ్ళ అమ్మాయిని రేప్ చేశాడట! అమ్మాయి న్యూడ్ ఫొటోలు తీసి బెదిరించి లొంగదీసుకున్నాడట. ఆ ఫొటోలు చూపించారు పోలీసులు. ఆ ఫొటోలు వాడి స్మార్ట్‌ఫోన్‌లో ఉన్నాయి. పైగా తను చేస్తున్న ఘన కార్యం రికార్డు చేసుకున్నాడు. కుప్పకూలిపోయాడు వెంకట్. జీవచ్ఛవంలా ఇంటికి వచ్చాడు. వాళ్ళ కలల స్వర్గం చిన్నాభిన్నమైంది. సన్నిహితులు ఓదారుస్తూ లోలోపలే నవ్వుకున్నారు. బంధువులు ఆడిపోసుకున్నారు. అవమానం భరించలేక తల్లి ఆత్మహత్య చేసుకుంది."

శరత్ ఆగాడు. ఒక్కక్షణం నిశ్శబ్దం..

"తల్లిదండ్రులు పిల్లలతో వీలైనంత ఎక్కువ సమయం గడపాలి. తల్లిగానీ, తండ్రిగానీ వాళ్ళ ఆలనా పాలనా చూస్తూ, అవసరాలు తీరుస్తూ, పక్కదారి పట్టకుండా సదా గమనిస్తూ ఉండాలి. ఈనాటి యువతులు హౌస్‌వైఫ్‌గా ఉండటానికి ఇష్టపడటం లేదు. అందుకే నేను హౌస్ హజ్బెండ్‌గా ఉండిపోవ డానికి నిర్ణయించుకున్నాను" అంటూ నవ్వేశాడు శరత్.

"ఆయనతో పిల్లలకు చక్కని అనుబంధం ఏర్ప డింది. నన్ను ఆంటీగా భావిస్తున్నారు" కించిత్ బాధగా అంది ప్రియ.

"అయితే మీ ఒప్పందం ఫెయిల్ అయినట్టే కదా?" అడిగింది యాంకర్. 'వీక్షకులకు "మీరిచ్చే సందేశం ఏమిటి?"

"మేం సందేశం ఇవ్వడానికి రాలేదు. చక్కని కుటుంబం కావాలి మాకు. మా ఒప్పందంలో లోపం లేదు. ఆయన వంద మార్కులు సాధిస్తే నాకు పాస్ మార్కులు కూడా రాలేదు. నా లోపాన్ని అధిగమి స్తాను. కంప్యూటర్ అనేక ఉపాధి అవకాశాలు కల్పి స్తోంది. నేను కూడా ఉద్యోగం మానేసి కంప్యూటర్ ద్వారా ఉపాధి పొందితే మంచిదనిపిస్తోంది. ఇద్దరం కలిసి చేయడానికి తగిన ప్రాజెక్టు ఏమిటా అని ఆలో చించాలనుకుంటున్నా. పిల్లలకు మా ఇద్దరి ప్రేమా అందిస్తాం. ఇకపై మా పిల్లలు ఆంటీని అమ్మగా చూస్తారు. మాది ఆదర్శ కుటుంబం అవుతుంది" ఆమె స్వరంలో ఆశాభావం వెల్లివిరిసింది.

***సెల్: 98490 08774***

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో

## 'మోకాళ్ళ నొప్పుల' సమస్యకు సరైన పరిష్కారం

డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్



మన ప్రతి కదలికలో కీళ్ళ పాత్ర, వాటి ప్రాధాన్యత మనందరికీ తెలిసిన విషయమే. ప్రతి క్షణం ఎలాంటి ఆటంకాలు లేకుండా కీళ్ళు సక్రమంగా పనిచేస్తూ ఉంటేనే మన శరీర కదలికలన్నీ సవ్యంగా సాగిపోతుంటాయి. ఇలాంటి కీళ్ళ విషయంలో మనం ముఖ్యంగా చెప్పుకోవలసింది మోకాళ్ళు–వాటి ప్రాధాన్యత గురించి. మన శరీరంలోని అన్ని కీళ్ళలోకి మోకాలి కీళ్ళు అతి పెద్దవి. ఇవి శరీరపు బరువును మోస్తూ నడవడానికి, పరుగెత్తడానికి మరియు వివిధ కదలికలన్నింటికీ సహకరిస్తాయి.

**మోకాలి జాయింటు** (Knee Joint): తొడ ఎముక (ఫీమర్) మరియు దిగువ కాలి ఎముక (టిబియా) రెండూ కలసి మోకాలి జాయింటుగా ఏర్పడి ఉంటాయి. ఈ రెండు ఎముకల చివరి భాగాలు కలసిన ప్రాంతం 'కార్టిలేజ్' అనే నున్నటి మృదులాస్థితో కప్పబడి ఉంటుంది. అవి రెండూ ఒక దానిపై మరొకటి తేలికగా మరియు పరస్పరం మృదువుగా కదలడానికి ఆ మృదులాస్థి సహాయపడుతుంది. మోకాలి జాయింటును చుడుతూ సైనోవియం అనే పొర ఉంటుంది. ఈ పొర సైనోవియల్ ఫ్లూయిడ్ అనే ముఖ్య ద్రవాన్ని విడుదల చేస్తుంటుంది. ఈ సైనోవియం పొరను చుడుతూ క్యాప్సూల్ అనే మరో గట్టిపొర ఏర్పడి ఉంటుంది. ఇది మోకాలి జాయింటును స్థిరంగా ఉంచేందుకు దోహదపడుతుంది. ఇవే కాకుండా మోచిప్ప లేదా పటెల్లా, టెండాన్‌లు మరియు వివిధ లిగమెంట్‌లు, కండరాలతో మోకాలి జాయింటు ఎంతో పటిష్టంగా నిర్మితమై ఉంటుంది. ఏ కారణం చేతనైనా వీటిలో మార్పులు ఏర్పడినట్లయితే – వాటి కారణంగా సాధారణం నుండి అతితీవ్రమైన మోకాలి నొప్పులు సంభవించి, కీళ్ళ కదలికలను కష్టతరంగా మారుస్తాయి. కొన్నిసార్లు సాధారణ స్థాయిలో వచ్చిపోయే మోకాళ్ళ నొప్పులను నిర్లక్ష్యం చేసి, సరైన చికిత్స అందించనట్లయితే ఇవే నొప్పులు దీర్ఘకాలికంగా కొనసాగే అవకాశం కూడా ఉంటుంది. కాబట్టి వీటిని మొదట్లోనే గుర్తించి సరైన చికిత్సను అందించడం ద్వారా మన కీళ్ళకు హాని కలగకుండా మనం కాపాడుకోవచ్చును.



**కారణాలు:** తాత్కాలికంగా ఏర్పడే మోకాళ్ళనొప్పులు మోకాలి జాయింట్‌కు ఏదైనా గాయం కలగడం వలన ఏర్పడవచ్చు. అయితే దీర్ఘకాలికంగా ఏర్పడే మోకాళ్ళ నొప్పులు శరీరంలో అంతర్లీనంగా ఉండే వ్యాధుల కారణంగా కలుగవచ్చు.

**మోకాళ్ళ నొప్పులకు దారితీసే వివిధ వ్యాధులు: (1) ఆస్టియో ఆర్థరైటిస్:** మోకాలి జాయింటులో ఉండే ఎముకల యొక్క కార్టిలేజ్ క్రమంగా అరుగుదలకు గురికావడం వలన ఏర్పడిన మార్పులు – క్రమేణా అతి తీవ్రమైన నొప్పి, వాపు వంటి ఇతర లక్షణాలను కలుగజేస్తాయి. **(2) టెండినైటిస్:** మోకాలి జాయింటు వద్ద ఉండే టెండాన్‌లు శోథమునకు గురికావడం వలన ఈ తరహా నొప్పి ఏర్పడుతుంది. దీనిలో మోకాలు ముందు భాగంలో నొప్పి కలుగుతుంది. **(3) బర్సైటిస్:** కీళ్ళలో ద్రవపదార్థాలతో నిండిన 'సంచి' లాంటి ఆకారాలను 'బర్సా' అని అంటారు. ఇవి కీళ్ళలోని ఎముకలు పరస్పరం రాపిడికి గురి కాకుండా కాపాడుతాయి. కీళ్ళను ఎక్కువగా ఉపయోగించడం లేదా కీళ్ళు గాయానికి గురికావడం వలన ఇవి శోథమునకు గురి అయి నొప్పిని కలిగిస్తాయి. **(4) కొండ్రో మలేషియా పటెల్లా:** పటెల్లా క్రింది భాగంలోని కార్టిలేజ్‌కు హాని కలగడం వలన ఇది ఏర్పడుతుంది. **(5) గౌట్ :** శరీరంలోని యూరిక్ ఆమ్లం యొక్క మోతాదు అధికస్థాయికి చేరుకున్న కారణంగా, యూరిక్ ఆమ్ల స్ఫటికాలు కీళ్ళలో వచ్చి చేరడం వలన కీళ్ళు శోథమునకు గురికావడంతో 'గౌట్' సమస్య ఏర్పడుతుంది. తద్వారా కీళ్ళు వాచిపోయి తీవ్రమైన నొప్పిని కలిగిస్తాయి. **(6) రుమటాయిడ్ ఆర్థరైటిస్ మరియు సోరియాటిక్ ఆర్థరైటిస్:** ఇవి రెండూ ఆటో ఇమ్యూన్ వ్యాధులే – అనగా శరీరంలోని రోగనిరోధక వ్యవస్థ పొరబడి సొంతకణాలపైనే దాడి చేయడం వలన కీళ్ళు శోథమునకు గురి అయి తీవ్రమైన నొప్పిని మరియు వాపును కలుగజేస్తాయి. **(7)** మెనిస్కస్ మరియు టెండాన్‌లు చీలికకు గురికావడం మరియు బోన్‌క్యాన్సర్ వంటి అంశాల కారణంగా మోకాళ్ళనొప్పులు ఏర్పడటం జరుగుతుంది. • ఇవే కాకుండా మోకాలి జాయింట్ బెణకడం, ఎక్కువగా కీళ్ళను ఉపయోగించడం మరియు కొన్ని రకాల ఇన్‌ఫెక్షన్‌లకు గురి కావడం, ఎక్కువ సమయం అసాధారణ పద్ధతిలో నిల్చోవడం, పోషకాహారలోపం వంటి అనేక అంశాల కారణంగా కూడా మోకాళ్ళ నొప్పులు ఏర్పడే అవకాశం ఉంటుంది.

**లక్షణాలు:** మోకాలి నొప్పి వలన కలిగే లక్షణాలు ఒక వ్యక్తి నుండి మరొక వ్యక్తికి భిన్నంగా ఉంటాయి. దీని లక్షణాలు నొప్పి ఏర్పడిన కారణాలపై ఆధారపడి ఉంటాయి. • మోకాలి నొప్పి తరచుగా ఏర్పడటం, కీళ్ళు ఉపయోగించే సమయంలో నొప్పి అధికం కావడం జరుగుతుంది. మోకాళ్ళ నొప్పులు తలెత్తినప్పుడు, మంట మరియు వాపు వంటి లక్షణాలను కూడా మనం గమనించవచ్చు.

**నిర్ధారణ పరీక్షలు:** వ్యాధి సంబంధిత లక్షణాలను బట్టి – రక్తపరీక్ష, కీళ్ళ యొక్క X-Ray, CT లేదా MRI స్కాన్ వంటి పరీక్షలు చేయించడం ద్వారా వ్యాధిని నిర్ధారించవచ్చు.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ వైద్యం:** హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో మాత్రమే అందించబడే జెనెటిక్ కాన్‌స్టిట్యూషనల్ చికిత్సా విధానం ద్వారా, ఎలాంటి కీళ్ళనొప్పులనైనా సమర్థవంతంగా నయం చేయడం జరుగుతుంది. ఈ ప్రక్రియలో కేవలం వ్యాధి లక్షణాలను మాత్రమే కాకుండా – రోగి యొక్క మానసిక మరియు శారీరక లక్షణాలను పరిగణనలోకి తీసుకొని, సమగ్ర అధ్యయనం జరిపిన అనంతరం, సూక్ష్మీకరణ పద్ధతిలో అందించే కాన్‌స్టిట్యూషనల్ హోమియోపతి మందులతో మాత్రమే ఇది సాధ్యపడుతుంది. ఇంతేకాకుండా కీళ్ళను దృఢంగా చేసి, రోగనిరోధక శక్తిని పెంచడం ద్వారా వ్యాధి మళ్ళీ తిరగబెట్టని విధంగా, పూర్తిగా నయం చేయడం జరుగుతుంది.

# మహానంది

25



-వక్కంతం సూర్యనారాయణరావ్, సెల్:98662 67287

**మహారాజుగారి ఏకాంత మందిరంలో కుబేరవర్మ, మహారాణి మహిమాదేవి, వాళ్ళ మధ్య లాలసా సువర్ణాసనాల మీద కూర్చున్నారు. వాళ్ళకు కొంచెం దూరంలో నంది మరొక సువర్ణాసనం మీద కూర్చున్నాడు. తనముందు జరుగుతున్న దృశ్యాన్ని నంది చిరునవ్వుతో చూస్తున్నాడు.**

మహారాజు అనుమతితో అంతఃపురంలోని వందలాది మంది దాస దాసీజనం వరుసగా వచ్చి సజల నయనాలతో యువరాణి లాలసను చూసి, నవ్వు ముఖాలతో నమస్కరించి వెళ్తున్నారు. నంది కళ్ళు దీపాంకుర కోసం రెప్పపాటు మరిచిపోయి చూస్తున్నాయి. తన దగ్గరగా వస్తున్న ఇద్దరు చెలి కత్తెలను చూడగానే లాలస లేచి నిలుచుంది.

"చపలా! చంచలా!" అంది లాలస. ఉద్వేగం ఆమె కంఠంలో ధ్వనించింది.

"అమ్మాయిగారూ!" చపలా, చంచలా అనబడిన యువతులు ఏడుపు ఆపుకుంటూ అన్నారు.

లాలస ఇద్దర్నీ ఒకేసారి కౌగిలించుకుంది. చెలి కత్తెలు తగ్గు స్వరంతో రోదిస్తున్నారు. అది దుఃఖ రోదన కాదు; ఆనంద రోదన! ఆనందోద్వేగం!

"చపలా, చంచలా యువరాణిని ఇక నుండీ కంటికి రెప్పలా కాపాడండి!" మహారాణి హెచ్చరించింది.

"చిత్తం మహారాణీ! మా యువరాణివారి మీద ఈగ కూడా వాలనివ్వం!" బుగ్గలు తుడుచుకుంటూ అంది చంచల.

అంతఃపుర దాసదాసీజనం యువరాణిని చూసి వెళ్ళిపోయారు. అయితే, నంది ఆశించినట్టు దీపాంకుర రాలేదు. బహుశా శౌచాలయ పరిచారికలకు ఇక్కడ ప్రవేశం లేదేమో...

మహారాజు కుబేరవర్మ తన దగ్గరగా ఏనుగు బొమ్మ తొండానికి వేళ్ళాడుతున్న చిన్న జేగంటను వెండి సుత్తితో చిన్నగా కొట్టాడు. ద్వారం ముందు కాపలా ఉన్న ద్వార పాలకుడు లోనికి వచ్చి,



తలవాల్చి వినయంగా నిలుచున్నాడు.

"ప్రతీహారీ, మహామంత్రినీ, సర్వసైన్యాధ్యక్షుడినీ రమ్మను!" కుబేరవర్మ ఆజ్ఞాపించాడు.

"ఆజ్ఞ!" అంటూ ప్రతీహారి వెళ్ళిపోయాడు.

కుబేరవర్మ నంది వైపు వినయంగా చూశాడు. "స్వామీ కొన్ని విషయాలు మాకు తెలియాలి. లాలసను ఎవరు అపహరించారు? ఆలయంలోంచి ఎలా అపహరించారు? ఎందుకు అపహరించారు? ఈ అంశాలు తేటతెల్లం కావాలి. ప్రతిచర్య చేపట్టాలి..."

"ఎవరు, ఎందుకు అపహరించారో మీ పుత్రిక చక్కగా, వివరంగా వినిపించగలదు. ఆమెను ఎలా రక్షిస్తూ తీసుకురాగలిగానో తదనంతరం నేను వివరిస్తాను!" నంది అన్నాడు. చూపుల్ని లాలస వైపు మళ్ళించాడు. "కల్యాణీ, ఆ వివరాలు నీ జననీ జనకులకు విన్నవించు!"

"అలాగే గురుదేవా..." లాలస వినయంగా అంది.

### జరిగిన కథ

**కా**మరూపరాజ్య సర్వసైన్యాధ్యక్షుడు రుద్రాక్షుడిని రాజద్రోహిగా నిర్ధారించి యావజ్జీవ కారాగారశిక్ష విధించాడు మహారాజు కుబేరవర్మ. రుద్రాక్షుడి కొడుకు నందికి రాజ్యబహిష్కార శిక్ష విధిస్తాడు. స్వయంవరం రోజున యువరాణి లాలసాదేవి మాయమవుతుంది. తనను అపహరించిన కళింగ రత్న చెరనుంచి తప్పించుకున్న లాలసను నంది రక్షిస్తాడు. మార్గంలో ఎదురవుతున్న ఆపదల నుంచి తప్పించుకుంటూ, సారంగ రాజ్యంలోకి ప్రవేశిస్తారు. గంగిరెద్దును కొనుగోలు చేసి, ఇద్దరూ తమ వేషాలు మార్చుకుంటారు. లాలసకు తన గతాన్ని వివరిస్తాడు నంది. కాలినడకన కామరూప రాజ్యానికి పొరుగురాజ్యమైన కేదారిక రాజ్యంలోకి ప్రవేశిస్తారు. లాలస నందిని కామరూప రాజ్యప్రవేశానికి ఒప్పించి, పథకం సిద్ధం చేస్తుంది. ఇద్దరూ సన్యాసి వేషాల్లో, అశ్వశకటంలో కామరూప రాజ్యానికి బయలుదేరతారు. అడవిమధ్యలో తమను అడ్డుకున్న దొంగలను మట్టికరిపిస్తాడు నంది. కామరూప రాజ్యంలోకి ప్రవేశించి, కామరూపాంబిక ఆలయానికి చేరుకుంటారు. లాలస తన తల్లిదండ్రులను ఆలయంలోనే కలుసుకుంటుంది. **ఆ తర్వాత....**



"ప్రభువులకు ప్రణామాలు" మహామంత్రి అన్నాడు.

"జయము జయము మహాప్రభూ!" సర్వసైన్యాధ్యక్షుడు సమరసేనుడు అన్నాడు.

"కూర్చోండి. అమ్మాయి లాలసను ఇదివరకే మీరు పలకరించి, పరామర్శించారు. వారు నిత్యనిర్మలానంద యోగిగారు. మా పుత్రికను రక్షించి, సురక్షితంగా తీసుకువచ్చిన పుణ్యాత్ములు. వారికి నమస్కరించండి!" కుబేరవర్మ అన్నాడు.

మహామంత్రీ, సర్వసైన్యాధ్యక్షుడూ తలలు వంచి, చేతులు జోడించి నమస్కరించారు.

"పరమేశ్వరార్పణం!" నంది దీవిస్తూ అన్నాడు.

"కూర్చోండి మహామాత్యా! తనను అపహరించిన దుర్మార్గుడు ఎవరో లాలస వివరిస్తుంది" కుబేరవర్మ అన్నాడు.

మహామంత్రీ, సర్వసైన్యాధ్యక్షుడూ ముందుకు వంగి, చెవులు రిక్కించారు. నంది చూపులు సర్వసైన్యాధ్యక్షుడు సమరసేనుడి మీదే ఉన్నాయి. తన తండ్రి సమర్థవంతంగా నిర్వహించిన పదవిని అలంకరించిన వ్యక్తి. ఎత్తుగా ఉన్న నుదురు. గుబురు కనుబొమలు, వాటికింద చిన్న చిన్న కళ్ళు. మెలితిరిగిన మీసాలు. ఎత్తుగా, లావుగా ఉన్న శరీరం. తన తండ్రికి జరిగిన అన్యాయంలో ఇతని ప్రమేయం ఉందా?

"నన్ను అపహరించిన వ్యక్తి కళింగరాజ్య యువరాజు కళింగరత్న.." లాలస అంది.

"కళింగ యువరాజా?" కుబేరవర్మ నిర్ఘాంత పోతూ అన్నాడు.

"కళింగ యువరాజు స్వయంవరంలో పాల్గొనడానికి వచ్చారే!" సాగరామాత్యుడు అన్నాడు.

"నా అపహరణకు అన్ని ఏర్పాట్లూ చేసి, ఏమీ ఎరుగని అమాయకుడిలా స్వయంవరానికి వచ్చాడు. అతను వికార స్వరూపుడు. తనను నేను వరించనని తెలుసు. అపహరించి రాక్షస వివాహం చేసుకోవాలన్న పథకం అతనిది..."

"ఈ వివరాలు నీకెలా తెలుసు తల్లీ?" మహారాణి అడిగింది.

"మత్తు మందు ప్రభావం నశించి, నేను స్పృహలోకి వచ్చాక మంచం దగ్గరగా కూర్చుని అతనే స్వయంగా, సగర్వంగా నాకు చెప్పాడు. నన్ను పర్వతం మీద ఉన్న ఏకాంత మందిరంలో బంధించి ఉంచాడు. పూర్తిగా వినండి..." అంటూ లాలస చెప్పసాగింది.

లాలస కథనాన్ని అందరూ అంతులేని ఆశ్చర్యంతో, మౌనంగా విన్నారు. వింటున్న కొద్దీ కుబేరవర్మ ముఖం ఆగ్రహావేశాలతో జేవురి

ప్రతీహారి తలుపులు తెరిచి, వినయంగా చూశాడు. "మహామంత్రిగారూ, సర్వసైన్యాధ్యక్షులూ విచ్చేశారు ప్రభూ!"

"ప్రవేశపెట్టు!" కుబేరవర్మ ఆజ్ఞాపించాడు.

ద్వారపాలకుడు పక్కకు తప్పుకున్నాడు. మహామంత్రీ, సర్వసైన్యాధ్యక్షుడు సమరసేనుడూ లోపలికి వచ్చారు.

స్తోంది. అప్పుడప్పుడు ఆయన పళ్ళు కొరకడం అంద రికీ స్పష్టంగా వినిపిస్తోంది.

"నన్ను అపహరించిన వ్యక్తి బారి నుండి తానే రక్షించినట్టు నటిస్తూ, నన్ను తీసుకొచ్చి, మీ మెప్పు పొంది పెళ్ళాడాలన్న కళింగరత్న కుతంత్రాన్ని తెలుసు కుని పర్వత మందిరం నుండి తప్పించుకున్న నన్ను కళింగరత్న తొత్తులు వేటాడారు. ఆ విపత్కర సమ యంలో గురుదేవులు నిత్యనిర్మలానందుల వారు నన్ను రక్షించారు. ఆయన నన్ను సురక్షితంగా మీ వద్దకు చేర్చడానికి పడిన శ్రమ అనన్యసామాన్యం. అది వారి ఘనత. తన ఘనత గురించి ఆయన అంతగా చెప్పు కోరు. నన్ను కాపాడిన గురుదేవుల సాహసాన్ని నేనే వినిపిస్తాను"..లాలస నంది వైపు చూస్తూ అంది.

నంది చిరునవ్వుతో తలపంకించాడు. లాలస ప్రారంభించింది.

***

రత్నకటకం నగర వీధిలో పరుగెడుతున్న తనను చేరదీసిన క్షణం నుండీ నంది చేసిన సాహస కృత్యా లను కళ్ళకు కట్టినట్టు వర్ణించింది లాలస. రాజదంప తులూ, మహామంత్రీ, సర్వసైన్యాధ్యక్షుడూ ఆశ్చ ర్యంతో చెవులప్పగించి విన్నారు.

"సర్వసంగ పరిత్యాగి అయిన తమరు మా పుత్రికను కాపాడే ప్రయత్నంలో చేసిన సాహసాలు మమ్మల్ని ఆశ్చర్యంలో ముంచి వేస్తున్నాయి స్వామీ!" కుబేరవర్మ అన్నాడు.

"ప్రభువుల మాట అక్షరసత్యం!" మహామంత్రి అన్నాడు.

"ఒక మహావీరుడు చేయదగిన మహాసాహసం అది!" సర్వసైన్యాధ్యక్షుడు అన్నాడు.

"ఆపదలో ఉన్నవాళ్ళను ఆదుకోవడం మానవ ధర్మం అంటున్నాయి శాస్త్రాలు. సర్వసంగ పరిత్యాగి కూడా మానవుడే!" నంది అన్నాడు.

"అది తమ దార్శనికత!" కుబేరవర్మ అన్నాడు.

"ఔనంటూ!" సాగరామాత్యుడు మాట కలిపాడు.

"మహామంత్రీ, స్వయంవర సమయాన మా ఏకైక పుత్రికను అపహరించి కళింగ యువరాజు ఘోర నేరం చేశాడు. అది శిక్షార్హం. క్షమార్హం కాదు. కళింగ ప్రభువు శక్తిరత్న మహారాజు మాకు సామం తుడూ కాదు; సమఉజ్జీ కూడా కాదు. అయితే వయ సులో మాకన్నా పెద్దవాడు. మిత్రుడు. కొడుకు చేసిన ఘనకార్యాన్ని ఆయనకి మనం వివరించాలి. అప రాధి అయిన కుమారుడిని శిక్షించే బాధ్యత ఆయనకే అప్పగించాలి..."

"ప్రభువులు మన్నించాలి. కళింగరాజుగారికి ఒక్కడే పుత్రుడు. తన ఏకైక వారసుణ్ణి, భావి మహారాజును ఆయన శిక్షిస్తారా?" సాగరామాత్యుడు అన్నాడు.

"అపరాధిని శిక్షించే బాధ్యత కామరూప చక్ర వర్తి కళింగరాజుకు ఇస్తున్న ఒక గౌరవం సారంగా మాత్యా! ఆ బాధ్యతను ఆయన విస్మరిస్తే, మాకూ, మా పుత్రికకూ, మా రాజ్యానికీ తన కొడుకు మూలంగా జరిగిన అవమానాన్ని ఆయన నిర్లక్ష్యం చేస్తే మనం ఆయననూ శిక్షిస్తాం; అపరాధి అయిన ఆయన పుత్రుడినీ శిక్షిస్తాం!"

**జరిగిన అపహరణ కార్యానికి కారకుడు కళింగ యువరాజు కళింగరత్న అని తెలుసుకొని నిర్ఘాంతపోయాడు మహారాజు. ఆగ్రహావేశాలకు లోనయ్యాడు. వెంటనే మహామంత్రినీ, సర్వసైన్యాధ్యక్షుడినీ రప్పించి తదుపరి కార్యక్రమం నిర్దేశించాడు. నిజం తెలుసుకున్న కుబేరవర్మ ఎలాంటి చర్యలు తీసుకున్నాడు?**

"అంటే..." సాగరామాత్యుడు అన్నాడు.

"మీరూ, సర్వసైన్యాధ్యక్షుడూ కళింగ రాజధానికి వెళ్ళండి. శక్తిరత్న మహారాజును కలుసుకోండి. యువరాజు చేసిన దారుణ నేరాన్ని వివరించండి. శిక్షార్హుడైన అతగాడిని మనకు అప్పగిస్తాడో, ఆయనే శిక్షిస్తాడో అడగండి. అప్పగించడానికీ, శిక్షించడానికీ నిరాకరిస్తే కామరూప రాజ్యం చతురంగ బలాలతో చేసే దండయాత్రను ఎదుర్కోవడానికి సిద్ధంగా ఉండ మని హెచ్చరించి రండి!" కుబేరవర్మ గంభీరంగా అన్నాడు.

"ఆజ్ఞ" సాగరామాత్యుడు వినయంగా అన్నాడు.

"సాగరామాత్య, అమ్మాయి ఆలయంలో నుండి అంతర్ధానమైంది. మూసిన తలుపు మూసినట్టే, వేసిన గడియలు వేసినట్టే ఉన్నాయి! లాలసను ఎలా అప హరించగలరు? అది కూడా మనకు తెలియాలి..." కుబేరవర్మ అన్నాడు. "ఎక్కడో, ఏదో కుట్ర జరిగింది!"

"ఆలయంలో రహస్య మార్గాలు లేవని మన అన్వేషణ ఆనాడే తేటతెల్లం చేసింది ప్రభూ!" సర్వసై న్యాధ్యక్షుడు సమరసేనుడు అన్నాడు.

"మహారాజా...ఒక్క క్షణం!" నంది కల్పించుకుంటూ అన్నాడు.

కుబేరవర్మ, ఇతరులూ నంది వైపు వినయంగా చూశారు.

"స్వామీ..?" కుబేరవర్మ అన్నాడు.

"యువరాణి అదృశ్యమైనప్పుడు ఆలయంలోంచీ వెలుపలికి రహస్య మార్గాలున్నాయేమో అని గాలిం చారు, అంతేగా?"

"అంతే...అంటే.?" కుబేరవర్మ అన్నాడు.

"లోపల నుండీ వెలుపలికి దారి ఉందేమో అన్వేషిం చారు. వెలుపల నుండి ఆలయంలోనికి రహస్య మార్గం సొరంగం ఉందేమో అన్వేషించలేదా?" నంది ప్రశ్నించాడు.

అందరూ ఆశ్చర్యంగా చూశారు.

"వెలుపల నుండి లోపలికి మార్గం ఉన్నా అది ఆల యంలో కనిపించేదిగా స్వామీ?" మహామంత్రి అన్నాడు.

"నిర్మాణంలో ఎన్నో విచిత్రాలున్నాయి మహా మాత్యా. అవన్నీ శిల్పుల నైపుణ్యాలు. గుడి లోపల నుండి ఆ మార్గాన్ని తెరిచే అవకాశం లేకుండా నిర్మించి ఉండవచ్చుగా?" నంది చిరునవ్వుతో అన్నాడు.

"ఆ రహస్య మార్గాన్ని ఎవరు నిర్మించి ఉంటారు?" కుబేరవర్మ కనుబొమలు ముడివేస్తూ అన్నాడు.

"ఇంకెవరు? ఆలయాన్ని నిర్మించిన శిల్పులే!" నంది నవ్వాడు.

"ఎందుకు నిర్మించి ఉంటారు?" కుబేరవర్మ సాలోచనగా అన్నాడు.

"ఎందుకైనా కావచ్చు. రాజమందిరాలలో, ఆల యాలలో అలాంటి విచిత్ర నిర్మాణాలు పూర్వం సర్వ సాధారణమే!"

"ఆలయం నిర్మించి శతాబ్దాలు గడిచాయి. శిల్పులు లేరు. ప్రధాన శిల్పాచార్యుడి వంశీకులు ఎవ్వరూ లేరు. ఆ వంశీకుల పురాతన గృహం నేడు శిథిలావ స్థలో ఉంది!" సాగరామాత్యుడు అన్నాడు.

"దారి లేనిదే యువరాణిని అపహరించిన వ్యక్తులు పారిపోరు!" నంది అన్నాడు. "నగరం వెలుపలి నుండి, సమీపంలో గృహాలూ అవీ ఉంటే వాటి దగ్గరా, శిథిల గృహాలలోనూ అన్వేషించడం మంచిది."

"సాగరామాత్యా! స్వామి వారి సూచన ఆచర ణీయం. వెంటనే అన్వేషణ ప్రారంభించండి. ఎందు కైనా మంచిది. ఆలయ నిర్మాణ శిల్పి శిథిల గృహంతో అన్వేషణ ప్రారంభించండి!" కుబేరవర్మ ఆజ్ఞాపించాడు.

"ఆజ్ఞ!" సాగరామాత్యుడు లేచాడు.

సమరసేనుడు కూడా పైకి లేచాడు.

"సాగరామాత్యా.."

"ప్రభూ?"

"నగర ప్రజలందరూ యువరాణి లాలస అంత ర్థానంతో ఆవేదనకు లోనయ్యారు. ఇప్పుడు ఆమెను దర్శించి ఆనందించే అవకాశం వాళ్ళకు మనం కల్పిం చాలి. రేపు ఉదయం సందర్శన మందిరంలో అందరూ యువరాణిని చూడవచ్చు. మా పుత్రిక క్షేమంగా తిరిగి వచ్చిన విషయాన్ని నగరమంతటా చాటింపు వేయించండి!"

"ఆజ్ఞ!"



"అలాగే రేపు సందర్శనా మందిరంలో నిత్యనిర్మలా నందులవారిని సన్మానించబోతున్నాం. అందుకు తగిన ఏర్పాట్లు చేయించండి!"

"ఆజ్ఞ! ప్రభువుల నిర్ణయం సముచితం!" సాగ రామాత్యుడు అన్నాడు.

"సమరసేనా, రహస్య మార్గం కోసం అన్వేషణ నీ పర్యవేక్షణలో జరగాలి" కుబేరవర్మ అన్నాడు.

"చిత్తం... ఫలితం ప్రభువులకు వెంటనే మనవి చేస్తాను" సమరసేనుడు వినయంగా అన్నాడు.

నంది మహారాజు వైపు చిరునవ్వుతో చూశాడు. "మహారాజా! నాకు సత్కారాలూ, సన్మానాలూ దేనికి?"

"మీరు మాకు ఎంత మేలు చేశారో, మేమెంత రుణపడ్డామో మీకు తెలియదు స్వామీ! పొందిన సహాయానికి ధన్యవాదాలు చెప్పుకోవడం ధర్మం. మా ముచ్చటను కాదనకండి."

"నాన్నగారూ, నాదో చిన్న కోరిక" లాలస అంది.

"ఏమిటి తల్లీ? చిన్న కోరిక ఏమిటి, పెద్ద కోరికే కోరుకో!" కుబేరవర్మ సంతోషంగా అన్నాడు.

"మరేమో...నా...నా...వివాహం జరిగేదాకా గురు దేవులు మన అతిథిగా ఉండాలి. ఆ సమయంలో వారి ఆశీస్సులు నాకు కావాలి."

"అంతకంటేనా?" మహారాణి మహిమాదేవి అంది.

"చక్కని కోరిక కోరావు తల్లీ! మాకు పుత్రికాభిక్ష పెట్టిన స్వామివారు మా మందిరంలో అతిథిగా శాశ్వతంగా ఉండిపోవాలనీ, మనలందరినీ నిరంతరం దీవిస్తూ ఉండాలనీ కోరుతున్నాను" కుబేరవర్మ ఉత్సాహంగా అన్నాడు.

"ఈ నిత్యనిర్మలానందుడు నిరంతర సంచారి. మీ అతిథిగా ఉండిపోడు." నంది చిరునవ్వుతో అన్నాడు.

"ఇది మా రాజదంపతుల ప్రార్థన కాదు. తమరు రక్షించిన కన్నెపిల్ల కోరిక! కాదనకండి స్వామీ!" మహారాణి చేతులు జోడించింది.

"గురుదేవులు వెళ్ళిపోతే నేను వివాహమే చేసు కోను" లాలస చిరునవ్వుతో అంది.

"చూశారా... మా చిన్నదాని నిర్ణయం?" కుబేరవర్మ నవ్వుతూ అన్నాడు. "మీరు మా అతిథిగా ఉండి తీరాలి!"

"ఊ...యువరాణి శపథం... రాజదంపతుల ఆశయం కాదనగలనా? చాతుర్మాస్యం అనుకుంటాను" నంది అన్నాడు.

రాజదంపతులూ, లాలసా నవ్వారు.

***

సాగరామాత్యుడు, సమరసేనుడు ఆత్రుతగా కుబేరవర్మ ముందుకు వచ్చారు. కుబేరవర్మ ప్రశ్నార్థ కంగా చూశాడు.

"ప్రభువులకు మనవి చేయి సమరసేనా!" సాగ రామాత్యుడు అన్నాడు.

"ప్రభూ...ఆలయంలో అమ్మవారి విగ్రహం వెనుక భాగానికి చేర్చే బిలమార్గం కనుగొన్నాం.."

"నిజమా? ఎక్కడి నుండి?"

"శతాబ్దాల క్రితం ఆలయం నిర్మించిన శిల్పి వంశ స్థుల పురాతన గృహం నుండి ప్రభూ! ఆ శిథిల గృహం లోని నేలమాళిగలో సొరంగమార్గం బైటపడింది..."

"అలాగా! ఆ శిల్పి వంశస్థులు..?"

"ఎవ్వరూలేరు ప్రభూ" సాగరమాత్యుడు అన్నాడు. "సుకర్మ అనే యువకుడొక్కడే ఈ తరంలో ఆ వంశా నికి చెందినవాడు. అతను కష్టాల పాలైపోయి, నగరాన్ని వదిలి ఎప్పుడో ఎక్కడికో వెళ్ళిపోయాడని తెలిసింది.."

"ఆ సొరంగమార్గం నుండి వెళ్ళి గర్భాలయంలో విగ్రహం వెనుక బిలద్వారాన్ని కింది నుంచి తెరవ వచ్చు కానీ, పై నుండి తెరవలేం ప్రభూ! ఆ శిల్పి నిర్మాణ చాతుర్యం అది అన్నాడు మన ఆస్థాన శిల్పి." సమరసేనుడు అన్నాడు.

"మీ ఊహ నిజమైంది స్వామీ!" అన్నాడు కుబేర వర్మ నంది వైపు చూస్తూ.

"తార్కికంగా ఆలోచించాను; అంతే!" అన్నాడు నంది.

"సాగరామాత్యా, శతాబ్దాల కిందట ఆ శిల్పా చార్యుడు తన ఇంటి నేలమాళిగలోంచి రహస్య బిల మార్గాన్ని ఎందుకు నిర్మించి ఉంటారు?" కుబేరవర్మ అడిగాడు.

"అది మన ఆలోచనలకు అందని అంశం ప్రభూ..."

"దారి ఎందుకు ఏర్పాటు చేస్తారు?" నంది ముగ్గుర్నీ కలియజూస్తూ అన్నాడు. "వెళ్ళడానికీ, తిరిగి రావ డానికీ. అవునా?"

"ఔను స్వామీ... దారి అన్నది రాకపోకలకే" సాగరామాత్యుడు అన్నాడు.

"రాకపోకలు ఎందుకు జరుగుతాయి?" నంది చిరునవ్వుతో అన్నాడు. "ఏదైనా వస్తువులను చేర వేయడానికో, తీసుకువెళ్ళడానికో!"

"స్వామీ!" మహారాజు కుబేరవర్మ ఆశ్చర్యంగా అన్నాడు.

"ఔను మహారాజా! దర్శనానికి ప్రవేశ ద్వారం ఉందిగా!" నంది అన్నాడు. "రహస్యంగా నిర్మించిన మార్గం ఆనాటి పాలకుల శాసనం అయి ఉండదు. ఆలయాన్ని నిర్మింపజేసిన మీ పూర్వీకుల శాసనం అయి ఉంటే, ఆ విషయం తరం అనంతరం తరానికి పెద్దల ద్వారా తెలిసి ఉండేది. అంటే ఆ బిలమార్గం రహస్యంగా, దొంగతనంగా నిర్మించబడిందని మనం అనుకోవచ్చు. దొంగతనంగా ఏర్పాటుచేసిన దారి దొంగతనం చేయడానికే అని మనం ఎందుకు అను కోకూడదు?"

మహారాజూ, మహామంత్రీ, సర్వసైన్యాధ్యక్షుడూ నోళ్ళు వెళ్ళబెట్టి ముఖాలు చూసుకున్నారు. కుబేర వర్మ చూపుల్ని నెమ్మదిగా నంది వైపు మళ్ళించాడు.

## స్ట్రీట్ లైట్




*ఆ రోజు*
*అది తెల్లగా నవ్వడం మానేసి*
*తల్లి నుంచి*
*జాతరలో తప్పిపోయిన*
*పిల్లాడిలా*
*ఒంటరిగా*
*మొహమంతా మాడ్చుకుని*
*ఏడుస్తున్నట్టు నిల్చుంది*



*భువికి దిగిన మేకులా*
*నేలకు పూసిన తీగను అంటుకట్టినట్లు*
*వీధి మధ్య రేఖలా*
*నిలబడింది*

*ఉదయమంతా*
*నిరసనకారుడిలా*
*మౌనవ్రతాన్ని పాటించి*
*సంధ్య వార్చు సమయాన*
*వెలుగు పలుకులు వర్షించేది*

*పగలంతా భానుడు పోసిన*
*వెలుతురు తాగి*
*రాత్రి సూరీడై*
*నిలబడి*
*దారిలో కాసింత అమృతం చల్లేది*

*వెలుగు*
*హస్తాలను చాచి*
*భూమిని తనివి తీరా ముద్దాడేది*

*దారికి మలిచిన*
*శిలాప్రతిమలా*
*కొలువుదీరి*
*నవ్వులు విరబూసే నీలమణికి*

*ఇవాళ*
*గుప్పెడంత గుండెకు గాయమైంది*
*నన్ను నిశీథి వీధిలో పడేసింది*

*మనిషి దూరమైనప్పుడే*
*విలువ తెలిసొచ్చినట్లు*
*చీకట్లు ముసిరేదాకా*
*వెలుగు విలువ తెలియకపాయె*

*ఏదైనా అంతే*
*పోగొట్టుకున్నప్పుడే*
*అనుభవంలోకి వస్తుంది*

***—ఈ. రాఘవేంద్ర, సెల్: 94940 74022***

ఆ చూపులు ప్రశ్నల్ని రువ్వుతున్నాయి.

"ఆలయంలో దొంగిలించడానికి ఏముంది? అని మనం అనుకోవచ్చు. కామరూపాంబిక దేవికి చక్రవర్తులు చేయించిన స్వర్ణాభరణాలు, రత్నాభరణాలు, కిరీటం.."

"స్వామీ...మతిపోతోంది!" కుబేరవర్మ అన్నాడు.

"ఆస్థాన స్వర్ణకారుడిని ఆదేశించండి. అమ్మవారి ఆభరణాలలో ఏవైనా కృత్రిమ ఆభరణాలున్నా యేమో చూడమనండి" నంది సూచించాడు.

"సాగరామాత్యా..." కుబేరవర్మ సాభిప్రాయంగా అన్నాడు.

"ఆజ్ఞ!" అంటూ ద్వారం వైపు తిరిగాడు సాగరా మాత్యుడు. సమరసేనుడు అతణ్ణి అనుసరించాడు.

***

అతి తక్కువ వ్యవధిలోనే సాగరామాత్యుడూ, సమర సేనుడూ కుబేరవర్మ మహారాజును కలుసుకున్నారు. ఆస్థాన స్వర్ణకారుడు అభిరాముడు వాళ్ళతో ఉన్నాడు.

"ప్రభూ, ఆలయంలోనే, అతి రహస్యంగా అమ్మ వారి ఆభరణాలను పరీక్షించడం జరిగింది. ఫలి తాన్ని మన అభిరాముడు విన్నవిస్తాడు." సాగరా మాత్యుడు అన్నాడు.

ఆలయాన్ని నిర్మించిన శిల్పాచార్యుడూ, అతని పుత్రులూ జీవించి ఉన్న సమయంలోనే ఆభరణాల మార్పిడి జరిగిందనీ, అందుకోసమే ముందుచూపుతో తన ఇంటి నుండి రహస్య బిలమార్గం నిర్మించాడనీ స్పష్టమవుతోంది.." సాగరామాత్యుడు అన్నాడు.

"ఇన్ని శతాబ్దాలపాటు ఆభరణాలు నిజమైనవి కావని ఎందుకు కనిపెట్టలేకపోయారు?" కుబేరవర్మ అభిరాముడిని ప్రశ్నించాడు.

"అది వాటిని రూపొందించిన స్వర్ణకారుడి నైపుణ్యం ప్రభూ. ఆనాటి శిల్పాచార్యుడు స్వర్ణ కారుడు కూడా అని మనకు తెలుస్తోంది. ఆభరణా లను శుభ్రం చేసి, అలంకరించే అర్చకులకు పసిగట్టే పరిజ్ఞానం ఉండదు. కృత్రిమ ఆభరణాలు యదార్థ మైన ఆభరణాల కన్నా అధికంగా మెరుస్తాయి!"

"కోశాగారం నుండి అవసరమైన బంగారాన్ని తీసుకో. రాజప్రాసాదంలోని కోష్ఠంలోనే ఆభరణాలు చెయ్యి. అమ్మవారి విగ్రహాన్ని అలంకరించిన ఆభర ణాలను నూతన ఆభరణాలు పోలి ఉండాలి." కుబేర వర్మ ఆజ్ఞాపించాడు.

"ఆజ్ఞ!" అభిరాముడు అన్నాడు.




కుబేరవర్మ అభిరాముడి వైపు చూశాడు.

"ప్రభువులు చిత్తగించాలి" అభిరాముడు విన యంగా అన్నాడు. "కామరూపాంబికాదేవి కంఠహారాలూ, కంకణాలూ, నూపురాలూ నిజమైన ఆభరణాలు కావు ప్రభూ. బంగారం బంగారం కాదు; రత్నాలు రత్నాలు కావు..."

"అలాగా! మహాపచారం.." కుబేరవర్మ అన్నాడు. అతని కళ్ళు ఎరుపెక్కుతున్నాయి.

"కిరీటం బంగారందే అయినప్పటికీ, అందులో పొదిగిన రత్నాలు.. రత్నాలు కావు; రాళ్ళు.."

"కంఠహారాలూ, కంకణాలూ, నూపురాలూ, కిరీ టమూ ఇవన్నీ మా పితృపితామహులూ, ప్రపితామ హులూ అమ్మవారికి చేయించినవి" కుబేరవర్మ అన్నాడు. "కర్ణాభరణాలూ, నాసికాభరణాలూ?"

"అవి కూడా కృత్రిమమైన ఆభరణాలే ప్రభూ. అమ్మవారి వడ్డాణం ఒక్కటే స్వచ్ఛమైన యదార్థమైన ఆభ రణం. అందులోని స్వర్ణం స్వర్ణమే; రత్నాలు రత్నాలే."

"ఆ వడ్డాణం మేము మా వివాహ సందర్భంలో దేవికి సమర్పించుకున్నదే!" కుబేరవర్మ అన్నాడు.

"చౌర్యం చేయబడిన నగలను బట్టీ ఆలోచిస్తే,

"ఒక సందేహం..." కుబేరవర్మ ముగ్గురినీ కలియ జూస్తూ అన్నాడు. "నగలన్నింటినీ నాసిరకం నగ లతో మార్పిడి చేసిన చోరుడు కిరీటాన్ని ఎందుకు వదిలివేశాడు?"

సాగరామాత్యుడు మౌనంగా అభిరాముడి వైపు చూశాడు.

"ఆ చోరుడు ఎవరో, శిల్పి వంశంలో ఏ తరం వాడో, అతగాడికి కిరీటాన్ని రూపొందించే నిపుణత లేకపోయి ఉండవచ్చు ప్రభూ. కిరీటం అతి క్లిష్టమైన, చిత్ర విచిత్రమైన లతలతో, పుష్పాలతో చెక్కబడి ఉంది. దానిని పోలిన కిరీటాన్ని రూపొందించే నేర్పరి తనం లేని కారణంగా అందులో పొదిగిన రత్నాలతో తృప్తిపడ్డాడని మనం అనుకోవాలి."

"ఊ...అలాగే అనిపిస్తోంది. కిరీటం ఆలస్యం లేకుండా యదార్థ నవరత్నాలతో అలంకరించబడాలి!" కుబేరవర్మ అన్నాడు.

"చిత్తం. రెండురోజులు శుద్ధి పేరుతో ఆలయ దర్శనం ఆపితే, ఆ పని పూర్తి చేయగలను ప్రభూ.." అభిరాముడు అన్నాడు.

"సాగరామాత్యా...ఈ కార్యాలన్నీ మీ పర్యవేక్ష ణలో జరగాలి."

"చిత్తం ప్రభూ!"

"దొంగదారి అయిన ఆ కపట మార్గాన్ని పటి ష్ఠంగా, పూర్తిగా మూసివేయాలి!" కుబేరవర్మ అన్నాడు.

"ఆ కార్యక్రమం ప్రారంభమైంది ప్రభూ" సమర సేనుడు అన్నాడు. "అమ్మవారి విగ్రహం క్రింద ఉన్న చిన్న నేలమాళిగ నుండి బిలమార్గం పూడ్చివేత ప్రారంభమైంది. చీమ కూడా దూరలేనంత పటి ష్ఠంగా పూడ్చి వేయిస్తున్నాం ప్రభూ."

"మంచిది..." కుబేరవర్మ సాలోచనగా అంటూ మహామంత్రి వైపు చూశాడు. "సాగరామాత్యా, దశా బ్దాలుగా పరిపాలన సాగిస్తున్నాం. మీరు మంత్రా లోచన చేస్తూనే ఉన్నారు. ఆలయంలో నుండి ఏదో రహస్య మార్గం ఉండి ఉండవచ్చునీ, అది శిల్పాచా ర్యుడి కుతంత్రం కావొచ్చునీ, అమ్మవారి ఆభరణాల చోరీకి ఆ రహస్య మార్గం నిర్మించి ఉండవచ్చునీ తార్కికంగా ఊహించలేకపోయాం. నిత్యనిర్మలానందులు అలవోకగా ఆలోచించి, అనుమానం వ్యక్తం చేశారు."

"చిత్తం! మనది కేవలం లౌకిక జ్ఞానం. వారిది పారలౌకిక జ్ఞానం. మనది సాధారణ దృష్టి. యోగి గారిది యోగ దృష్టి! మనది జ్ఞానం. ఆయనది విజ్ఞానం!" మహామంత్రి వినయంగా అన్నాడు.

"ఆయనకి మనం రుణపడ్డాం. రేపు ఆయన సన్మాన కార్యక్రమం పూర్తికాగానే మీరు కళింగరాజు వద్దకు రాయబారం వెళ్ళాలి. మా అనుంగు పుత్రి కను అపహరించిన దుస్సాహసికి శిక్షపడి తీరాలి!"

"అలాగే ప్రభూ!" సాగరామాత్యుడు విన యంగా తల వాల్చాడు.

***

"నందీ!" అంతఃపురానికి దూరంగా, రాజుగారి ఏకాంత మందిరానికి దగ్గరగా ఉన్న అతిథి మంది రంలో కూర్చున్న నంది వైపు నడుస్తూ అంది లాలస.

"గురుదేవా!" అన్నాడు నంది ఆమెను హెచ్చరిస్తూ.

లాలస నాలుక కొరుక్కుంది. నంది దగ్గరగా నిలుచుని, చిరునవ్వుతో చూసింది. "ఇక్కడ తమకు అన్ని సదుపాయాలూ ఉన్నాయా గురుదేవా?"

"సర్వసంగ పరిత్యాగులం. మాకు కనీస సదు పాయాలు చాలు కల్యాణీ!" నంది నవ్వుతూ అన్నాడు. "నువ్వు ఇలా రావడం..."

"నాకు రాజదంపతుల అనుమతి ఉంది. గురు దేవులను ఎప్పుడైనా దర్శించుకోవచ్చు. అన్నట్టు దీపాం కురను చూశాను. చక్కని చుక్క!"

నంది ముఖం విప్పారింది. 'చెల్లాయి ఎలా ఉంది?"

"ఆరోగ్యంగా ఉంది. ఆనందంగా లేదు" లాలస అంది. "చూస్తావా?"

నంది తల నెమ్మదిగా అడ్డంగా ఊగింది. "వద్దు. బైటపడితే ప్రమాదం. నేను నేనని తనకి తెలీకపో వచ్చు. తనెవరో నాకు తెలుసు. ఉద్వేగం నన్ను బైట పడవేయవచ్చు.."

లాలస విచారంగా చూసింది.

"మాది ఆత్మీయబంధం. దీపాంకుర పోల్చు కున్నా పోల్చుకోవచ్చు."

"నిర్ణయం గొప్పది" లాలస మెచ్చుకుంటూ అంది. "నీ లక్ష్య సాధన ఎప్పుడు ప్రారంభిస్తావు?"

"రేపే!"

**(ఇంకా వుంది)**

# సురభి

## శిలలుగా మార్చే సరస్సు

మంచినీటి సరస్సులు, ఉప్పునీటి సరస్సులు, వేడిబుగ్గలు.. ఇలా ఎన్నింటిగురించో మనం విని వుంటాం. కానీ శిలలుగా మార్చే సరస్సు గురించి ఎప్పుడైనా విన్నారా! అలాంటి సరస్సును చూసే ఉద్దేశం ఉందా? అయితే ముందు దాని గురించి తెలుసుకుని అప్పుడు వెళ్ళండి.

టాంజానియాలోని నాట్రాన్ సరస్సు పెద్ద లోతైనదేమీ కాదు. చూడగానే ఆహ్లాదకరంగా, ప్రశాంతంగా కనిపించే ఈ సరస్సులో నీటి ఉష్ణోగ్రత 120 డిగ్రీల ఫారెన్‌హీట్ ఉంటుంది. ఎక్కువ మొత్తంలో సోడియం కార్బొనేట్ ఉంటుంది. ఆహారం కోసం ఈ సరస్సు లోకి దిగిన పక్షులు, జంతువులు చనిపోయి, వాటిచుట్టూ సోడియం కార్బొనేట్ పేరుకుపోయి శిలలుగా కనిపిస్తాయి. నిక బ్రాండిట్ అనే ఓ ఫొటోగ్రాఫర్ విషయం తెలుసుకొని, శిలా రూపాల్లో ఉన్న జంతువులు, పక్షుల ఫొటోలు తీసి పత్రికలకు పంపించాడట.



## చెత్తతో కళారూపాలు

మొక్కలు పెంచండి, పర్యావరణాన్ని కాపాడండి అంటూ పర్యావరణ హితులు గగ్గోలు పెడుతున్నారు. కాలుష్యం తగ్గించటానికి, వనరులను కాపాడుకోవడా నికి ఎన్నో ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఆర్థర్ బోర్డలోజ్ కూడా పర్యావరణాన్ని కాపాడేందుకు తనవంతు ప్రయత్నం చేస్తున్నాడు.

పనికిరాని వస్తువులతో కళారూపాలు తయారుచేస్తున్నాడీ పోర్చు గీసు ఆర్టిస్ట్ ఆర్థర్. కళారూపాలనగానే ఏవో బొమ్మలు, శిల్పాలని ఊహించేసుకో కండి. ఈయనగారి కళాఖండాల వెనుక ఓ మెసేజ్ కూడా దాగి ఉంటుంది. కేవలం అంతరించిపోయే దశలో ఉన్న పక్షులు, జంతువుల ఆకారాలు మాత్రమే ఆర్థర్ చేతుల్లో కళారూపాలుగా, స్టాట్యూలుగా మారుతున్నాయి. ముద్దుగా, చూడగానే కళ్ళను తమవైపు తిప్పుకొనేట్టుగా ఉండే ఈ ఆకారాలు వాటి నిజమైన ఆకారాలకు మూడింతలు ఉంటాయి. ఇంతకీ ఇవన్నీ వేటితో తయారుచే శాడో ఎందుకోసం చేశాడో తెలుసు కుంటే మాత్రం ఆశ్చర్యం కలుగు తుంది. ఆ పక్షులు, జంతువులు అంతరించిపోవడానికి ఏవయితే కారణమవుతున్నాయో, ఆ స్క్రాప్ మెటీరియల్‌ను ఉపయోగించే ఈ ఆకారాలు తయారుచేస్తు న్నాడు ఆర్థర్. పర్యావర ణాన్ని కాపాడాలంటూ ఓ చక్కని మెసేజ్ వాటికి జోడిస్తున్నాడు.



## రికార్డు కొట్టేసింది

గిన్నిస్‌బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్.. చాలామంది తమ పేర్లు ఆ పుస్తకంలో చూసుకోవాలని తహ తహలాడుతుంటారు. అందుకు రకరకాల ప్రయ త్నాలు చేస్తుంటారు. అలాంటి ప్రయత్నమే చేసింది చైనా మహిళ టాంగ్ హూ. ఇంతకీ ఏం చేసిందనుకుంటున్నారా? వెలుగుతూ, వేడిగా ఉన్న బల్బులపై అలా అలా అవలీలగా నడిచి వెళ్ళి తనదైన ఒక రికార్డు సృష్టించింది. 14.25 సెకన్లలో నలభై బల్బులపైనుండి నడిచింది. చిత్రమేంటంటే ఆమె నడిచినప్పుడు ఇందులో ఒక్క బల్బు కూడా పగిలి పోలేదు. అలా గిన్నిస్‌బుక్‌లో స్థానం సంపాదించింది.



## ట్రీ ఆఫ్ లైఫ్

ఎడారి ప్రాంతాల్లో చుక్కనీరు కావాలన్నా ఒయాసిస్సుల వెంట పరు గులు తీయాల్సిందే. ఇక మొక్కల సంగతి సరే సరి. ఎడారి వాతావరణం తట్టుకునే మొక్కలు మాత్రమే అక్కడ పెరుగుతాయి. కానీ బహ్రెయిన్ దేశంలో మాత్రం ఓ జమ్మిచెట్టు 400 సంవత్సరాలుగా ఎండిపో కుండా అందరినీ ఆశ్చర్యపరుస్తోంది.

బహ్రెయిన్‌లోని అస్కర్ – జా అనే ప్రదేశాల మధ్య 32 అడుగులు ఎత్తైన ఈ జమ్మిచెట్టు పచ్చదనంతో కళకళలాడుతూ పర్యాటకుల దృష్టిని ఆకర్షిస్తోంది. దీన్ని స్థాని కులు ట్రీ ఆఫ్ లైఫ్'గా పిలుస్తారు. ఈ చెట్టు చుట్టుపక్కల కొన్ని మైళ్ళ దూరం వరకు భూగర్భంలో ఎక్కడా నీరుగానీ, చెట్టు బ్రతక డానికి అనువైన పరిస్థితులు గానీ లేవు. అందువలనే ఈ వృక్షాన్ని స్థానికులు మార్మిక మైన శమీవృక్షంగా, పురాణేతిహాస వృక్షంగా అభివర్ణిస్తున్నారు. 1583లో నాటిన ఈ జమ్మి మొక్క అప్పటినుంచి ఎండిపోకుండా, పచ్చ దనంతో కొనసాగుతోందని చెబుతున్నారు. దీన్ని చూడటానికి వచ్చే పర్యాటకుల సంఖ్య కూడా తక్కువేమీ కాదు. సంవత్సరానికి యాభైవేలమంది సందర్శకులు ఈ వృక్షాన్ని దర్శించి వెళతారట.



## అంతా గాజుమయం

అరుదైన, అపురూపమైన వస్తు వుల్ని గాజు బాక్సుల్లో పెట్టి ఉంచుతారు. మ్యూజియంలో కూడా పురాతన వస్తువుల్ని ఎవరూ తాకకుండా గాజు బాక్సుల్లోనే పటి ష్టంగా భద్రపరుస్తారు. కానీ అమెరికాలోని ఆ మ్యూజియంలో భద్రపరిచిన వస్తువులు కూడా గాజువే!

అమెరికా, న్యూయార్క్‌లోని కార్నింగ్‌లో పూర్తిగా గాజు థీమ్‌తో ఉన్న మ్యూజియం ఉంది. పేరు 'కార్నింగ్ మ్యూజియం ఆఫ్ గ్లాస్'. వేల ఏళ్ళనాటి గాజు కళాఖండాలతోపాటు గాజుతో చేసిన అలంకరణ సామగ్రి కూడా కనిపి స్తుంది. 1951లో థామస్. ఎస్. బుచ్నెర్ ఈ మ్యూజియం ఏర్పాటు చేశారు. ఇందులో గాజు వస్తువులతో కూడిన గాజు మార్కెట్, గాజు చరిత్రను వివ రించే లక్షలాది పుస్తకాలున్న గాజు గ్రంథాలయం కూడా ఉంది. ఇంకా గ్లాస్ మేకింగ్, హాట్ గ్లాస్ షో వంటి ఇతర విభాగాలూ ఉన్నాయి. వీటిల్లో గాజు తయారీ విధానాన్ని కూడా సందర్శ కులకు చూపిస్తారు.



–నర్మద వాసిరెడ్డి



బుద్ధిమంతుల్లా చేతులు కట్టుకుని కూర్చుని, ఆమె చెప్పినదానికల్లా తలలూపారు. చివరికి ఆ శిబిరం కూడా ఓ భజన శిబిరంగా ముగిసింది.

### ఆత్మపరిశీలన ఏదీ?

గత ఏడాది శాసనసభ ఎన్నికలు జరిగినప్పుడు కూడా ఇలాగే ఓ ఆత్మపరిశీలన శిబిరం నిర్వహించారు. నాయకులంతా ఆత్మపరిశీలన చేసుకోవాలని సోనియా గాంధీ పిలుపునిచ్చారు. పార్టీ సీనియర్ నాయకుడు దిగ్విజయ్ సింగ్ మాత్రం, పార్టీకి ఓ పెద్ద శస్త్రచికిత్స అవసరమని సూచించారు. చివరికి ఆత్మ పరిశీలనా జరగలేదు, శస్త్రచికిత్సా జరగలేదు. ప్రాథమిక చికిత్స కూడా జరగకుండానే ఏడాది కాలం గడిచిపోయింది. గత వారం జరిగిన శాసనసభ ఎన్నికల్లో కాంగ్రెస్ నాలుగు రాష్ట్రాల్లో ఘోరంగా ఓడిపోవడంతో మళ్లీ దిగ్విజయ్ సింగ్ వంటి సీనియర్ నాయకులు గొంతు విప్పారు. "ఆత్మపరిశీలన సమయం కూడా మించిపోయింది. ఇప్పుడిక కావాల్సింది కార్యాచరణే" అని వారంతా ఘోష పెట్టారు. దిగ్విజయ్ సింగ్ అయితే "కొత్త నాయకత్వం" గురించి కూడా ప్రస్తావించారు. సోనియా సన్ని

# సమూల మార్పులు అవసరం

**కాంగ్రెస్ పరిస్థితి నానాటికీ తీసికట్టుగా తయారవుతోంది. సోనియా, రాహుల్‌లకు అతీతంగా పార్టీని అభివృద్ధి చేయాల్సి ఉంది.**

దేశంలో ప్రజాస్వామ్యం ఆరోగ్యంగా, పటిష్ఠంగా ఉండాలంటే రెండు ప్రధాన రాజకీయ పార్టీలు ఉండక తప్పదు. ఇది ప్రజలకు కూడా మంచిది. అంటే దేశ ప్రజలకు బీజేపీ కాకుండా మరో పటిష్ఠమైన పార్టీ ఉండాల్సిన అవసరం ఉంది. ప్రజలు తమ అవసరాల కోసం మరో పార్టీ మీద కూడా ఆధారపడడం అన్ని విధాలా మంచిది. ప్రజాస్వామ్యంలో పోటీ తత్త్వం ఉండాలి. ఇటీవల శాసనసభ ఎన్నికల్లో గణనీయమైన విజయం సాధించిన నరేంద్ర మోదీ దేశాన్ని పాలించలేరని కాదు. ఓ ఆరోగ్యవంతమైన, శక్తిమంతమైన ప్రతిపక్షం కూడా ఉంటే అది దేశ ప్రజాస్వామ్యంతో పాటు అధికార పక్షానికి కూడా మంచిదని చెప్పడమే ఇక్కడ ఉద్దేశం. ప్రపంచంలో ఏ దేశంలోనైనా ఇదే విధానం ఉంది. బ్రిటన్, అమెరికాల్లో ప్రజాస్వామ్యం అర్థవంతంగా పనిచేస్తోందంటే అందుకు ప్రధాన కారణం సరైన రెండు పార్టీల వ్యవస్థ కొనసాగుతూ ఉండడమే.

వామపక్షాలు సరైన ప్రతిపక్షంగా ఎదగలేకపోతున్నాయి. అవి ఇప్పుడే కాదు, భవిష్యత్తులో కూడా బీజేపీకి సరైన ప్రత్యామ్నాయంగా ఎదిగే సూచనలు కనిపించడం లేదు. దేశ ప్రజలు వామపక్ష సిద్ధాంతాలను పూర్తి స్థాయిలో, ముఖ్యంగా అధికారం అప్పగించగలిగిన స్థాయిలో ఆదరించడం లేదు. ఇక ఆమ్ ఆద్మీ పార్టీ విషయానికి వస్తే, జాతీయ పార్టీలకు ఇది ఓ ప్రత్యామ్నాయంగా ఎదిగే పరిస్థితి కనిపించడం లేదు. నిజానికి, బీజేపీకి ప్రత్యామ్నాయంగా కాంగ్రెస్ పార్టీ ఎదగాల్సింది కానీ, ఆ పార్టీ ఒక కుటుంబ సంస్థగా మారడం వల్ల ప్రత్యామ్నాయానికి దూరమైపోతోంది. పార్టీ ఉపాధ్యక్షుడు రాహుల్ గాంధీ అప్పుడప్పుడూ తప్ప ఈ పార్టీకి ఓ సీనియర్ నాయకుడుగా వ్యవహరించలేకపోతున్నారు. పార్టీ తీరుతెన్నులు భస్మాసుర హస్తాన్ని తలపిస్తున్నాయి. పార్టీ అంతరించిపోదలచుకుంటే దాని ఇష్టం. కానీ, అది ఓ బలమైన ప్రత్యామ్నాయంగా ఎదగాలనుకుంటే మాత్రం ప్రస్తుత దుస్థితి నుంచి బయటపడేందుకు ప్రయత్నించాలి.

ముందుగా కాంగ్రెస్ పార్టీ అగ్రనాయకత్వం ఆత్మపరిశీలన చేసుకోవాలి. విజయాలు సాధించడంలోనే కాక, ప్రజలకు చేరువ కావడంలో, అధికార పక్షానికి సరైన పోటీ కావడంలో తాము ఎందుకు వెనుకబడి ఉన్నాం, ఇందుకు పరిష్కారం ఏమిటి అన్నదానిపై దృష్టి కేంద్రీకరించాలి. అనేక సందర్భాల్లో పార్టీ ఆత్మ పరిశీలన జరిపింది కానీ, వాటి వల్ల ఉపయోగం కనిపించలేదు. 2013 జనవరిలో జైపూర్‌లో 'చింతన శిబిర్' పేరుతో ఓ ఆత్మపరిశీలన శిబిరం నిర్వహించింది. ఇది ఓ తరగతి గదిలా కనిపించింది తప్ప ఎక్కడా ఆత్మపరిశీలనా శిబిరంగా కనిపించలేదు. పార్టీ అధ్యక్షురాలు సోనియా గాంధీ ఓ టీచర్‌గానూ, పార్టీ నాయకులంతా విద్యార్థులుగానూ వ్యవహరించారు. ఏది చేయాలో, ఏది చేయకూడదో సోనియా వివరించారు. నాయకులంతా

హితుడు సత్యవ్రత చతుర్వేది సైతం పార్టీకి ఇప్పుడు హృద్రోగ చికిత్స చేయాల్సి ఉందని వ్యాఖ్యానించారు. పార్టీలో ప్రతి నాయకుడిలోనూ అసంతృప్తి ఉంది. పార్టీలో సంస్థాగత, వ్యవస్థాగత మార్పులు అవసరమని ప్రతి సీనియర్ నాయకుడూ అంటున్న




మాటే. కానీ పిల్లి మెడలో గంట కట్టేదెవరు అన్నట్టుగా ఉంది పరిస్థితి.

ప్రస్తుతం కాంగ్రెస్ పార్టీ ఉనికికీ, అస్తిత్వానికే ప్రమాదం ఏర్పడింది. అసలు పార్టీ పునాదుల మీదే అందరికీ సందేహాలు ఏర్పడుతున్నాయి. ఈ పార్టీ ఇక కొనసాగాల్సిన అవసరముందా, దీనివల్ల ఎవరికైనా ప్రయోజనం ఉందా, ఈ పార్టీ మరి కొంత కాలం కొనసాగే అవకాశం ఉందా వంటి ప్రశ్నలు కూడా తలెత్తుతున్నాయి. దీన్ని ఓ తీవ్ర విషయంగానే పార్టీ పరిగణించాల్సి ఉంటుంది. పార్టీలోని లోపాలు, లొసుగులతో పాటు, అసలు పార్టీ ఎక్కడ తప్పటడుగు వేస్తోంది, దీన్ని ఏ విధంగా సరిదిద్దుకోవాలి వంటి విషయాలపై నిర్దిష్టంగా, నిర్మొహమాటంగా, నిర్భయంగా ఆత్మపరిశీలన చేసుకోవాల్సిన

అవసరం ఉంది. అన్నిటికన్నా ముందుగా పార్టీకి రాహుల్ సారథ్యం వహించాలా అన్నదానిపై సోనియా గాంధీతో సహా పార్టీ అగ్ర నాయకులంతా ఓ గట్టి నిర్ణయం తీసుకోవాలి. ఏవిధంగా చూసినా, ఆయన వల్ల పార్టీకి దెబ్బే తప్ప ఉపయోగం లేదని తేలి పోయింది. ఆయన మాటలు, చేతలే కాక, ట్వీట్లు కూడా పార్టీని వినాశనం వైపు నడిపిస్తున్నాయి. రాహుల్ డ్రైవర్ సీట్లో కూర్చోదలచుకుంటే కాళ్ల బ్రేకుల మీద పెట్టడం కూడా నేర్చుకోవాలి.

## దురహంకారానికి పగ్గాలు

ఇది 1982 నాటి మాట. అప్పట్లో ఆంధ్రప్రదేశ్‌కు ముఖ్యమంత్రిగా ఉన్న టి.అంజయ్యను రాజీవ్ గాంధీ హైదరాబాద్ విమానాశ్రయంలో 'బఫూన్' అని పిలిచారు. ఆ తరువాత ఇందిరా గాంధీ ఆయనను పదవి నుంచి తొలగించారు. పర్యవసానంగా ఆంధ్రప్రదేశ్‌లో కాంగ్రెస్ ఓడిపోయి, తెలుగుదేశం పార్టీ అధికారంలోకి వచ్చింది. 1990లో రాజీవ్ గాంధీ కర్ణాటక ముఖ్యమంత్రి వీరేంద్ర పాటిల్‌ను అమర్యాదగా పదవి నుంచి తొలగించారు. ఆ తరువాతి ఎన్నికల్లో జనతాదళ్ చేతుల్లో కాంగ్రెస్ ఘోరంగా ఓడిపోయింది. ఇక 2008లో రాహుల్ బహిరంగంగా కాంగ్రెస్ కర్ణాటక రాష్ట్ర నాయకుడు మల్లికార్జున ఖార్గేను చులకన చేసి మాట్లాడారు. ఇక, ఇటీవలి శాసనసభ ఎన్నికలకు ముందు పంజాబ్‌లో పార్టీ ముఖ్యమంత్రి అభ్యర్థిగా కెప్టెన్ అమరీందర్ సింగ్‌కు ఉద్వాసన చెబుదామనుకున్నారు. ఆయన నిజంగా ఆ పని చేసి ఉంటే, కాంగ్రెస్ పంజాబ్‌లో కూడా ఓడిపోయి ఉండేది. ప్రధానిగా ఉండగా మన్మోహన్ సింగ్‌ను రాహుల్ గాంధీ బహిరంగంగా అవమానించారు. ఆర్డినెన్స్ చించేసిన విషయం గుర్తుండే ఉంటుంది. ఇంకా పలువురు నాయకులను బహిరంగంగా అవమానించిన చరిత్ర కాంగ్రెస్ అగ్రనాయకులది. ఈ ధోరణికి ఇకనైనా ఫుల్‌స్టాప్ పెట్టాలి.

> **కాంగ్రెస్ పార్టీ పరిస్థితి రోజురోజుకూ దిగజారుతోంది. ఆ పార్టీ ఉనికి, అస్తిత్వాలకు ప్రమాదం ఏర్పడింది. ప్రజాస్వామ్యంలో ఒక ప్రత్యామ్నాయ, బలమైన రాజకీయ శక్తిగా ఎదగలేక పోతోంది. సంస్థాగత, వ్యవస్థాగత మార్పులు అవసరమని ఆ పార్టీలో అందరూ కోరుకుంటున్నారు. కానీ పిల్లి మెడలో గంట కట్టేదెవరు? మరి ఆ పార్టీ ఏం చెయ్యాలి?**

మిగిలిన పార్టీలతో పోలిస్తే కాంగ్రెస్‌లో నేరస్థులు, అవినీతిపరుల సంఖ్య కాస్తంత ఎక్కువే. బీజేపీతో సహా అన్ని పార్టీల్లోనూ నేరస్థుల సంఖ్య తక్కువేమీ కానప్పటికీ, కాంగ్రెస్‌లో మాత్రం వారి సంఖ్య అధికంగానే ఉంది. అంతేకాదు, పార్టీలో చేరితే త్వరగా సంపద కూడగట్టుకోవచ్చనీ, అధికారం చెలాయించవచ్చనీ భావించేవారి సంఖ్య కూడా ఎక్కువే. ఇటువంటి వారిని పార్టీలోంచి ఏరిపారేయడం ముఖ్యం. తామొక విభిన్న పార్టీ అని ఇప్పటికైనా నిరూపించుకోవాల్సి ఉంది. లౌకికవాదం విషయంలో కాంగ్రెస్ ప్రదర్శించే వైఖరిని చూసినవారికి కాస్తంత ఆశ్చర్యం కలగక మానదు. లౌకికవాదం పట్ల కాంగ్రెస్ ధోరణి కారణంగానే ఆ పార్టీ పట్ల కొందరు నాయకుల్లో విముఖత ఏర్పడుతోందనే సంగతి కూడా వాస్తవం. లౌకికవాదాన్ని ఓ చెడ్డ మాటగా మార్చేసిన పార్టీ కాంగ్రెస్ పార్టీ. లౌకిక వాదమంటే అల్పసంఖ్యాక వర్గాలను బుజ్జగించడం కాదనే సంగతి కాంగ్రెస్ మరచిపోవాలి. అన్ని మతాలను సమానంగా చూడడం లౌకికవాదమని కాంగ్రెస్ ఇప్పటికైనా గ్రహించాలి.

## ఇదేనా లౌకికవాదమంటే!

బీజేపీలో ముస్లిం వ్యతిరేకత ఉందని చాలా మంది భావిస్తుంటారు. అయినప్పటికీ, ఉత్తరప్రదేశ్ ఎన్నికల్లో బీజేపీకి ముస్లింలు ఎందుకు ఓటు వేశారు. కాంగ్రెస్ ఈ ప్రశ్న వేసుకోవాలి. భారతదేశ ఎన్నికల్లో కులం కూడా గణనీయమైన పాత్ర పోషిస్తుందనే సంగతి అందరికీ తెలిసిన విషయమే. అయినప్పటికీ కేవలం కుల, మత ప్రాతిపదికనే ఎన్నికల్లో పాల్గొనడం వల్ల ఉపయోగం లేదని కాంగ్రెస్ ఇప్పటికైనా గ్రహించాలి. గత శాసనసభ ఎన్నికల్లో మోదీ విషయంలో కూడా ఇదే రుజువైంది. సాధారణ ప్రజానీకపు అభిప్రాయమేమిటంటే, అవినీతిని కాంగ్రెస్ వ్యవస్థాగతం చేసింది. సమాజాన్ని కుల, మత ప్రాతిపదికన విభజించింది కూడా ఈ పార్టీయే. తమ ఘన చరిత్ర చెప్పుకుని జనాల మనసులను ఆకట్టుకోగలమనుకుంటే పొరపాటే. ఆ రోజులు పోయాయి. తమది జాతీయ పార్టీ అని, స్వాతంత్ర్యోద్యమం కోసం పోరాడింది తామేనని ఇంకా గొప్పలు చెప్పుకోవడం వల్ల ఉపయోగం లేదు. తమ పార్టీ త్యాగాలు చేసిన పార్టీ అని చెప్పుకోవడం వల్ల కూడా ఉపయోగం లేదు. స్వాతంత్ర్యం తరువాత పార్టీ అనేక పర్యాయాలు చీలింది. రాను రానూ జాతీయ పార్టీ అనే స్థాయి కూడా మటుమాయం అయిపోతోంది.

అంతర్గత ప్రజాస్వామ్యం విషయంలో పార్టీకి ఉన్న రికార్డు దయనీయంగా ఉంది. సంస్థాగత ఎన్నికలను నిర్వహించే విషయంలో ఆ పార్టీ ఇటీవల ఎన్నికల కమిషనతో వాగ్వాదానికి కూడా దిగింది. నిజాయతీగా సంస్థాగత ఎన్నికలను నిర్వహించడం ద్వారా కాంగ్రెస్ తమ పార్టీ కేవలం సోనియా, రాహుల్‌ల ఇష్టానిష్టాలు, వారి రుచులు అభిరుచులకు తగ్గట్టుగా మాత్రమే వ్యవహరిస్తున్నామన్న అభిప్రాయం తొలగిపోతుంది. ద్వితీయ శ్రేణి నాయకత్వం అభివృద్ధి చెందుతుంది. ఆనువంశిక, వారసత్వ రాజకీయాల నుంచి బయటపడినట్లవుతుంది. కేవలం రాహుల్, సోనియా, ప్రియాంకలతో పార్టీ కలకాలం వర్ధిల్లే అవకాశం లేదు. పార్టీలో అన్ని స్థాయిల్లోనూ నాయకత్వం పెరగాలి. భిన్నాభిప్రాయాలు వ్యక్తం కావాలి. కొత్త ఆలోచనలు బయటకు రావాలి. పార్టీ వేదికలపై అనేక అంశాలపై చర్చ జరగడానికి అవకాశమివ్వాలి. ప్రస్తుతం పార్టీలో మోదీ గురించి తప్ప మరే విషయంపైనా చర్చ జరగడం లేదు. పార్టీ తన కోసం లక్ష్యాలను నిర్దేశించుకోవాలి. పార్టీ భవిష్యత్తుకు సంబంధించి కూలంకషంగా చర్చించి ఓ నివేదికను రూపొందించుకుని, దానికి కట్టుబడాలి. పార్టీ కోసమే కాదు, దేశం కోసం కూడా ఓ ఆర్థిక, సామాజిక, రాజకీయ అజెండాను రూపొందించాలి. మోదీ మీద దాడులు చేస్తూ కూర్చోవడం వల్ల పార్టీకి ఉపయోగం లేదు.





# జీవితమే ఒక ప్రతిఘటన

## (కోట శ్రీనివాసరావు కథాకథనం) 25

**బృందావనం సినిమా క్లైమాక్స్ షూటింగ్ నాటికి నాకు కంటినొప్పి, కొడుకు పోయాడనే మనోవ్యథ పట్టిపీడిస్తున్నాయి. ఇవన్నీ యూనిట్ వారికి తెలుసు. వారు నాకు గట్టిగా ఏమీ చెప్పలేకపోయారు. దాంతో నేనే గమనించి ఆ సీన్లు పండించేందుకు నన్ను నేను ప్రూవ్ చేసుకోవాలనుకున్నాను. అలా క్లైమాక్స్ అద్భుతంగా వచ్చింది.**

# తెలుగు వాడి దమ్ము చూపిస్తానని చెప్పా

సినిమా విడుదలై చాలా పెద్ద హిట్ అయింది. విజయోత్సవ సభను ఏర్పాటు చేశారు దిల్‌రాజు గారు. ఆ సభలో తారక్ మాట్లాడుతూ "ఈ పాత్ర కోటగారుతప్ప ఇంకెవరూ చేయలేరు' అన్నారు. ప్రకాశ్‌రాజ్ స్టేజీమీదకు వచ్చి 'కోట శ్రీనివాసరావు గారు నాకు ఇష్టమైన నటుడు. ఆయన నటన గురించి ఎంతని చెప్పాలి' అన్నారు. అంతకు ముందు కూడా ఏదో ఇంటర్వ్యూలోనూ అదే మాట చెప్పాడని ఎవరో అన్నారు.

### అతడి సంస్కారాన్ని ఏమని వర్ణించాలి?

ప్రకాశ్‌రాజ్‌ను తలచుకోగానే నాకు 'కెమెరా మేన్ గంగతో రాంబాబు' సినిమా గుర్తుకొస్తుంది. ఆ చిత్రం క్లైమాక్స్‌లో ఓ డైలాగ్ ఉంటుంది. పూరి జగన్నాథ్ డైరెక్షన్‌లో పవన్‌కల్యాణ్, తమన్నా జంటగా నటించిన సినిమా అది. క్లైమాక్స్ సీన్ పూరి గారు రెండు, మూడు భాగాలుగా తీద్దామనుకున్నారట. అది నాకు తెలియదు. నాకు ఇచ్చిన పార్టును నేను పెర్ఫార్మ్ చేసేశాను. అంతా ఆశ్చర్యపోయి షాట్ ఓకే చేసేశారు. 'అదేంటి గురువుగారూ.. నేను మూడు టేకుల్లో తీద్దామనుకుంటే, ఒకే టేక్‌లో లాగించేశారు.. మీలాంటి గొప్ప నటులతో పనిచేస్తే స్ఫూర్తిమంతంగా, ఉత్తేజకరంగా ఉంటుందండీ. చాలా సంతోషంగా ఉంది' అన్నారు పూరిగారు. అప్పుడు అక్కడే ఉన్న ప్రకాశ్‌రాజ్ నాకు ఎదురుగా వచ్చి నిలబడి రెండు చేతులెత్తి నమస్కరించి 'అన్నా.. నువ్వు నువ్వే.. నువ్వే.. ఇక అంతే' అన్నారు.

ఒక నటుడు... అందులోనూ ప్రకాశ్‌రాజ్‌లాంటి మంచి నటుడు నన్ను అలా అనడం నాకు కొంచెం గర్వంగా అనిపించింది. తోటి నటుడికి నమస్కారం పెట్టి వెళ్లాడంటే ప్రకాశ్‌రాజ్ సంస్కారాన్ని గురించి నేను అంతకన్నా గొప్పగా ఏమని వర్ణించాలి? ఎలా చెప్పాలి? తోటి నటుడిగా అతనంటే నాకు చాలా గౌరవం.

### ఆ మాట తప్పు

ప్రకాశ్‌రాజ్‌కీ నాకూ పడదని చాలా మంది అంటారు. "ప్రకాశ్‌రాజ్ వచ్చిన తర్వాత కోట శ్రీనివాసరావుకు వేషాలు తగ్గాయని కుళ్లు పడుతున్నాడు' అనుకున్నవాళ్లు కూడా ఉన్నారు. అయితే అది పొరపాటండీ.. ఎవరి వేషాలు ఎవరికి వస్తాయండీ? తినే గింజ మీద వ్యక్తి పేరు రాసి పెట్టినట్టు వేసే వేషం మీద కూడా భగవంతుడు పేరు రాసి పెట్టి ఉంటాడు. ఎవరి నూకలు వారికి ఉంటూనే ఉంటాయి. నా నూకలు నావి, అతని గింజలు అతనివే. కాబట్టి కుళ్లుపడటం అనే మాట ఊరికే ఉబుసుపోనివాళ్ల అనుకునేది. పైగా ఈ రంగంలో ఒకరు ఇంకొకరిని పడగొట్టాలనో, ఇంకేదో అనుకునేవాళ్లయితే అసలు నన్ను ఇంతదూరం రానిచ్చేవారా? నేను పరిశ్రమలో అడుగుపెట్టిన రోజుల్లో ఎంతో మంది దిగ్గజాలున్నారు. రావుగోపాలరావుగారు, కైకాల సత్యనారాయణగారు, నూతన్‌ప్రసాద్‌గారు, గొల్లపూడి మారుతీరావుగారు... అబ్బబ్బో ఒకరా? ఇద్దరా? మరి వాళ్లు నన్ను ఆపాలనుకుని ఉంటే ఆపగలిగి ఉండొచ్చుగా? రావుగోపాలరావుగారు నన్ను ఆప్యాయంగా పలకరించిన సన్నివేశాలను ఇంతకు ముందు ఓసారి చెప్పానుగా!. ఇక్కడ ఎవరూ ఎవరినీ ఆపలేరండీ. ఎవరి అదృష్టం వారిది. గుమ్మడికాయంత ప్రతిభ ఉన్నా ఆవగింజంత అదృష్టం తప్పకుండా ఉండాలి. నాకన్నా గొప్ప ప్రతిభావంతులు బయట ఎంతో మంది ఉండొచ్చు. కానీ నాకు ఆ ఆవగింజంత అదృష్టం తోడై ఉండవచ్చు. ఇతరులకి నేను కాంపిటీషన్ అని, నేకు ఇంకొకరికి పోటీ అని అనుకున్న క్షణాలే లేవండీ. అవతల వారు ఎవరైనా సరే బాగా చేశారంటే నేను మెచ్చుకుంటాను. ప్రకాశ్‌రాజ్ గురించి నేనెప్పుడూ తప్పుగా మాట్లాడలేదు. మరి నాక్కూడా తెలియకుండా ఎప్పుడైనా నోరు జారానేమో గుర్తులేదు. నేనెప్పుడూ పొరపాటున కూడా అవతలివారిని కించపరుస్తూ మాట్లాడను. అసలు నా స్వభావం అది కాదు. కాకపోతే నా భావాన్ని ఎక్స్‌ప్రెస్ చేసే ప్రతిసారీ కాస్త కటువుగా మాట్లాడినట్టు అనిపిస్తుంటుంది. చాలా సందర్భాల్లో అది అవతలి వారికి ఇంకో రకంగా అర్థమయ్యే ప్రమాదం ఉంది. దీనికి ఓ ఉదాహరణ చెబుతాను.

'ఆంధ్రజ్యోతి'లో ఒకసారి నన్ను ఇంటర్వ్యూ చేశారు. మాటల మధ్యలో 'బ్రహ్మానందంగారి గురించి చెప్పండి?..' అని అడిగారు. 'ఏముందండీ చెప్పడానికి... ఆరేళ్ళ నుంచి ఆయన ఒకటే వేషం వేసి లైఫ్ లాగుతున్నాడు. అందులో ఆయన తప్పేముంది? చాలా మంచి ఆర్టిస్ట్. అంత గొప్ప నటుడిని పరిశ్రమ ఉపయోగించుకోవడం లేదు. రిపీటెడ్‌గా ఒకే రకమైన వేషాలిచ్చి ఆయనలోని ప్రతిభను మరుగునపడేట్టు చేస్తున్నారు' అన్నా. అంటే నా ఉద్దేశం బ్రహ్మా



నందంలాంటి గొప్ప ఆర్టిస్టుకు తగ్గ వేషాలు రావడం లేదని, రచయితలు రాయడం లేదని.. మూస పాత్రలనే ఇస్తున్నారని అతని ప్రతిభను ఉపయోగించుకోలేకపోతున్నారని.. అంతే తప్ప చెడు ఉద్దేశం కాదు. కానీ అది చదివిన బ్రహ్మానందం గారు చాలా హర్ట్ అయ్యారని తర్వాత ఎవరో అన్నారు నాతో. ఇలాంటివి ఏవో అపార్థాలు వస్తుంటాయే తప్ప, ఉద్దేశపూర్వకంగా ఎవరినీ అనాలని నాకు ఉండదు. పొరపాటున కూడా అనను.

### తెలుగువారికి ఏం తక్కువ?

ఒక మాట మాత్రం గర్వంగా చెప్పుకుంటాను. 25 ఏళ్ళ నుంచి నా లక్ష్యం ఒకటే. తెలుగులో సినిమాలు తీసే నిర్మాతలు మన నటుల్ని ప్రోత్సహించాలి. ఈ మాట అన్నానని నాకు పరభాషా నటులంటే పడదని అనుకుంటే పొరపాటు. నజీరుద్దీన్ షా, నానా పటేకర్, అమితాబ్‌బచ్చన్‌గారు వంటి వారిని తీసుకురండి. ఏం.. ఇప్పుడు నేను వెళ్ళి పొరుగు భాషల్లో యాక్ట్ చేయట్లేదా? నా ఉద్దేశం 'నటులను' తీసుకురండి అని. అంతేగానీ ఏదో బచ్చాగాళ్లను తీసుకురావడం దేనికి? ఆ నటులకు, వాళ్లతో వచ్చే అసిస్టెంట్లకు స్టార్ హోటళ్లు, ఫ్లయిట్ ఛార్జీలు ఎందుకు అని? ఓనమాలు రానివారికి లక్షలు లక్షలు ఇవ్వడం వల్ల ఏమవుతుంది?

నిర్మాతలు తమ వ్యాపారం కోసం ఎలాంటి నిర్ణయాలైనా తీసుకోవచ్చు. కానీ ఇక్కడి తెలుగు నటులు మానసికంగా ఇబ్బందిపడిపోతారండీ. తెలుగు వాళ్లని ప్రోత్సహించడం తెలుగు సినిమా నిర్మాతల బాధ్యత. ఒక పక్కేమో తెలుగు సినిమాకు అవార్డులు రావడం లేదు' అంటారు... ఎలా వస్తాయి? మనం తీసేది తెలుగు సినిమా అయితే కదా? అందులో కనిపించే ముఖాలే మనవి కానప్పుడు అది తెలుగు సినిమా ఎలా అవుతుంది? పొట్ట పొడిస్తే తెలుగు అక్షరం రాని వ్యక్తి ముక్కలు ముక్కలు చేసి మాట్లాడిన భాషలో మన నేటివిటీని ఎలా చూడగలుగుతాం? మనమే చూడలేనప్పుడు అవార్డుల కమిటీల్లో ఉన్నవాళ్లకి ప్రత్యేకంగా ఏం కనిపిస్తుంది? ఇదిగో ఇది మాట్లాడితే కాంట్రవర్సీ అంటారండీ.

తెలుగు నటులను ప్రోత్సహించాలనే విషయం మీద నేను ఒక్కడినే పోరాడుతున్నాను. ఈ విషయం గురించి పరుచూరి వెంకటేశ్వరరావుగారు చాలాసార్లు ప్రస్తావిస్తుంటారు. 'వన్ మేన్ ఆర్మీ లాగా పోరాడుతున్నావ్' అని కనిపించినప్పుడల్లా అంటారు. వాస్తవంగా అనుకోవాలంటే ఆ పోరాడటం వల్ల నాకు వచ్చేదేంటి? పోయేదేంటి? ఇప్పటికీ నాకు తగ్గ వేషాలు నేను చేసుకుంటూనే ఉన్నాను. నటించడానికి సమయం చాలక పరుగులు తీసిన సందర్భాలున్నాయేకానీ, వేషాలు లేక ఖాళీగా కూర్చున్న రోజులు మాత్రం లేవు. అలాంటప్పుడు నేనెందుకు పోరాడాలి? నాకేం పట్టిందని అందరిలాగా కూర్చోవడం నాకిష్టం లేదండీ. మన తెలుగువారి గురించి, సాటి నటుల గురించి ఆలోచించకపోతే ఎలా?






'నాలుగు సినిమాలు ఇస్తే నాలుగూ పాడు చేశాడు' అని ఎవరిమీదైనా నిర్మాతలకు కోపం ఉంటే అలాంటివారికి వేషాలు ఇవ్వక్కర్లేదు కానీ అసలు అవకాశమే ఇవ్వకుండా ఎక్కడెక్కడి నుంచో మనుషులను తీసుకొస్తే మాత్రం తప్పే.

### తెలుగువాడి దమ్ము...

తెలుగులో దమ్మున్న నటులు ఎవరున్నారనే విషయం మీద ఒకసారి నాకు, దర్శకుడు కృష్ణవంశీ గారికి మాటామాటా పెరిగింది. 'ఆ నలుగురు' సినిమా సమయంలోనే అనుకుంటా.

కృష్ణవంశీగారు టీవీకి ఇచ్చిన ఇంటర్వ్యూలో "తెలుగులో మంచి నటులు లేరు అనడానికి నిదర్శనం ప్రకాశ్ రాజ్‌గారికే వరుసగా సపోర్టింగ్ ఆర్టిస్టు, విలన్ కేటగిరిల్లో రెండు నంది అవార్డులు రావడం' అన్నారు. ఆ మాటను నేను తప్పు పట్టాను. ఎందుకంటే నాక్కూడా ఓ సంవత్సరం రెండు నందులు వచ్చాయి. ఆ విషయాన్నే ప్రస్తావిస్తూ "కృష్ణవంశీగారు, మీరు తెలుగు డైరెక్టర్ అయి ఉండి, అలా మాట్లాడటం తప్పుకదా? అవార్డులు వచ్చిన వారిని పొగడాలంటే పొగుడుకోవచ్చు కానీ, తెలుగులో మంచి నటులు లేరు అనే టాపిక్ ఎందుకొచ్చింది? అలా అనడం సబబు కాదు' అన్నా. దానికి ఆయన నన్ను ఏదో అన్నారట. 'కోట శ్రీనివాసరావుకు ఏం పనిలేదు. ఆయనేదో పిచ్చిపిచ్చిగా మాట్లాడతాడు' అనే అర్థం ధ్వనించేటట్టు ఏదో అన్నారు. అప్పుడు ఇద్దరం యంగ్‌గా ఉన్నాం. మాటామాటా పెరిగింది. నేను కూడా విలేకరులను పిలిచి ఇంటర్వ్యూ పెట్టి ఒక మాట చెప్పా. అది నాకు ఇంకా బాగానే గుర్తు. 'వంశీగారు మీకు దమ్ముంటే ఈ కోట శ్రీనివాసరావుకు మంచి వేషం ఇచ్చి చూడండి. తెలుగువాడి దమ్ము ఏంటో చూపిస్తా' అన్నా.

దానికి ఆయన ఎదురు ప్రెస్‌మీట్ పెట్టి 'షూటింగ్‌కి తాగి వస్తాడు కోట, తాగి నటిస్తాడు, అమ్మాయిలతో తిరుగుతాడు, అమ్మాయిలతో దెబ్బలు తిన్నాడు...' ఇలా ఏవేవో మాటలు అన్నాడు. ఇవన్నీ నిజమే అయితే, మరి ఆయన నన్ను తన సినిమాల్లో కూడా పెట్టుకున్నాడుగా. తాగి వస్తానన్నది నిజమైతే ఎందుకు వేషాలిచ్చినట్టు?

రాఖీ ఆయన దర్శకత్వంలోనే నటించాగా. చిరంజీవిగారి అబ్బాయి రామ్‌చరణ్‌తేజ్ 'గోవిందుడు అందరివాడేలే' లో పెట్టుకున్నారుగా. కాబట్టి నా ఇన్నేళ్ల అనుభవం నాకు నేర్పిందేంటంటే 'సినిమా పరిశ్రమలో మాటామాటా అనుకుంటూనే ఉంటారు. గట్టిగా పోట్లాడుకున్నప్పటికీ అది శాశ్వతం కాదు. ఆ మాటలు వస్తూ ఉంటాయి, పోతూ ఉంటాయి. ఇది మామూలే'. నేనే కాదు, దాసరి నారాయణరావుగారు ఇంకా పెద్దపెద్దవాళ్లు చాలామందికి ఇలాంటి అనుభవాలు ఉండేవుంటాయి. అలాంటివారు ఇంకెంత ఫేస్ చేసి ఉండాలి?

**(ఇంకా ఉంది)**

**డా. చల్లా భాగ్యలక్ష్మి**
**సెల్: 88850 55528**



## నేను అన్నట్టే...

నాకు నటుడు శ్రీహరి అంటే చాలా ఇష్టం. ఎక్కడ కనిపించినా 'అన్నా' అని ఆప్యాయంగా పలకరించేవాడు. ఒకసారి రామానాయుడుగారి స్టూడియోలో షూటింగ్‌లో ఉన్నాడు. నేనెందుకో అక్కడికెళ్లా. చాలా బాగా నటిస్తున్నాడనిపించింది. 'ఈ ఏడాది తప్పకుండా నంది తీసుకుంటావు తమ్మీ' అన్నా. 'గట్లే కానీ అన్నా. నీ నోటి చలవ' అన్నాడు. అన్నట్టే ఆ ఏడాది నంది తీసుకుని నా దగ్గరకు వచ్చి 'అన్నా, నీ మాట నిజమైందే, నంది తీసుకున్నా' అని చాలా సంతోషంగా చెప్పాడు. నాతో క్లోజ్‌గా ఉండేవాడు. అంత త్వరగా కన్నుమూయాల్సిన వ్యక్తి కాదు. శ్రీహరి లేని లోటు తెలుగు సినిమాలో ఇంకా కనిపిస్తూనే ఉంది.




**"ఆడపిల్లవాళ్లు తయారై కూర్చున్నారు. పదరా అంటే తటపటాయిస్తావేంట్రా" అన్నాడు తండ్రి చతుర్ముఖం కొడుకు బ్రహ్మపుత్రతో.**

**"ఏవిటి నాన్నా ఇది! పెళ్ళి కావాల్సింది నాకు. చేసుకునేది నేను" వినిపించీ విని పించనట్లు గొణిగాడు కొడుకు.**

**ఎప్పుడూ లేంది కొడుకు ఎదురు చెప్పినందుకు తండ్రి ముఖం రంగుమారింది. మారిన రంగు ఖంగుమనేలోపు కొడుకు పక్కగా వచ్చింది తల్లి పుల్లాబ్జాక్షి.**

# అప్పూ బప్పూ!

"వాడికంటూ అభిప్రాయం ఒకటి ఉంటుందన్న సంగతి విస్మరించి మీరు మరీ దాష్టీకం చేస్తున్నారు" అంది తల్లి.

"ఆ ఒకటికి నీ ఒకటిని తోడు చేయకు! వాడు అంతగా చికాకు పడాల్సిన అగత్యం ఏమొచ్చి పడిందో యిప్పుడు" పక్కచూపుతో అన్నాడు చతుర్ముఖం.

"లేకపోతే ఏంటండీ! అమ్మాయెవరో తెలీకుండా, కనీసం ఫొటో అయినా చూపించ కుండా, ఏకంగా, రారా పెళ్ళిచూపులకి అంటే వాడు కంగారు పడకేంచేస్తాడు. అసలు వాడికిప్పుడు పెళ్ళి చేసుకునే ఉద్దేశం ఉందో లేదో" అంది పుల్లాబ్జాక్షి కొడుకు తల నిమురుతూ.

"కోడలంటే ఇంటికి రాబోయే దీపం! ఆ వెలుగు వెలుగేంటో, ఎలా ఉండాలో నాకు తెలీదనుకున్నావా! ఆ వెలుగులో నా గుండె ఆనందాలు చూడదనుకున్నావా" తన గదిలోకి తాను వెళుతున్న కొడుకు చెవిని కూడా తాకేట్లు అన్నాడు చతుర్ముఖం.

"అయ్య బాబోయ్! మళ్ళీ మొదటికొచ్చారు. ఈయనకు అర్థమయ్యేట్లు ఎలా చెప్పాలో ఏంటో" ఏదో గోడకు చెప్పినట్లుచెప్పి, వంటింట్లోకి వెళ్ళింది పుల్లాబ్జాక్షి.

"ఇప్పుడు మీరిలా బిగదీసుకుంటే అక్కడ వాళ్లకు నేనిచ్చిన మాట ఏం కావాలి" అంటూ భార్య వెనకాలే వెళ్ళాడు చతుర్ముఖం.

"మమ్మల్ని అడక్కుండా మాటెందుకు ఇచ్చారో" అంది పుల్లాబ్జాక్షి. ఒకటే కాలేజీ, ఒకటే సంవత్సరం. ఒకటే సబ్జెక్టు ఇద్దరిదీ, అంటే క్లాస్‌మేట్సనేగా! ఇలా ఒకరికి తెలియకుండా ఒకరు పెళ్ళిచూపులు చూసుకుని పలకరించుకుంటే చూడాలనిపించిందోయ్. ఆ అమ్మాయినే చేసుకోవాలనేమన్నావుందా? ఆ అమ్మాయినే చేసుకోరా అనేమన్నా శాసిస్తున్నానా?" అన్నాడు.

"మీ ఆలోచన నాక్కూడా ముచ్చటగానే ఉందండీ. ఈ రోజుల్లో అమ్మాయిలు, అబ్బాయిల పోకడే వేరు"

"ఏరా, ఒరా! అసే, ఒసే! అనుకోవడమేగా పోకడంటే" అన్నాడు, భార్య చేతికి అందేట్లుగా కాఫీ పొడి డబ్బా జరుపుతూ.

"రోడ్డుమీదకెళ్తే మీ పని మీరు చూసుకోకుండా ఆ పని కూడా చేస్తున్నారన్నమాట" అంది నవ్వుతూ, కాఫీ కలుపుతూ.

"ఏ పని!"

"అదే! పోకడల మీద కన్నేయడం"

"ఇంకా నయం కన్ను కొట్టడం అన్లేదు"

"అనిపించుకోవాలనే సరదా కూడా ఉందన్న మాట"

"సరదా సరే! ఆ అమ్మాయి ఫలానా అని నువ్వేం నోరు జారలేదు కదా" అన్నాడు. గడ్డం కింద బొటన వేలుతో ఒత్తుకుంటూ.

"నా నోటికి తాళం వేసి తాళం చేయి మీ జేబులో కుక్కుకుంటే జారడం, గీరడం ఎందుకుంటాయి" కొడుకు అలికిడి విని గొంతు చిన్నది చేస్తూ అంది.

"నోటికి తాళం ఏంటే" అన్నాడు కొడుకు లోపల కొస్తూ.

"ఏం లేదు నాయనా, మనం సాయంత్రం పెళ్ళిచూపులకి వెళ్తే, ఇంటికి వేయడానికి తాళం కనిపించడం లేదని..."

"అది నా గదిలో ఉందే!"

***

సంప్రదాయబద్ధమైన మర్యాదల తతంగం పూర్తయిన తరువాత అమ్మాయి వచ్చి కూర్చోబోయి ఆగి నడుం మీదకి చేతుల్ని చేర్చింది.

"పెళ్ళికొడుకు వీడని ముందే ఎందుకు చెప్పలేదు నాన్నా" అంది తండ్రితో.

"చెప్పొద్దనే ఉద్దేశంతోనే చెప్పలేదుగానీ, వీడంటున్నావేంటమ్మా, తప్పు కదా" అన్నాడు తండ్రి అలజడితో తడబడుతూ.

"వీడు కాకపోతే వాడు. వాడు నా క్లాస్‌మేట్‌గాడు" అవునా అన్నట్లు చూశాడు అమ్మాయి తండ్రి.

"అది చెప్పింది, నిజమేననుకోండి" బ్రహ్మపుత్ర, నదిలోని సుడిగుండంలో గిర్రున తిరుగుతున్న గుండెను దిటవు చేసుకుని చెప్పాడు.

"అయితే ఇంకేం ఏ సంగతో వెంటనే చెప్పండి మరీ" అన్నాడు చతుర్ముఖం చతురమైన నవ్వులతో.

"వీడు తెలిసి వచ్చాడా తెలీక వచ్చాడా, అది చెప్పండి" అంది ఆ అమ్మాయి.

'వాడికి మేం నీ వివరాలేం చెప్పలేదమ్మా!" అన్నాడు చతుర్ముఖం.

"వీడు పెట్టిన క్యూలో నేను మూడోదాన్ని అంకుల్"

"క్యూ ఏమిటమ్మా" ఆందోళనగా అడిగాడు చతుర్ముఖం.

"వాణ్ణే అడగండి".

"క్యూలు! క్యూలుంటాయి కదా నాన్నా! హోటల్ ముందు క్యూలు, బాటిల్ ముందు, ఏటీయంల ముందు క్యూలు.."

"ఆ డొంక తిరుగుడేంట్రా"

"తిరక్కుండా నేను చెబుతాలే అంకుల్".

"ఏం చెప్పక్కర్లేదు, మనం వినక్కర్లేదు. వెళ్దాం నాన్నా'.

"ఈ చూపుల్లో ఏదో తేడా ఉన్నట్లుగా ఉంది. రంగు బయటపడ్డ తర్వాతే రంగమో, తారంగమో"

**అర్థాంతరంగా కొడుకుని పెళ్ళిచూపులకు లేవదీశాడు తండ్రి చతుర్ముఖం. తండ్రి ధోరణి ఎంతమాత్రం నచ్చలేదు బప్పూకి. ఫొటో కూడా చూపించకుండా, ఎలాంటి ప్రిపరేషనూ లేకుండా పెళ్ళిచూపులకు రమ్మంటే ఎలా సాధ్యపడుతుందీ? విసుక్కుంటూనే వెళ్ళాడు బప్పూ. అతగాణ్ణి చూడగానే వీడా? వీడు నన్ను చూడ్డానికి తెలిసొచ్చాడా? తెలియకొచ్చాడా? అడిగింది పెళ్ళికూతురు అప్పూ. చదవండి అదేంటో!**

ఎందుకొచ్చాడో తెలియని ఓ లావాటి పెద్దమనిషి పెద్దగొంతుతో అన్నాడు. విసురుగా లేచి కదిలాడు చతుర్ముఖం. ఏ మాటా అనకుండా, వినకుండా!

***

"ఆ అమ్మాయి మూడోది అనే దుస్థితి ఏంట్రా? పెంపకం అంటూ పేరు మాకొస్తుందిరా" అంది తల్లి.

"అమ్మా! నీ కొడుకు అటువంటి వాడు కాదు, నన్ను నమ్ము, అద్సరే, నాన్నేడి!" అడిగాడు బ్రహ్మపుత్ర.

"కల్యాణమనుకుంటే ఇలా అయిందేవిటా అన్న వేదనతో, ఉన్న నాలుగు వెంట్రుకలూ కట్టగట్టి కల్యాణ కట్టలో పడేసొస్తా అంటూ ఏడుకొండల మీదకి వెళ్ళారు. నువ్వెళ్ళి నాన్నను కలిసి, ప్రశాంత పరచి తీసుకురా లేకపోతే మనశ్శాంతి, మంచుకొండలు అంటూ అటునుంచటే వెళతారు" అంది పుల్లాజ్జాక్షి.

***

గగన గంగలో స్నానం చేస్తున్న కొడుకు గుండుని చూసింది తండ్రి గుండు!

క్షణం పాటు అలముకున్న మనసు మేఘాలు తొలగిపోయాయి. మెత్తటి గుండు గరుకు గుండుని నిమిరింది!

మాటలు మొదలయ్యాయి.

"నాన్నా పెళ్ళి అని నేను అడిగినప్పుడే ఏ అడుగన్నా వేయి నాన్నా" అన్నాడు బ్రహ్మపుత్ర.

"ఆ సంగతి ఇంటికి వెళ్ళింతరువాత ఆలోచిద్దాం లేరా ముందు స్వామివారి కల్యాణ మహోత్సవం చూద్దాం పద" అన్నాడు చతుర్ముఖం.

***

తిరుగు ప్రయాణం!

గంధం పూసిన గుండ్రటి తలలు రేణిగుంట స్టేషన్లో హడావిడిగా ఉన్నాయి.

"అరేయ్! బప్పూ!" అని కేక వినిపించింది.

తండ్రీ కొడుకులిద్దరూ అసంకల్పితంగా కేక వైపు చూశారు.

అప్పు అనబడే ఆపన్నశరణ్య! బ్రహ్మపుత్ర క్లాస్ మేట్!

"దాంతో మనకెందుకు నాన్నా" అన్నాడు బ్రహ్మపుత్ర.

"అదే వద్దు" అని కొడుకుతో అని, అమ్మాయి దగ్గరికి వచ్చిందాకా ఆగి "ఏంటమ్మా! నువ్వేలా వచ్చావ్ ఇలా" అన్నాడు చతుర్ముఖం.

"వీసా వచ్చిందంకుల్! దేవుడికి దండం పెట్టుకుని, వెడ్డింగు కార్డులు స్వామి పాదాల ముందు పెట్టి వస్తున్నాను" చెప్పింది.

"ఎవరమ్మా ఆ అదృష్టవంతుడు".

"ఆ అదృష్టవంతురాల్ని నేను అంకుల్. ఆ సంగతి తర్వాత చెబుతా అంకుల్. నా హ్యాండ్ బ్యాగ్ పోయింది. దాన్లోనే అన్నీ ఉన్నాయి" అంది అప్పు.

"సంగతి పూర్తిగా అర్థమయింది కానీ ముందెళ్ళి టికెట్ తెచ్చుకో" అని డబ్బులిచ్చాడు చతుర్ముఖం.

***

"ఏ నిమిషానికి ఏమి జరుగునో" అని ఘంటసాల తీయని గొంతు ఎవరి సెల్లు నుంచో వినిపిస్తోంది.

"ఆ కాలంలో కాల మానం నిమిషాల్లో ఉండేదా అంకుల్" అంది అప్పు.

"అది నేపథ్య గీతంలే గాని మనమిలా ప్రయాణం చేస్తామని ఊహలో కూడా తలవని విషయం. భగవంతుడి లీల!" అన్నాడు చతుర్ముఖం.

బ్రహ్మపుత్ర మాట మీద సూట్ కేస్ తెరిచి చూసి "అరే, నా బ్యాగ్ దీన్లోనే ఉందే!" అంది అప్పు.

"ఆ లీలలో ఈ లీలో లీలేలే" అన్నాడు బ్రహ్మపుత్ర.

లోయర్ బెర్త్‌లో తండ్రి. మిడిల్ బెర్తుల్లో ఎదురెదురుగా అప్పు బప్పు!

"నేనూ నాన్నా తిరిగొస్తుంటే రేణిగుంటలో దయ్యం పట్టుకుందే" అని సెల్లులో తల్లితో చెబుతున్నమాట విని "ఏవిటి నాయనా దయ్యాలూ భూతాలు అంటున్నావు. నా కసలే గుండె నొప్పి" అందో గొంతు.

"పిల్లల మాటల్లేండి" అని ఆయనకు సర్ది చెప్పి, బ్రహ్మపుత్ర చేతిలో సెల్లు తీసి జేబులో పెట్టుకున్నాడు చతుర్ముఖం. అప్పు నవ్వింది.

"అరేయ్! ఫస్టియర్లో నిన్ను ర్యాగింగ్ చేస్తున్న వీడియో" అంది అప్పు.

"అసేయ్! నీ సెల్లు తీసి బయట పడేస్తా. పోయిందనుకున్నదేగా పోయిందనుకో" అన్నాడు బ్రహ్మపుత్ర.

"అయితే ఇంటికి వెళ్ళింతరువాత ఫేస్‌బుక్‌లో పెడతా" అంది అప్పు.

"అదేదో నీ వెడ్డింగు కార్డు పెట్టుకో. పెళ్ళి పిలుపులు, అలుపులు లేకుండా అక్షింతలు నెత్తి మీద పడతాయి".

"అయితే క్యూలో నా కాళ్ల నొప్పి పెట్టకుండా కౌంటర్ ముందుంచినట్టేగా" అంది నవ్వు ముఖాన్ని సెల్లు లైటులో చూపిస్తూ, ఏదో వంకతో కిందకి దిగుతూ అప్పు బుగ్గకి చేయి తగిలించాడు బ్రహ్మపుత్ర.



"చూడండంకుల్. వీడు నన్ను నిద్రపోనీయడం లేదు"

మగత నిద్రలో ఉన్నాడు చతుర్ముఖం!

***

"ఇద్దరూ ప్రేమించుకుని, ఆ సంగతి మాకు ఏ మాత్రం తెలియకుండా పెద్దవాళ్ళు కుదిర్చిన పెళ్ళని అందరూ అనుకునేట్లుగా మమ్మల్ని అటకెక్కించి మీరు పీటలమీద కూర్చుంటారా!" వియ్యంకులు ఒక్క మాటగా అన్నారు ఆనందంగా.

చదువు చెడకుండా, పోటీపడి ఫస్టుమార్కులు తెచ్చుకుంటూ ప్రేమ అని క్లాసుమేట్సు కూడా అనుమానించకుండా, పెళ్ళిని సాధించిన వీళ్ల పట్టు మెచ్చుకోవాల్సిందే" అన్నాడు చతుర్ముఖం.

"ఏదమ్మా! పెళ్ళికొడుకుని ఒక్కసారి ఏవండీ అని పిలువమ్మా" అప్పుతో అన్నాడు చతుర్ముఖం. అలా అనే ముందు, "అలాగే మామయ్యగారు" అంది పెళ్ళికూతురు!



# సరికొత్త భావజాలానికి ఊపిరి రంగస్థలమే!

**-ప్రొఫెసర్ మొదలి నాగభూషణశర్మ**

**ఆయన ఉచ్ఛ్వాస నాటకం. ఆయన నిశ్వాస నాటకం.**

**గడచిన 74 సంవత్సరాలుగా నాటకరంగ అభివృద్ధికే జీవితం అంకితం చేశారాయన .**

**ఆయన పేరు ప్రొఫెసర్ మొదలి నాగభూషణ శర్మ.**

**ఆంగ్లోపాధ్యాయులు లక్షలమంది ఉంటారు. కానీ వారిలో నాటకరంగం కోసం జీవితాన్ని అంకితం చేసిన అరుదైన ఆంగ్లోపాధ్యాయుడు , నాటక రచయిత, దర్శకుడు, నటుడు, నాటక పరిశోధకుడు, ప్రపంచ ప్రఖ్యాత నాటకాల అనువాదకుడు ప్రొఫెసర్ శర్మ. ప్రపంచ సాహిత్యంలో, భారతీయ భాషల్లో ఉన్న ప్రఖ్యాత నాటకాలు అనువదించి , ప్రదర్శింపజేసి , నాటకరంగ అభివృద్ధికి దోహదం చేశారు. దేశవిదేశాల్లో తెలుగు నాటకరంగాన్ని ఉచ్ఛస్థానానికి తీసుకెళ్ళడమే తన లక్ష్యం అంటారాయన.. "మానవ జీవితాన్ని ప్రభావితం చేసేది నాటకమే, కొత్తభావజాలాలకు, వాదాలకు ఊపిరిపోసేది నాటకమే" అంటారాయన..**

**మార్చి 27వ తేదీ ప్రపంచ రంగస్థల దినోత్సవం సందర్భంగా ఆయన ఇంటర్వ్యూ**

మా నాన్నగారు మొదలి వెంకట సుబ్రహ్మణ్యశర్మ. అమ్మ కామేశ్వరమ్మ. 1935 జూలై 24న గుంటూరు జిల్లా, రేపల్లె తాలూకా, ధూళిపూడిలో పుట్టాను. మేం ఇద్దరు అన్నదమ్ములం. ఒక అక్క, ఇద్దరు చెల్లెళ్ళు. నాన్నగారు ధూళిపూడి హైస్కూలు హెడ్మాస్టర్‌గా నలభై ఏళ్ళు పనిచేశారు. ఆయన కథా రచయిత, నాటక రచయిత. కొడవటిగంటి కుటుంబరావు, పాలగుమ్మి పద్మరాజు, కవికొండల వెంకట్రావు వంటి హేమాహేమీల సమకాలికులు. వారంతా స్నేహితులు. కృష్ణా పత్రిక, 30 దశకం నాటి ఆంధ్రభూమి మాసపత్రికలో ఆయన ఎన్నో చారిత్రక నాటకాలు, కథలు రాసేవారు. బాల్యం నుండీ నాన్నగారి ప్రభావం నామీద ప్రస్ఫుటంగా ఉంది. విశ్వనాథ సత్యనారాయణ, నోరి నరసింహశాస్త్రి వంటి గొప్పవారితో సాహితీ సమావేశాలు జరుగుతూ ఉండేవి. ఆ స్కూలులో నాన్నగారు 22ఏళ్ళు 'ఆంధ్ర సాంస్కృతిక వారోత్సవాలు' చేశారు.

## ఎనిమిదవయేట రంగస్థల ప్రవేశం

నాన్నగారు వ్రాసిన 'విధినిర్వహణం' అనే ప్రసిద్ధ చారిత్రక నాటకం అందులో ప్రదర్శించినదే. ఆయన నటించేవారు కూడా. నేను నా ఎనిమిదోయేటనే ఈ పిల్లల నాటకాలలో నటించాను. పద్నాలుగో యేట 'రాముని బుద్ధిమంతతనం' అనే నాటిక రాసి దర్శకత్వం వహించాను. మచిలీపట్నం హిందూ కాలేజీలో ఇంటర్మీడియట్‌లో చేరాక నా నిజమైన నాటక ప్రస్థానం ప్రారంభమైంది. అక్కడ నార్ల వెంకటేశ్వరరావు గారి నాటికలు, విశ్వనాథ, కవిరాజు నాటికలు ప్రదర్శించేవాళ్ళం. కవిరాజు రచన 'దొంగాటకం' యాభై ప్రదర్శనలు చేశాం. కన్యాశుల్కం నాటకంలో మధురవాణి వేషం వేసేవాణ్ణి. ఆ నాటకం పాతిక ప్రదర్శనలు చేశాం.

బి.ఏ లో స్పెషల్ ఇంగ్లీష్‌లో షేక్స్‌పియర్‌ని చదువుతూ, 'భారతి' సాహిత్య మాసపత్రికలో ఎన్నో నాటకాలు సొంతంగా రాసేవాణ్ణి. అవి చదివిన బుచ్చిబాబు, మునిమాణిక్యం నరసింహారావు లాంటి పెద్దవాళ్ళతో నాకు సాన్నిహిత్యం ఏర్పడింది.

1954–55లో ప్రతి కాలేజీలో థియేటర్ క్లబ్స్ తరపున ఆంధ్రా యూనివర్సిటీలో 'విషాదాంతం' నాటకం ప్రదర్శించాం. అలా యూనివర్సిటీలో నాటకం ప్రదర్శించడమంటే ఆ రోజుల్లో హీరోకిందే లెక్క. అన్ని కాలేజీల నుండి ఎంపిక చేసిన విద్యార్థి బృందాలు వచ్చి యూనివర్సిటీ థియేటర్ క్లబ్‌లో నాటకాలు ప్రదర్శించేవారు. అదొక పండుగలా చేసేవారు. జె.వి.సోమయాజులు, రమణమూర్తి, చాట్ల శ్రీరాములు, దుగ్గిరాల సోమేశ్వరరావు, గరిమెళ్ళ రామ్మూర్తి ప్రభృతులు నా ఆత్మీయులు, నాటకరంగ అభివృద్ధికి కృషిచేసినవారు. అలా ప్రతి సంవత్సరం నాటకాలు రచించి దర్శకత్వం వహించేవాణ్ణి.

## ప్రపంచ రంగస్థల దినోత్సవం

*మార్చి 27వ తేదీ ప్రపంచ రంగస్థల దినోత్సవం. యునెస్కో సహకారంతో దాని అనుబంధ అంతర్జాతీయ నాటక సంస్థ (International Theatre Institute) 1962 నుండి ఈ ఉత్సవాలకు శ్రీకారం చుట్టింది.*

*నాటక రంగ సంరక్షణ, అభివృద్ధికి చేయవల్సిన కృషిపై సమాలోచనలు చేయడమే దీని లక్ష్యం.*

*1963లో డిల్లీలో ఏర్పడిన భారతీయ నాట్య సంఘ్‌కు అనుబంధంగా మనదేశంలో ఈ నాటక రంగ దినోత్సవం చేసేవారు. కమలాదేవి చటోపాధ్యాయ ఈ సంఘ్‌కు అధ్యక్షురాలు. మాకు గురువు, స్ఫూర్తి ఆవిడే. 1993నుండి రసరంజని తరపున ఏటా మూడు రోజులు నాటకరంగ దినోత్సవం చేస్తున్నాం. హైదరాబాద్ రవీంద్రభారతిలో మార్చి 27న 'అంధయుగం' తెలుగు అనువాద నాటకం ప్రదర్శిస్తున్నాం.*

*కందుకూరి వీరేశలింగం పుట్టినరోజు సందర్భంగా ఏప్రిల్ 16న తెలుగునాటక రంగ దినోత్సవాన్ని పది సంవత్సరాలుగా మా సంస్థ నిర్వహిస్తోంది. ఇలా నాటకరంగం కోసం జీవితకృషి కొనసాగిస్తున్నాను. ఇది అనంతం. నా వృత్తిని ప్రవృత్తిని సమన్వయం చేసుకోవడం ద్వారా జీవితంలో నేను ఇన్ని సాధించగలిగాను. కేంద్ర సంగీత నాటక అకాడమీ 'టాగోర్ అకాడమీ రత్న' అవార్డు, మూడు లక్షల నగదు ఇచ్చి సత్కరించారు. రాష్ట్ర ప్రభుత్వం ఎన్టీఆర్ నంది పురస్కారం ఇచ్చి సత్కరించారు.*


రోశయ్య నుండి టాగూర్ అకాడమీ రత్న అవార్డు అందుకుంటూ..

1954లో విజయవాడ ఆకాశవాణి రేడియో కేంద్రంలో బీ గ్రేడ్ ఆర్టిస్ట్‌గా పిల్లలకోసం 'బాల భారతి'లో 100 ప్రోగ్రాములు చేశాను. గుంటూరు ఎ.సి కాలేజీలో ఏడాది ఇంగ్లీషు ట్యూటర్‌గా చాలా నాటకాలకు దర్శకత్వం వహించాను. కోకా సంజీవ రావు, సినీ నటుడు శోభన్‌బాబు, కె.శాస్త్రి, రచయిత మోదుకూరి జాన్సన్ లాంటివాళ్ళంతా అక్కడే బి.ఏ చదువుతూ నా నాటకాల్లో నటించేవారు.

### హైదరాబాద్ నివాసం

ఎం.ఏ చదవటానికి 1956లో హైదరాబాద్ వచ్చాను. ఇక అప్పటినుండి ఇప్పటివరకు నా అరవయ్యేళ్ళ జీవన ప్రస్థానం హైదరాబాద్ కేంద్రంగానే నడిచింది. వరంగల్‌లో కాకతీయ ఆర్ట్స్ కాలేజీలో ఆరేళ్ళు లెక్చరర్‌గా చేసి విద్యార్థులతో పాతిక నాటికలు వేయించాను. 1963లో కాకతీయ కల్చరల్ ఫెస్టివల్‌కు నేనే శ్రీకారం చుట్టాను. ప్రఖ్యాత అమెరికన్ నాటక రచయిత, నోబుల్ లారియట్ EUGENE O' NEILL (యూజీన్ ఓ నీల్)పై పరిశోధన చేశాను.

### అమెరికా స్టూడెంట్స్‌తో టాగూర్ నాటకం

అమెరికా వెళ్ళి ఇల్లినోయ్ విశ్వవిద్యాలయంలో M.F.A (Master of Fine Arts in Theatre) కోర్సు చేసి, అక్కడే ఉద్యోగం చేస్తూ అంతర్జాతీయ నాటకరంగ విధానాలపై అధ్యయనం చేస్తూ వాటిని మన నాటకరంగానికి అన్వయించేదుకు తీవ్రంగా ఆలోచించేవాణ్ణి. ఇల్లినోయ్ యూనివర్సిటీలో మూడు ఆంగ్ల నాటకాలకు దర్శకత్వం వహించాను. టాగూర్ నాటకం 'శాక్రిఫైస్' తయారు చేసి దర్శకత్వం వహించి అమెరికన్ విద్యార్థులతో ప్రదర్శింపజేశాను. అమెరికా రాజధాని వాషింగ్టన్ డి.సిలోని లింకన్ సెంటర్ ప్రపంచ సాంస్కృతిక కేంద్రంగా భాసిల్లుతోంది. అమెరికాలోని 115 విశ్వవిద్యాలయాల నుండి ఎంపికచేసిన 12 నాటకాల్ని అక్కడ ప్రదర్శిస్తారు. అందులో నా నాటకం 'శాక్రిఫైస్' ప్రదర్శించారు. ఇలాంటి అవకాశం పొందిన దర్శకుణ్ణి నేనే.

### ఎన్విరాన్‌మెంటల్ థియేటర్

నాటక రచన, దర్శకత్వంతోపాటు కొత్త కొత్త నాటకప్రయోగాలు చేస్తున్నాను. ఇందులో ఒకటి Environmental Theatre. అంటే స్టేజ్‌పై సెట్టింగ్ వేయకుండా సహజంగా ఆ వాతావరణం ఉన్నచోటకు వెళ్ళి సంబంధిత నాటకం ప్రదర్శించడమే Environmental Theatre. ఉదాహరణకు 1983లో ఈడిపస్ నాటకం ప్రదర్శించాం. ఆ చారిత్రక శిల్పకళానైపుణ్యంగల కోటీ ఉమెన్స్ కాలేజీకి వెళ్ళి అక్కడి మెట్లు, పిల్లర్స్ బ్యాగ్రౌండ్‌గా చేసుకుని నాటకం ప్రదర్శించాం.

### ఉస్మానియాలో థియేటర్ క్లబ్

ఉస్మానియాలో 1976లో ఒక థియేటర్ క్లబ్ ప్రారంభించాను. హైదరాబాద్‌లో అప్పటికే డ్రమెటిక్ సర్కిల్ ఆఫ్ హైదరాబాద్ (డి.సి.హెచ్) సంస్థ నాటకాలు ప్రదర్శించేది. వాళ్ళకోసం, ఉస్మానియా థియేటర్ క్లబ్‌కోసం ఇంగ్లీషు నాటకాలు తయారుచేసేవాణ్ణి. గిరీష్‌కర్నాడ్ రచన తుగ్లక్, మృచ్ఛకటిక, ఫ్రెంచ్ నాటకం విజిట్, షేక్స్‌పియర్ నాటకం ట్వెల్త్‌నైట్ లకు రచన, అనువాదాలతో దర్శకత్వం వహించాను. కింగ్ ఈడిపస్ సహా ఆరు నాటకాలు తయారు చేశాను. 1982లో ఫౌండర్ ప్రొఫెసర్‌గా ఒక థియేటర్ డిపార్ట్‌మెంట్ ప్రారంభించి నిజాం కాలేజీలో ఈవెనింగ్ కోర్సులు నిర్వహించాం. ఈ విధంగా దక్షిణ భారతదేశంలో మొట్టమొదటి professor of Theatre art నేనే! దేశంలో నేను మూడవవాణ్ణి.

### రసరంజని

ప్రఖ్యాత నాటక సంస్థ 'రసరంజని'ని 1993లో ప్రారంభించాం. ఈ సంస్థ నా మానసపుత్రిక. ప్రతినెలా 20, 21 తేదీల్లో హైదరాబాద్ త్యాగరాయగానసభలో ఇప్పటికీ ఈ నాటకాలు ప్రదర్శిస్తున్నాం.

ఇంగ్లీషు, సంస్కృతం అనువాదాలు సహా ఇప్పటి వరకు 60 నాటకాలు రచించాను. సొంతంగా ఇరవై నాటకాలు రచించాను. సమకాలీన భారతీయ భాషలోవున్న ప్రముఖ నాటకాలు, పాశ్చాత్య దేశాల ప్రముఖ నాటకాలు అనువదించి ప్రదర్శించాను. నాటకంలో ఎన్నో ప్రయోగాలు చేశాను. ఇలా 60 నాటకాలకు దర్శకత్వం వహించాను. 42 మంది నాటక కళాకారుల గ్రాంఫోన్ నాటకాలు, పాటలపై పుస్తకాలు రాశాను. 100 తెలుగు నాటక సమాజాలపై పరిశోధన చేస్తున్నాను. 12 భారతీయ భాషల నాటకాలు తెలుగులోకి అనువదించాను. మరో 25 అనువాద నాటకాలున్నాయి. 64 జానపద కళల రీతులపై Folk form of Andhra Pradesh పుస్తకం రాశాను. నాట్యంపై 'నర్తనం' ఆంగ్ల త్రైమాసిక పత్రిక 12 ఏళ్ళు నడిపాను.

### నాటకమే బలమైన మాధ్యమం

నాటకాన్ని కేవలం వినోదంగానే చూడకూడదు. సంస్కృతిని ప్రభావితం చేసే ఒక సాధనంగా నాటకాన్ని గుర్తించాలి. నాటకాన్ని మించిన బలమైన మాధ్యమం మరొకటి ఉందని నేను అనుకోవడం లేదు. ఇంకా చెప్పాలంటే మానవ జీవితాన్ని ప్రభావితం చేసింది నాటకమే. మానవజీవితాన్ని గురించిన కొత్త అభిప్రాయాలు ఊపిరిపోసుకున్నదీ నాటకం ద్వారానే. మార్క్సిజం, మానవతావాదం, కాల్పనిక వాదం వంటి ప్రపంచంలోని గొప్ప గొప్ప వాదాలు, భావజాలం, సోషియాలజీలోని కొత్తభావనలు నాటక రంగం నుండి వచ్చినవే. అందుకే నాటకాన్ని కాపాడు కోవడం ప్రభుత్వ బాధ్యత.

### కుటుంబం

నా భార్య డాక్టర్ సరస్వతి. దుర్గాబాయ్ దేశ్‌ముఖ్‌గారి ఆదేశంతో ఆమె స్థాపించిన కళాశాలలో హిందీ రీడర్‌గా పనిచేసింది. రచయిత్రి. దర్శకురాలు. మాకు ఇద్దరు పిల్లలు. శరత్, ఆనంద్. ఇద్దరూ సాఫ్ట్‌వేర్ ఇంజనీర్లే. వివాహితులు. నాకు ముగ్గురు మనవలు.

—రామ్మోహన్


భార్య డా. సరస్వతితో...

# కోపానికి నడక మందు

కొందరికి తరచు కోపం వస్తూ ఉంటుంది. వారిలో కోపంతో పాటు రక్తపోటు కూడా పెరుగుతుంది. ఇది కొన్ని ఆరోగ్య సమస్యలకు కారణం కావచ్చు. ఇన్ని అనర్థాలు జరగకుండా ఉండాలంటే ప్రతి రోజూ కొద్ది సేపు నడవమంటున్నారు పరిశోధకులు. ఈ విధంగా నడవడం వలన బోలెడు లాభాలు ఉన్నాయి అని చెబుతున్నారు అమెరికాలోని ఫ్లోరిడా యూనివర్సిటీ పరిశోధకులు. రోజూ ఏదో ఒక సమయంలో కొద్దిసేపు నడవడం వలన రాత్రి సమయంలో నిద్ర బాగా పడుతుందనీ, ఈ కారణంగా భావావేశాలు అదుపులో ఉంటాయనీ వీరి పరిశోధనలో వెల్లడైంది. రోజూ కనీసం 500 కాలరీలు ఖర్చు అయ్యే వ్యాయామం చేయగలిగితే నిరాశా నిస్పృహలు దరిచేరవని వీరు చెబుతున్నారు. ప్రత్యేకించి వ్యాయామం చేయలేని వారు రోజు మొత్తంలో పదివేల అడుగులు నడవాలనీ, అది కూడా ఒకే సారి కాకుండా విడతల వారీగా నడవడం అలవాటు చేసుకోవాలని సూచిస్తున్నారు.



# పాదరక్షలతో అనారోగ్యం?




అనారోగ్యానికి రకరకాల కారణాలను కనుగొన్న పరిశోధకులు ఇప్పుడు సరైన పాదరక్షలు ధరించకపోతే అనారోగ్యం బారినపడక తప్పదని అంటున్నారు. పాదరక్షల వలన కలిగే సమస్యల గురించి ఇటీవల ఓ పరిశోధన నిర్వహించారు. సుమారు మూడు వేల మంది మీద వీరు అధ్యయనం నిర్వహించారు. వీరిలో చాలా మంది తమ పాదాలకన్నా పెద్దవో చిన్నవో ఉన్న చెప్పులు వేసుకుంటున్న వారే! దీని వలన వారి ఆరోగ్యంలో వస్తున్న మార్పులు చూసి పరిశోధకులు ఆశ్చర్యపోయారు. తమ పాదాల కన్నా తక్కువ ఉండే చెప్పులను వేసుకునే వారు పలు ఆరోగ్య సమస్యలు ఎదుర్కొంటున్నట్టు వీరు గుర్తించారు. నడుస్తూ నడుస్తూ తరచూ అదుపు తప్పి పడిపోవడం, పాదాల నొప్పులు, నడకలో మార్పులు తదితర సమస్యలను గుర్తించారు. ఈ సమస్యలే భవిష్యత్తులో ప్రాణాంతకం కావచ్చని వీరు హెచ్చరిస్తున్నారు. పాదరక్షల విషయంలో తగిన జాగ్రత్తలు తీసుకోవలసిందే! అని వారు సూచిస్తున్నారు.



# గోధుమలతో ఆరోగ్యం అబద్ధం!

చాలా మంది గోధుమలు ఆరోగ్యానికి మంచిది అన్న నమ్మకంలో ఉంటారు. ఇది పూర్తిగా నిజం కాదు అంటున్నారు పరిశోధకులు. వరి లాగా గోధుమలు అంత త్వరగా జీర్ణం కావని, చాలా ఆలస్యంగా జీర్ణం అవుతాయని దీని వలన పలు ఆరోగ్య సమస్యలు తలెత్తే ప్రమాదం ఉందని నిపుణులు చెబుతున్నారు. కొన్ని సార్లు విరేచనాలు, తల నొప్పి, అజీర్ణం వంటి సమస్యలు తలెత్తుతాయని, అవి గోధుమల వలన వచ్చినా, వాటిని గుర్తించడం కష్టమవుతుందని అంటున్నారు. దీని వలన చికిత్స ఆలస్యమై సమస్య తీవ్రమయ్యే అవకాశం ఉందని వారు హెచ్చరిస్తున్నారు. అంతే కాకుండా గోధుమలు తీసుకోవడం వలన షుగరు అదుపులో ఉంటుందన్న విషయం కూడా శాస్త్రీయంగా రుజువు కాలేదని వారు అంటున్నారు. అందువలన పూర్తిగా గోధుమలే తీసుకోకుండా కాలానుగుణంగా దొరికే పండ్లు, కూరగాయలు ఎక్కువగా తీసుకుంటే తగినన్ని పోషకాలు లభించి ఆరోగ్యంగా ఉంటారని వారు చెబుతున్నారు.

# వెన్నతో డయాబెటిస్



వెన్న తింటే ఆరోగ్యం అన్నది చాలామంది అభిప్రాయం. అయితే ఇది తప్పు అంటున్నారు పరిశోధకులు. రోజుకు 12 గ్రాములకు మించి వెన్న తీసుకుంటే టైప్–2 డయాబెటిస్ వచ్చే అవకాశాలు ఎక్కువగా ఉన్నాయన్న విషయం వీరి పరిశోధనల్లో వెల్లడైంది. సుమారు మూడున్నర వేల మంది మీద వీరు నాలుగు సంవత్సరాల పాటు పరిశోధనలు నిర్వహించారు. వీరిని రెండు గ్రూపులుగా విభజించి ఒక గ్రూపునకు క్రమం తప్పకుండా ఎక్కువ మోతాదులో వెన్న అందించారు. మరో గ్రూపు వారికి తక్కువ మోతాదులో వెన్న అందించారు. నాలుగు సంవత్సరాల అనంతరం వీరిని పరిశీలించగా ఎక్కువ మోతాదులో వెన్న తీసుకున్న గ్రూపులో సుమారు 270 మందిలో టైప్–2 డయాబెటిస్‌ని గుర్తించారు. జంతువుల ద్వారా లభించే ఉత్పత్తుల్లోనే శాచ్యురేటెడ్ ఫ్యాట్ ఎక్కువగా లభిస్తుందని, ఇదే టైప్–2 డయాబెటిస్ రావడానికి కారణం అవుతుందని పరిశోధకులు అభిప్రాయపడుతున్నారు. దీనిమీద వీరు ఇంకా పరిశోధనలు నిర్వహిస్తున్నారు.

—అవినాష్

# పైల్స్ - హోమియో చికిత్స



**డా. మురళి అంకిరెడ్డి**
M. D (Homeo)
**స్టార్ హోమియోపతి**

పైల్స్ వున్న వారి బాధవర్ణనాతీతం, మలవిసర్జన తర్వాత ఈ బాధ కొన్ని గంటల వరకు ఉంటుంది. నొప్పి, మంట, దురద ఉండి, సూదులతో గుచ్చు కున్నట్లువుండి వీరు ఒకచోట కూర్చోలేరు, నిల్చో లేరు. ఈ మొలలు చిట్లడంవలన రక్తస్రావం జరుగు తుంది. చాలారోజుల వరకు రక్తస్రావం అయితే శరీరంలో హిమోగ్లోబిన్ శాతం తగ్గి ఎనీమియా రావడానికి ఆస్కారంఉంది. జీవనవిధానం, మారుతున్న ఆహారపు అలవాట్లు, నిద్రలేమి, వాహనాలు అధికంగా నడపటం, వేసవికాలం, నీరు అధికంగా తీసుకోకపోవడం వలన ఇవి వస్తాయి. మలద్వారంతో కలుపబడిన పెద్దపేగు చివరి భాగాన్ని మలనాళం లేదా రెక్టమ్ అంటారు. ఇక్కడ ఉన్నకణజాలంలో అధికంగాఉండే రక్తనాళాల వాపు వలన ఈ స్థితి వస్తుంది. పురీషనాళం వెలుపలి భాగంలో వస్తే బాహ్య హెమరాయిడ్స్ అని, లోపలి భాగంలో వస్తే లోపలిహెమరాయిడ్స్ అనిఅంటారు. ఇవి బఠాణీగింజ లేదా ద్రాక్షపండు పరిమాణంలో గులాబీ రంగులో, మూడు లేదా నాలుగు గుత్తులు గా లేదా విడిగాకూడా ఉండే ఈ స్థితిని మూలశంక (పైల్స్) వ్యాధిగా పేర్కొంటారు.

**ఎవరికి వస్తుంది ?:** గర్భిణులలో, ప్రాస్టేట్ గ్రంథి వాపు ఉన్నవారిలో సాధారణంగా చూస్తాం. పిల్లలలో ఈ వ్యాధిని అరుదుగా చూస్తాం.

**కారణాలు :** 1. మలబద్ధకం మూలంగా అధికంగా ముక్కుటం 2. దీర్ఘకాలిక విరేచనాలు 3.గర్భస్థ పిండం ఒత్తిడి వలన, అధికంగా ఉత్పత్తి అయ్యే హార్మోన్ల వలన 4. పొత్తికడుపు లేదా పేగులలోని క్యాన్సర్ సంబంధ కణుతుల వలన 5. వంశపారం పర్యంగా 6. అధిక బరువు 7. పీచు పదార్థాలు తక్కువగా ఉన్న ఆహారాన్ని రోజూ తీసుకోవడం.. వంటివి.

**హెమరాయిడ్‌లు – రకములు:** మొదటి తరగతి ( ఫస్ట్ డిగ్రీ పైల్స్). ఒక్టమ్ లేదా మలనాళం లోపలే ఉంటాయి. రెండవ తరగతి (సెకండ్ డిగ్రీ పైల్స్). పురీషనాళం తెరుచుకొని ఉన్నప్పుడు వెలుపలికి వచ్చి, మలద్వారం మూసుకున్న వెంటనే లోపలికి వెళ్ళిపోతాయి. మూడవ తరగతి (థర్డ్ డిగ్రీ పైల్స్) వెలుపలికి వచ్చి, హెమరాయిడ్‌లను లోపలికి చొప్పించిన వెంటనే లోనికి వెళ్ళిపోతాయి. నాల్గవ తరగతి (ఫోర్త్ డిగ్రీ పైల్స్) మలద్వారం వెలుపల శాశ్వతంగా వేలాడుతూ ఉంటాయి.

**లక్షణాలు:** చాలా మంది ఎక్కువగా లోపలి హెమరాయిడ్‌ల(ఇంటర్నల్ పైల్స్)తో ఏ లక్షణాలు లేకుండానే ఉంటారు. మలద్వారం తెరుచుకున్న వెంటనే తాజా రక్తం మలద్వారం ద్వారా వెలుపలికి వస్తుంది. మలద్వారం చుట్టూ దురద ఉండవచ్చు. మూడు - నాలుగు దశలలోని హెమరాయిడ్‌లు, అధికంగా నొప్పి ఉండి చీమువంటి పలుచని ద్రవం విసర్జింప బడుతుంది.

**నివారించవచ్చా:** మొలలు వచ్చిన తరువాత కంటె మొలల లక్షణాలు కనబడిన వెంటనే కొన్ని జాగ్రత్తలు తీసుకుంటే వీటిని నివారించవచ్చు. మొలలతో బాధపడేవారు ఆహారపు అలవాట్లలో, జీవన విధానంలో మార్పుతీసుకొస్తే నివారించవచ్చు. ముఖ్యంగా తాజా పండ్లు, ఆకుకూరలు, ఫైబర్‌తో కూడిన పదార్థాలు, దప్పికఉన్న లేకున్నా పది నుండి పన్నెండు గ్లాసులనీరుతీసుకోవడం, మాంసాహారం, మసాలాలు, పచ్చళ్ళుతీసుకోకుండా ఉంటే మంచిది. ఎక్కువసేపు కూర్చోకుండా, యోగా, వ్యాయామం చేయడం వలన నివారించవచ్చు.

**హోమియో చికిత్స వలన ప్రయోజనం ఉంటుందా?:** మొదటి మూడు దశలలోని హెమరాయిడ్‌లను పూర్తిగా నయం చేయుటమేకాక, శస్త్రచికిత్స, అవసరం లేకుండా చేస్తుంది. అంతే కాకుండా హెమరాయిడ్ వలన వచ్చే బలహీనతను తగ్గించి, శాశ్వతంగా రాకుండా చేస్తుంది. హోమియోలో ఆస్కులస్ హిప్, ఆలోస్, హెయామెలిస్, కొలింగ్ సోనియా, ఆర్గనిక్ ఆల్, నక్సామికా మందులు బాగా పనిచేస్తాయి.

www.starhomeopathy.com | తెలంగాణ। ఆంధ్రప్రదేశ్। కర్నాటక। దుబాయి। లండన్। మాంచెస్టర్ | © 90300 64224

# సోరియాసిస్

సోరియాసిస్ మచ్చలు పింక్ లేక ఎరుపు వర్ణంలో పొలుసులతో కూడి ఉంటాయి. చర్మం దళసరిగా ఉంటుంది. ఈ పొలుసులను బల వంతంగా తీస్తే వాటికింద ఎర్రటిరక్తపు మచ్చలు గా కనిపిస్తాయి.ఈ సోరియాసిస్ మచ్చలు కొంచెంకాని, ఎక్కువ సంఖ్యలో గాని ఉంటాయి.

శరీరంలోని చాలాభాగాలలో అంటే చేతులు, కాళ్ళు, తల,వీపుమీద,మోకాళ్ళ ముందుభాగాన, ఉదరం, అరికాళ్ళు, అరిచేతులలో అధికంగా ఈ మచ్చలు వస్తాయి. పొలుసులు చాలా దట్టంగా, అధికంగాఉండి కొవ్వొత్తి మైనంలాగా ఉంటాయి. ఒక్కొక్కసారి వాపుతో కూడి ఉంటాయి.

సోరియాసిస్ ప్రధానంగా చాతి, కాళ్ళ మీద... యంక్త, మధ్యవయస్సులో అధికంగా కనిపిస్తుంది. చాలా తక్కువగా చిన్నపిల్లలు, వృద్ధులలో కనిపించ వచ్చు. అధికవత్తిడివలన, వంశపారంపర్యంగా తల్లిదండ్రులకు ఉంటే వారి పిల్లలకు ఈ వ్యాధిరావటానికి అవకాశాలు ఉంటాయి. కాలివేళ్ళు, చేతివేళ్ళ గోళ్ళలో గుంటలు పడినట్లు ఉంటాయి.



**చికిత్సా విధానం:** ప్రధానంగా సోరియాసిస్ (కిటిభ కుష్టం) అనే వ్యాధిలో పంచకర్మ చికిత్సా విధానం ఎంతో ప్రముఖమైనది. ఈ పంచకర్మ విధానంలో వమనకర్మప్రధానమైనది. దీనివలన శరీరంలో ఉన్న చెడుభావాలు రసాయనాలు మొదలగు శరీరం నుండి బయటికి పంపబడ తాయి. తక్రధార. ఈ చికిత్సావిధానంలో ప్రత్యేకంగా ఔషధాలతో తయారు చేయబడిన తక్రము లేదా మజ్జిగధారతో మచ్చలుగల శరీర భాగాలను శుభ్రంగా తడపటం జరుగుతుంది. దీనివలన శరీరం పైభాగంలోని పొలుసులన్నీ ఊడిపోతాయి.

**నివారణ:** మానసిక వత్తిడి నుండి పూర్తిగా విముక్తి వలన, పులుపు పదార్థాలు, మాంసాహార సేవన, సముద్ర ఉత్పత్తులు పూర్తిగా నిషేధించటం వలన, వాయుకాలుష్యం, జల కాలుష్యం నుంచి దూరంగా ఉండటం, పరిశ్రమలలో సరైన రక్షణ విధానాలు పాటించటం వలన నివారించవచ్చు.

**డా.మనోహర్.** M. D (Ayurveda)
**స్టార్ ఆయుర్వేద**

ADVT

©90300 85456 | తెలంగాణ। ఆంధ్రప్రదేశ్। కర్నాటక | www.starayurveda.com




**ఐటీ అధికారులు వెళ్ళిన ఒక గంట తరువాత, టీవీల్లో, మా ఆఫీసులో ఐటీ రైడ్ జరుగుతుందన్న స్క్రోలింగ్ రావడం మొదలయింది.**

**శ్రావణికి ఆ విషయం తెలిసి ఆందోళనగా ఫోన్ చేసింది.**

**"నథింగ్ టు వర్రీ! అంతా సజావుగా అయిపోయింది. వాళ్ళు వెళ్ళిపోయారు. డోంట్ వర్రీ" అని చెప్పిన తర్వాత తను నెమ్మదించింది.**

ఇన్‌కంటాక్స్ వాళ్ళు వెళ్ళగానే నేను అకౌంట్ బుక్స్ ముందర వేసుకుని కూర్చున్నాను.

అసలయితే, నేను ఆ రోజు పోలీస్ స్టేషనుకు వెళ్ళి శ్రావణి మీద దాడికి 'సుపారీ' ఇచ్చిన వారి సంగతి చూడాల్సి ఉంది.

కానీ, రైడ్ చేశాక వెళ్తూ వెళ్తూ, ఐటీవో చెప్పిన విషయం విన్న తర్వాత, నా మైండ్ బ్లాంక్ అయింది. నా ప్రయారిటీ మారి పోయింది. అందుకే, అభిషేకం గారితో పాటూ మిగిలిన స్టాఫ్ మెంబర్స్‌తో, దగ్గరలో ఉన్న ఒక హోటల్లో వర్కింగ్ లంచ్ మీటింగ్ ఏర్పాటు చేశాను.

మా సినిమాకు సంబంధించి నంత వరకు దాదాపుగా అన్ని పనులూ పూర్తయ్యాయి.

కొన్ని పోస్ట్ ప్రొడక్షన్ పనులు మాత్రం మిగిలిపోయాయి. ఆ పనులు కూడా రెండు మూడు నెలల్లో పూర్తయి పోతాయి. వాటికోసం ఇంతమంది స్టాఫ్‌ను మెయింటెయిన్ చేయాల్సిన అవసరం లేదు కూడా. ఒక రకంగా వాళ్ళందరికీ ఈ విషయం తెలుసు. అందుకు వాళ్ళు మానసికంగా సిద్ధపడి ఉన్నారు కూడా.

కానీ వాళ్ళకు 'ఇక మీరు రానవసరం లేదని' చెప్పడానికి నాకే సంకోచంగా ఉంది. ఇన్ని రోజులు కలిసి పని చేసిన వాళ్ళను పంపేసేంత నిర్మొహమాటం నాకు లేదు.

కానీ, ఇప్పుడు తప్పదు. అందుకే, అందరం భోజనం చేసి కూర్చున్న తరువాత,

"ఫ్రెండ్స్! మీ అందరికీ తెలుసు. మనం గుమ్మడికాయ కొట్టేశాం కాబట్టి, ఇక షూటింగ్ పార్టు పూర్తయినట్టే. మీ లాగే నేను కూడా ఈ బ్యానర్లో ఒక ఉద్యోగిని మాత్రమే. కాకపోతే, ప్రొడ్యూసర్‌గారు నాకు పూర్తి స్వేచ్ఛనిచ్చారు. అంతే. నాకు మనస్ఫూర్తిగా మిమ్మల్ని పొమ్మని చెప్పాలని లేదు. కానీ, తప్పదు. ఇక వారం రోజుల్లో ఆఫీసు మూసేస్తున్నాము. కాబట్టి, మీరు వేరే ఉద్యోగాలు వెతుక్కోవాల్సి ఉంటుంది" అని భారమైన హృదయంతో అన్నాను.

## జరిగిన కథ

ఆస్కార్ అవార్డుల పోటీల్లో అతడి చిత్రం ఎంపికయిన సందర్భంగా అమెరికా వెళుతూ, గతం గుర్తుచేసుకున్నాడు ఆ తెలుగు దర్శకుడు. డీసీపీ పుష్పాకిరణ్ సహకారం వల్ల సినిమా నిర్మాణ సిద్ధమవుతాడు. హీరోయిన్ శ్రావణిని ప్రేమిస్తాడు. తనకి అత్యంత ఆప్తుడైన నవీన్‌ని సినిమా నుంచి పక్కకు తప్పిస్తాడు. ఆ తరువాత తన గతాన్ని చెప్పి, దర్శకుడికి దూరంగా వెళ్ళిపోతుంది శ్రావణి. తన ఇంట్లో హార్డ్‌డిస్క్ దొంగిలించిందన్న నెపంతో శ్రావణిని అరెస్ట్ చేస్తారు. దీనంతటికీ కారణమైన స్నేక్‌గ్యాంగ్‌ను అరెస్టు చేయటం, డీసీపీ మేడం శ్రావణికి బెయిల్ ఇచ్చి, డైరెక్టర్ ఇంటికి తీసుకురావటం... అన్నీ చకచకా జరిగిపోతాయి. శ్రావణికి నరకం చూపించినవారిని ఊరికే వదలకూడదనుకుంటాడు దర్శకుడు. ఆమెని పెళ్ళి చేసుకోవాలనుకుంటాడు. ఈలోపు దర్శకుడి ఆఫీసుపై ఐటీ రైడ్ జరుగుతుంది. దర్శకుడు ఆ విషయం తెలుసుకుని, హార్డ్‌డిస్క్‌ను జాగ్రత్త చేస్తాడు. ఐటీవో ద్వారా రైడ్ చేయమన్నదెవరో తెలుసుకుంటాడు దర్శకుడు.

ఆ తర్వాత.....

వాళ్ళ ముఖాలు మాడిపోయాయి.

అభిషేకం గారయితే కన్నీళ్ళు పెట్టుకున్నారు.

"సార్! తదుపరి సినిమా ప్లాన్ చేయడం లేదా?" అని ఒకరు అడిగారు. నేను తల అడ్డంగా ఊపాను.

అభిషేకం గారు లేచి నిలబడి, కళ్ళు తుడుచుకుంటూ,

"సార్! మీకు నేను ద్రోహం చేశాను. శ్రావణి మేడమ్ మీకు ఎంతో కావలసినవారని తెలిసి కూడా నేనే ప్రొడ్యూసర్ గారిని పిలిచి ఆమెను జైలు పాలు చేశాను. నన్ను క్షమించండి సార్! నన్నేదో దయ్యం ఆవహించినట్టయింది సార్ ఆ క్షణాన. మీ ఇద్దరినీ కలిసి జీవించమని చెప్పిన నేనే అలా ఎందుకు ప్రవర్తించానో నాకే అర్థం కావడం లేదు. అందరూ నన్ను వెర్రివాడని అనడం నిజమే కావొచ్చు సార్! కానీ, నా శేషజీవితంలో మీ వంటి మంచి వ్యక్తి స్నేహం కోల్పోతున్నందుకు బాధగా ఉంది సార్!" అన్నాడు.

నేను లేచి అతన్ని కౌగలించుకుని, "అదేం లేదు" అన్నాను.

"ఇంకో విషయం. ఇవ్వాళ జరిగిన ఐటీ దాడి వెనుక ఎవరున్నారో నాకు తెలుసు. కానీ, మీకు చెప్పలేను. రైడ్ సమయంలో మీరంతా కూడా చాలా కో ఆపరేట్ చేశారు. అందుకే, మళ్ళీ ఉద్యోగం దొరికే వరకు మీకు ఆసరాగా ఉంటుందని, మీ అందరి బ్యాంక్ అకౌంట్లలోకి మూడు నెలల జీతం ట్రాన్స్‌ఫర్ చేస్తున్నాను. మీ అందరికీ ధన్యవాదాలు! సినిమా రిలీజ్ అయినప్పుడు అందరికీ టికెట్లు పంపుతాను. తప్పక చూడండి." అని కూర్చున్నాను.

మూడు నెలల జీతం కన్నా, వాళ్ళు పనిచేసిన సినిమాకు వారిని ఆహ్వానించడం అనే విషయం వారి హృదయాలను తాకింది. ఇద్దరు ముగ్గురు కన్నీళ్ళు పెట్టుకుని, నాతో కరచాలనం చేసి బయటకు నడిచారు.

మళ్ళీ ఆఫీసులో అకౌంట్స్ ముందేసుకుని కూర్చున్నాను.

బ్యాంకులో క్యాష్ బ్యాలెన్స్ ఎంతుందో ఒక పేపర్ మీద రాసుకున్నాను.

ఉద్యోగులందరికీ జీతాలు ఆన్‌లైన్లో ట్రాన్స్‌ఫర్ చేశాను. ఆ మొత్తాన్ని, ఫైనన్స్ చేశాను.

సినిమా మొదలుపెట్టే ముందే, మేడం సమక్షంలో రాసుకున్న అగ్రిమెంటులో, సినిమాకు నేను అందిస్తున్న 'కథ, మాటలు, స్క్రీన్‌ప్లే, దర్శకత్వానికి గాను, రెమ్యునరేషన్ ఎంతో రాసుకున్నాము. నేను, ఆ డబ్బు ఇంతవరకూ టచ్ చేయలేదు, ఏదో ఖర్చులకు తప్ప. నేను తీసుకున్న డబ్బులు పోను మిగిలిన రెమ్యునరేషన్ మొత్తాన్ని, బ్యానర్ బ్యాంక్ అకౌంట్ నుండి నా పర్సనల్ బ్యాంక్ అకౌంటుకు ట్రాన్స్‌ఫర్ చేశాను.

రెంటుకు తీసుకున్న అపార్ట్‌మెంట్‌లోనే ఆఫీసు ఉంది. ఈ నెల వరకు రెంటు కట్టేశాను. వాళ్ళ దగ్గర మూడు నెలల రెంటు అడ్వాన్సుగా ఉంది. కాబట్టి, వాళ్ళను పిలిచి మూడు నెలల తర్వాత, వెకేట్ చేస్తున్నామని చెప్పేశాను.

పోస్ట్ ప్రొడక్షన్ పనులకుగాను డబ్బింగ్ స్టూడియోకు, డబ్బింగ్ ఆర్టిస్టులకు, డీఐ స్టూడియోకు, ఎడిటింగ్ స్టూడియోకు, సౌండ్ ఇంజనీరుకు, డీటీయస్‌కు, నేపథ్య సంగీతానికి ఇలా ఎవరికి ఇవ్వాల్సిన డబ్బులన్నీ వారికి ట్రాన్స్‌ఫర్ చేసేశాను.

ఇవి కాక, భవిష్యత్తులో సినిమా రిలీజ్ అయ్యే వరకు ప్రభుత్వానికి, పబ్లిసిటీకి, పీఆర్వోకు, క్యూబ్, యూఎఫ్ఓ లకు కట్టాల్సిన డబ్బులన్నీ, నాకు తెలిసినంతవరకు ఊహించి, ఆ మొత్తానికి ఇంకో లక్ష రూపాయల వరకు మిసిల్లేనియస్ ఖర్చులకు గాను కలిపి క్యాష్ రూపంలో డ్రా చేసి పెట్టుకున్నాను.

ఈ హడావుడి అంతా అభిషేకం గారు విస్తుపోతూ చూస్తుండిపోయాడు. కానీ, ఆయనకు అంతకు ముందు నా దగ్గరున్న చనువు కోల్పోయాడు కాబట్టి, ధైర్యం చేసి అడగలేక పోతున్నాడు. స్టాఫ్‌లో చాలామంది సంతోషంగా వెళ్ళిపోయారు. అభిషేకం గారు, నా పర్సనల్ అసిస్టెంట్లు, కొత్తగా చేరిన అసిస్టెంట్ డైరెక్టర్ మాత్రం మిగిలి పోయారు.

నేను అందరికీ డబ్బులు పంచేసరికి రాత్రి ఎనిమిది గంటలయింది. నేను, అందరినీ వెళ్ళిపొమ్మని చెప్పాను.

అభిషేకం గారు వెళ్ళలేక వెళ్తూ, గద్గద స్వరంతో,

"ఏమైంది సార్? అందరికీ లెక్కలు కట్టేసి పంపిస్తున్నారు?" అన్నాడు.

ఈ ఐటీ రైడ్ వెనుక ఎవరున్నారో చెప్పేద్దామా అనిపించింది. కానీ, నా మనసును అదుపులో పెట్టుకున్నాను. మాట నా నోటి నుండి జారిన మరుక్షణం ఎక్కడికి ప్రయాణం చేస్తుందో, మళ్ళీ ఏ సమస్య ముంచుకొస్తుందోనని నోరు కట్టేసుకున్నాను.

నేను నవ్వి ఊరుకున్నాను.

"సరే సార్! మీ నమ్మకం కోల్పోయాను. నేపాసా. గుడ్‌నైట్ సార్" అంటూ వెళ్ళబోతుంటే, "అదేంటో చెప్పండీ! చివరి 'సా' అంటే మాత్రం 'సార్' అని ఊహిం



చాను” అన్నాను.

“నేను పాపాత్ముణ్ణి సార్!” అంటూ వెళ్ళిపోయాడు.

అందరూ వెళ్ళిపోయిన తర్వాత, నేనొక్కడినే ఆఫీసులో కూర్చుని, ఐటీవో గారు చెప్పినట్టుగా, సినిమా నిర్మాణానికి, కొబ్బరికాయ కొట్టినప్పటి నుంచీ, ఇంకా అంతకు ముందు నుంచీ పెట్టిన ఖర్చులన్నీ అప్ టు డేట్‌గా రాసిపెట్టాను. బ్యానర్ అకౌంట్లు బ్యాంక్ అకౌంట్లు రీకన్సైల్ చేసి, లేచి ఒళ్ళు విరుచుకునేసరికి రాత్రి రెండయింది.

ఏకాగ్రతతో పని చేసుకుంటున్నా, ‘మా ఆఫీసు మీద రైడ్ చేయడానికి కంప్లయింట్ మా ప్రొడ్యూసర్‌గారే ఇచ్చారని’ ఐటీవో గారు చెప్పిన మాటలే నా మనసులో గుచ్చుకుంటున్నాయి. ఆయనకు నా ప్రవర్తన నచ్చింది కాబట్టి ‘సోర్స్ చెప్పకూడదనే’ తన వృత్తిధర్మానికి విరుద్ధంగా ఆయన ఆ రహస్యాన్ని నాకు చెప్పారు.

ఆ మాటలు విన్నప్పుడు నాకు నిజంగా మూర్ఛపోయినంత పనయింది. ఒక వ్యక్తి తన కంపెనీ మీదనే ఇన్‌కంటాక్స్ దాడి చేయించడం అనేది చాలా విడ్డూరంగా అన్పించింది. నిజానికి ఈ రైడ్ మూలంగా ఏవైనా అవకతవకలు బయట పడితే మా ప్రొడ్యూసరే బాధ్యుడవుతాడన్న విషయం తెలిసి కూడా ఇలాంటి నీచమైన పనికి పూనుకున్నాడంటే, దానికి కారణమేమిటో నాకు అర్థం కాలేదు.

అందుకే లెక్కలన్నీ క్లియర్ చేశాను. ఇంతటి నీచానికి ఒడిగట్టినవాడు, ఈ ప్లాన్ ఫెయిలయింది కాబట్టి, రేపు మరొక పన్నాగం పన్నడని నమ్మకం లేదు కాబట్టి నా వరకు నా బాధ్యతలన్నీ పూర్తి చేశాను.

కళ్ళు మూతలు పడుతున్నాయి.

ఇంతలో, ఫోన్‌లో నుండి ‘బీప్’ సౌండ్ వచ్చింది. ఏదో మెసేజ్. ‘ఏమిటా?’ అని చూసేసరికి నా బ్యాంక్ అకౌంట్లో డబ్బులు జమ అయినట్టు ఇంటిమేషన్.

నా అకౌంట్‌లో ఇప్పుడు లక్షల రూపాయలున్నాయి. ఒకపక్క అందుకు మనసులో సంతోషంగా ఉన్నా, ఎందుకో మరొక పక్క మనసు భారంగా కూడా ఉంది.

ఈ రోజు వరకు ఇది నా స్వంత కంపెనీ అనుకున్నాను. నేనూ, బ్యానరూ వేరు వేరు అనుకోలేదు. కాబట్టే, ఇంత వరకు నేను నా రెమ్యునరేషన్ తీసుకోలేదు. కానీ, ఇప్పుడు ఆ కంపెనీలో పనిచేసే ఒక ఉద్యోగిగా జీతం తీసుకెళ్ళే పరిస్థితి రావడంతో నన్ను, నా సినిమా నుండి దూరం చేసిన భావం కలుగుతోంది. నిర్మాత చేసిన కుతంత్రపు పనితో తల్లి నుండి బిడ్డను వేరు చేసినట్టుగా, నన్ను తల్లి లాంటి నా బ్యానర్ నుండి వేరుచేసిన ఫీలింగ్ కలుగుతుంది. అంటే, ఇది నా సినిమా కాదన్నమాట. నా సినిమాపై హక్కులన్నీ నిర్మాతవే నన్నమాట.

ప్రొడ్యూసర్, ఈ కంపెనీ పెట్టిన దగ్గరనుంచీ ఏ ఒక్క బాధ్యతా చేపట్టలేదు. ఒక్కరోజూ ఆఫీసులో ఒక గంట కూడా కూర్చోలేదు.

ఈ సినిమా నా బిడ్డలాంటిది. నా ఆలోచనల నుండి రూపుదిద్దుకున్న, నా ఊహలకు అనుగుణంగా ప్రాణం పోసుకున్న బిడ్డలాంటిది. బిడ్డను దూరం చేసినప్పుడు తల్లికి కలిగే బాధలాంటి బాధ కలిగింది నాకు. కానీ, ఇప్పుడు నాకేం సంబంధం లేదన్నట్టుగా ప్రొడ్యూసర్ కుట్రపూరితంగా పన్నాగం పన్నడంతో, నా మనసు విరిగి పోయింది.

తల పగిలిపోతోంది. కణతలు నొక్కుకుంటూ కూర్చున్నాను. కళ్ళముందు ‘శ్రీరాం సర్’ ప్రత్యక్షమయ్యారు. మనసును గుచ్చుతున్న సమస్యలన్నీ, గాలి వీచినప్పుడు తొలగిపోయిన మేఘాల్లా మాయమయ్యాయి.

జరగాల్సింది జరగక మానదని మనసుకు ఎవరో బోధించినట్టయింది.

బ్యాంకులో జమయిన డబ్బుల నుండి శ్రావణికి, అమ్మకు మంచి నగలు చేయించాలని; అమ్మానాన్నలకు, శ్రావణికి చెరో కారు కొనివ్వాలని నిశ్చయించుకున్నాను.

కారు విషయం గుర్తుకు రాగానే, ప్రొడ్యూసర్ కొన్న ‘ఆడి’ కారు యజమాని ఎవరా? అన్న అనుమానమొచ్చి ఆర్ సీ చెక్ చేశాను. నా పేరు మీదే ఉంది. అంటే సినిమా అయిపోయిన తర్వాత కూడా కారు నాదే.

‘గుడ్’ అనుకుని అలాగే టేబుల్ మీద తల వాల్చి నిద్రపోయాను.

***

పొద్దున్నే ఆరింటి నుంచి 2017 సంవత్సరానికిగాను హాలీవుడ్‌లోని డాల్బీ థియేటర్లో జరుగుతున్న ‘ఆస్కార్’ అవార్డుల ప్రదానోత్సవ లైవ్ టెలికాస్ట్ చూస్తూ కూర్చున్నాను.

**రైడ్ చేసి వెళ్తూవెళ్తూ ఐటీవో చెప్పిన విషయం విని అతని మైండ్ బ్లాంక్ అయింది. ప్రయారిటీలు మారి పోయాయి. అర్జంటుగా ఒక హోటల్లో వర్కింగ్ లంచ్ మీటింగ్ ఏర్పాటు చేశాడు డైరెక్టర్. స్టాఫ్ అందరికీ ఇక మీరు రానవసరం లేదని చెప్పాడు. అసలేం జరిగింది? ఐటీవో ఏంచెప్పాడు?**

సినిమారంగంలోని 24 క్రాఫ్టులలో ఏదో ఒక క్రాఫ్టులో పనిచేస్తున్న ప్రతీ ఒక్కరికీ ‘మక్కా’ లాంటిది హాలీవుడ్. హాలీవుడ్‌లో పనిచేసే నటీనటులకు, దర్శకులకు, సాంకేతిక నిపుణులకు ఒకే ఒక్క జీవితాశయం, ‘ఆస్కార్’ సంపాదించడం. అందుకే, ఆస్కార్ అవార్డులంటే ప్రపంచమంతా ఆసక్తిగా ఎదురుచూస్తుంది. అక్కడ విజేతలకు జరిగే పట్టాభిషేకం అంగరంగవైభోగంగా జరుగుతుంది.

నేను కూడా అదే ఉత్సాహంతో చూస్తూ కూర్చున్నాను. కానీ, నా దృష్టంతా ‘ఫారిన్ లాంగ్వేజ్ కేటగిరి’ సినిమాల పైనే ఉంది.

భారతదేశం నుండి ‘విసారణై’ అనే తమిళ చిత్రం, ఈ కేటగిరిలో ఎంపికయింది. కానీ, ఫైనల్‌గా నామినేట్ అయిన ఐదు చిత్రాల్లో అది లేదు.

ఇప్పటివరకు ఈ కేటగిరిలో నామినేట్ అయిన ఫైనల్ లిస్టులో కేవలం నాలుగు సినిమాలు మాత్రమే మన సినిమాలు ఉన్నాయి. అవి ‘మదర్ ఇండియా (1957)’; ‘సలాం బాంబే (1988)’; ‘లగాన్ (2001)’; ‘వాటర్ (2006)’. కానీ, ఒక్కటి కూడా అవార్డు గెలుచుకోలేదు.

2017 సంవత్సరానికి ‘ఫారిన్ లాంగ్వేజ్ కేటగిరి’లో ఇరానియన్ ఫిల్మ్ ‘ది సేల్స్‌మాన్’కు ఆస్కార్ లభించింది. అయితే, ఆ సినిమా దర్శకుడు ‘అస్ఘర్ ఆఫ్రిది’, ఈ అవార్డుల ప్రదానోత్సవాన్ని, జాత్యహంకార ఇమ్మిగ్రేషన్ విధానాలను నిరసిస్తూ, బహిష్కరించాడు. ఆయన తరఫున ఆ అవార్డును మరెవరో స్వీకరిస్తూ అతని తరఫున ఓ సందేశం చదివి వినిపించారు.

ఈ సంవత్సరం ఆ అవార్డుకు పోటీపడినవారు ఎవరైనా వచ్చే సంవత్సరం నా సినిమా ఆ దశకు చేరుకోవాలనే కాంక్ష నాలో చాలా తీవ్రంగా ఉంది. నాలాగే లక్షలాది మంది అదే కాంక్షతో అందుకోసమే కృషి చేస్తుంటారు.

ఎంతో పకడ్బందీగా జరుగుతాయనుకున్న అకాడమీ అవార్డుల ఫంక్షన్‌లో కూడా చివరకు గందరగోళం జరిగింది. ‘మూన్‌లైట్’ అనే చిత్రం ‘బెస్ట్ ఫిలిం’గా ఎంపికయితే, వ్యాఖ్యాత పొరపాటున ‘లా లా ల్యాండ్’ అనే సినిమా పేరును అనౌన్స్ చేశాడు. ‘లా లా ల్యాండ్’ సినిమా నిర్మాత యాక్సెప్టెన్స్ స్పీచ్ కూడా అయిపోయిన తర్వాత తప్పు తెలుసుకుని ‘మూన్‌లైట్’ చిత్రాన్ని అనౌన్స్ చేశారు. వాళ్ళ కళ్ళల్లో ముందు కన్పించిన విస్మయం,



తర్వాత అనూహ్యమైన ఆనందం, తర్వాత వాళ్ళ కళ్ళల్లో నిలిచిన కన్నీటిని చూసి నాక్కూడా బాధ కలిగింది.

అవార్డుల ప్రదానం అయిపోయేసరికి పది గంటలయింది. పోలీస్ స్టేషన్‌కు వెళ్ళడానికి సిద్ధం కావాలనుకుని లేచాను.

పోలీస్ స్టేషన్‌కు వెళ్ళి ఏం చేయాలో నిర్ణయించుకోలేదు. కానీ, వెళ్ళాలి. వెళ్ళి శ్రావణి మీద అంత ఘోరమైన అత్యాచారానికి కారణమైన వాణ్ణి ముఖాముఖి చూడాలి. చూసి వాడి ముఖం మీద ఉమ్మేయాలి. ఆ సంఘటన గుర్తొచ్చినప్పుడల్లా రక్తం సలసలా మరుగుతోంది.

వాడు అనామకుడేమీ కాదు. విజయవంతమైన సినిమాలు తీసిన దర్శకుడే. వేదికలెక్కి నీతులు బోధించిన వాడే.

ఈ మధ్య కొంతమంది డైరెక్టర్లు ఒక కొత్త ట్రెండు మొదలుపెట్టారు. వాళ్ళు డైరెక్ట్ చేసే సినిమాలకు ఐదు నుంచి పది పన్నెండు కోట్లు రెమ్యునరేషన్ తీసుకుని పెద్ద హీరోలతో భారీ బడ్జెట్ సినిమాలు తీస్తారు. హిట్ కొడితే నిర్మాత సేఫ్. సినిమా హిట్ కాక ఫట్ అయితే నిర్మాత మునుగుతాడు. కానీ, డైరెక్టర్ మాత్రం ముందుగా ముట్టిన కోట్లతో సేఫ్‌గా ఉంటాడు.

ఇట్లాంటి డైరెక్టర్లు సొంతంగా ప్రొడక్షన్ కంపెనీలు పెట్టుకుని సొంత బ్యానర్ల మీద చిన్న బడ్జెట్ సినిమాలు తీస్తున్నారు. ఈ చిన్న సినిమాల్లో ఒక్కోసారి బూతు, విచ్చలవిడి విశృంఖలత్వం ప్రదర్శించే 'కుమారి'లను చూపించి సక్సెస్ కొడతారు.

ఒక్కోసారి కొన్ని మంచి సినిమాలు కూడా తీస్తారు. మంచి సినిమాలు తీసినప్పుడు మాత్రం బోలెడన్ని ఆదర్శాలు, నీతులు వల్లిస్తారు. ప్రెస్, ఛానళ్లలో వాళ్ళకున్న అవినాభావ సంబంధాలను బట్టి ఆ సినిమా గురించి ఊదరగొడ్తారు. సినిమాలో మానవత్వ విలువలున్నాయని, కళామతల్లికి నీరాజనమని కొంతమంది పెయిడ్ మేధావులకు పురమాయించి, వాగిస్తుంటారు. దాంతో ఆ సినిమా ఓ మాదిరిగా సక్సెస్ అయి కూర్చుంటుంది. ఇక ఈ మేధావి దర్శకులకు అరచేతిలో దురదలు మొదలవుతాయి. తమ సినిమాకు అవార్డులూ, రివార్డులూ కొట్టేసే ప్రయత్నంలో పడతారు.

అవార్డుల కమిటీలో ఉండే తస్మదీయులకు రహస్య సందేశాలు వెళతాయి. జ్యూరీలు, స్క్రీనింగులు అంతా ఒక పెద్ద ఫార్సు. ఓ నెల రోజులు, మరో ఏ పనీ లేని మెంబర్లు సినిమాలు చూస్తారు. షూటింగుల్లో బిజీగా ఉన్న నటీనటులు, డైరెక్టర్లు అసలు పోటీకి వచ్చిన సినిమాలను చూడనే చూడరు. చివరికి ప్రతీ జ్యూరీ మెంబరుకు సీక్రెట్ కవరులో, ప్రతీ కేటగిరీకి ఐదు పేర్లు ఇవ్వమని ఆజ్ఞలు వస్తాయి. ఒక జ్యూరీ మెంబర్ ఎంచుకున్న వారి గురించి ఇంకొకరికి తెలియదు. మొత్తం లిస్టులన్నీ సినీ పొలిటీషియన్ల దగ్గరకు చేరుతాయి. అక్కడ మనవాళ్ళు ఎవరు, పరాయి వాళ్ళు ఎవరన్న విషయాల ఆధారంగా అవార్డుల పందేరం జరుగుతుంది. ప్రతిసారీ, అవార్డులు అనౌన్స్ కాగానే, అందుకే గొడవలు జరుగుతాయి. అధికారంలో ఉన్నవారికి అనుకూలంగా ఉన్నవారికే అవార్డులు తప్ప, సినిమా గుణగణాల మీద ఆధారపడి అవార్డులుండవు.

అటువంటప్పుడు, అవార్డులు పొందడం సులభం కాబట్టి, మన డైరెక్టర్లు కూడా ఆశ పడతారు. అందుకు తగిన ప్రయత్నాలు చాలా ముందు నుంచే మొదలు పెడతారు.

అట్లాంటి ఒక దర్శకుడు సొంత బ్యానర్ మీద తీసిన సినిమా ఈ మధ్య మంచి పేరు తెచ్చుకుంది. ఆ సినిమాలో గొప్ప మానవతా విలువలున్నాయనీ, నవతరం ఆశయాలు చెప్పానని, ఆ సినిమా అన్ని విధాలా ఈ సంవత్సరం జాతీయ అవార్డు గెలుచుకుంటుందనీ ఏదో ఒక పత్రిక రాసేసరికి ఆ దర్శక నిర్మాతలు ఇక జాతీయ అవార్డు వచ్చేసినట్టుగా భావించి, స్వర్ణకమలం పట్టుకుని ఊహల పల్లకిలో ఊరేగుతున్నారు.

ఈ మధ్య వచ్చిన ఒక సినిమాలో హీరోయిన్,

## సినీవాలి
## కూపన్ నెం.22 విజేత

**ఎం. కృష్ణ**
**కాకినాడ**

నవ్య ఈవారం సినీవాలి చదివారు కదా!
మా ప్రశ్నకు మీ జవాబు క్రింది కూపన్‌లో స్పష్టంగా రాసి
కూపన్‌ని కత్తిరించి మాకు పంపండి. లక్కీడిప్‌లో ఫ్యాన్సీ చీర గెలుచుకోండి!

## సినీవాలి-24 (29-3-2017)

మా ప్రశ్న: 2017 సంవత్సరానికి ఫారిన్ లాంగ్వేజ్ కేటగిరీలో ఏ చిత్రానికి ఆస్కార్ లభించింది?

మీ జవాబు------------------------------------

చిరునామా------------------------------------

---------------------------------------------

------------------పిన్------------------ఫోన్‌నెం------------------

ఈ కూపన్‌ను 28 మార్చి 2017 తేదీలోగా మా కార్యాలయానికి పంపగలరు.

మా చిరునామా: నవ్య వీక్లి, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం. 76, రోడ్ నెం 70, అశ్వనీ లే అవుట్, హుడా హైట్స్, జూబ్లీ హిల్స్, హైదరాబాద్-33

వివాహాది శుభకార్యాలకు కంచిపట్టు చీరల నిలయం పి.యన్.మూర్తి క్లాత్ స్టోర్స్ మెయిన్‌రోడ్, హన్మకొండ వారి సౌజన్యంతో...

*నిబంధనలు వర్తిస్తాయి

# మరో పబ్ మొదలెట్టిన బాపూ బొమ్మ

*అదేనండీ ప్రణీత. గతంలో బెంగుళూరులో ఓ హోటల్ స్టార్ట్ చేసింది అన్న సంగతి తెలిసిందే! అయితే అది హోటల్ కాదట! ఓ పబ్ అట! ఇప్పుడా పబ్ బ్రహ్మాండంగా నడుస్తుండడంతో దాని బ్రాంచిని బెంగుళూరులో తెరిచింది. ఆడపిల్ల పబ్ నడపడం ఏమిటి? అని ఆశ్చర్యపోవనవసరం లేదట! దాని సంగతి ఆమె కుటుంబ సభ్యులు చూసుకుంటున్నారట! అది లాభాల్లో నడుస్తోంది అంటే అదంతా తన కుటుంబ సభ్యుల చలవే అని చెబుతోంది.*

హీరోను పట్టుకుని 'నువ్వు వర్జిన్‌వా? నీకిదే ఫస్ట్ టైమా? నేను వర్జిన్ కాదు!' అంటూ చెప్పిన డైలాగు లకు కుర్రకారు వెర్రెక్కిపోయి, ఆ సినిమాకు క్యూలు కట్టారు.

మేధావులమనుకునే మనం, అడాలసెంట్ దశలో ఉన్న యువతకు చెప్పాల్సిన, నేర్పాల్సిన, సందేశం ఇవ్వాల్సిన విషయాలు ఇవేనా? ఇట్లాంటి సినిమాలేనా యువతను ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దేది?

ఈ తరుణంలో, నా సినిమా కూడా పూర్తి కావొచ్చింది. జాతీయస్థాయిలో అవార్డు విన్నింగ్ పిక్చర్ అని టాలీవుడ్‌లో మంచి టాక్ వచ్చింది. ఈ టాక్‌కు మా అభిషేకం గారి మౌత్ పబ్లిసిటీ కూడా తోడయింది. ఆయన ప్రతీ రోజూ ఆఫీసు తరువాత తన మిత్రబృందంతో మందు కొడుతూ, టీ తాగుతూ, ఎక్కడ శ్రోతలు దొరికితే అక్కడ మా సినిమా గురించి 'అవార్డు గ్యారంటీ సినిమా' అని ఊదరగొడుతుండడంతో; ఆ విషయం, జాతీయ అవార్డు గ్యారంటీగా తమకే అని ఫిక్స్ అయిపోయిన దర్శక నిర్మాతలకు చేరి, వారికి భయం పట్టుకుంది.

అందుకని నా సినిమాని నాశనం చేయాలని కంకణం కట్టుకున్నారంట.

అసలు ఆ వాదనలో పస లేదు. లాజిక్ లేదు. ప్రతీ సంవత్సరం ప్రతీ భాష నుండి ముప్పయ్యో నలభయ్యో సినిమాలను జాతీయ అవార్డుల పోటీకి పంపిస్తారు. మనం ఇక్కడ హైదరాబాదులో కూర్చుని, మన సినిమా చాలా గొప్పదని ఎంత చంకలు కొట్టుకున్నా, అస్మదీయులు పేపర్లలో, ఛానళ్ళలో డబ్బా వాయించుకున్నా, జాతీయ స్థాయిలో ప్రిలిమినరీ వడపోతలోనే మన సినిమా ఔట్ అయిపోవచ్చును. ఎన్ని సినిమాలు పోటీకి వచ్చినా అందులో నుంచి మూడింటిని మాత్రమే రీజనల్ లాంగ్వేజ్ జ్యూరీ ఎంపిక చేస్తుంది. అలా ఎంపిక చేసిన సినిమాలనే ఫైనల్ జ్యూరీ చూస్తుంది. నేషనల్ అవార్డుకు ఇంత తతంగం ఉన్నప్పుడు, నా ఒక్క సినిమా, అదీ ఇంకా పూర్తి కాలేదు, సెన్సారు కూడా కాలేదు, దాన్ని సబొటేజ్ చేస్తే కలిగే ప్రయోజనం ఏమిటో అర్థం కావడం లేదు. అసలు ఇంకా సంవత్సరం మొదట్లోనే ఉన్నాము, ఇంకా డిసెంబరు వరకు ఎన్నో సినిమాలు తయారవుతాయి. వాటన్నింటినీ పోటీకి పంపకుండా ఆపగలరా?

అందుకే, శ్రావణి మీద దాడికి, అవార్డు సినిమాను నాశనం చేయడమనే కారణం లాజిక్‌కు అందడం లేదు. ఈ మొత్తం ఎపిసోడ్‌లో నవీన్ పాత్ర ఏమిటో అర్థమైతేనే చిక్కుముడి విడిపోతుంది.

సినిమారంగానికి, రాజకీయనాయకులకు, పోలీసులకు, గూండాలకు అవినాభావ సంబంధాలుంటాయి. రాజకీయ నాయకులకేమో అన్యాయంగా కుప్పతెప్పలుగా సంపాదించిన వాళ్ళ నల్లధనం పెట్టుబడి పెట్టడానికి సినిమా రంగాన్ని మించిన సేఫ్ ఇన్వెస్ట్‌మెంట్ మరొకటి లేదు. ఎవరో ఒక ఏకదంతుణ్ణి అడ్డం పెట్టుకుని పెట్టుబడి పెట్టేస్తారు. రాజకీయనాయకుల వెంబడే వాళ్ళ అనుంగు భక్తులైన పోలీసులు, గూండాలు కూడా సినిమా వాళ్ళకి ఆత్మీయులై పోతారు. అందుకే, రాజకీయనాయకులు ఒక్కోసారి తమ మాట వినని హీరోల గుండు కొట్టిస్తారు కూడా.

అసలు, ఈ నాలుగు రంగాలకూ మొగుడు లాంటి ఎలక్ట్రానిక్ మీడియా, ప్రెస్ కూడా సినిమా విషయానికి వచ్చేసరికి చాలా జాగ్రత్తగా వ్యవహరిస్తుంది.

సాధారణ ప్రజల ప్రైవేటు జీవితాల్లోకి నిస్సిగ్గుగా చొచ్చుకుని పోయి, వ్యక్తిగత విషయాల మీద కూడా వాళ్ళను నిగ్గదీసే మీడియా, చిన్న చిన్న నటులు, డైరెక్టర్లు, నిర్మాతలు, కళాకారుల జీవితాలతో ఆడుకునే మీడియా పెద్ద పెద్ద హీరో, హీరోయిన్ల, డైరెక్టర్ల, నిర్మాతల గురించి మాత్రం ఒళ్ళు దగ్గర పెట్టుకుని స్టోరీలు రాస్తుంది.

లేకుంటే, టాలీవుడ్‌లో జరిగే ఎన్నో ఘోరాలు మూడో కంటికి తెలియకుండా ఎలా కాలగర్భంలో కలిసిపోతున్నాయి? ఎందుకంటే, సినిమాల వల్ల వచ్చే యాడ్ రెవెన్యూ రాకపోతే ఛానల్స్, పత్రికలు మూతపడతాయి.

అన్నీ కుమ్మక్కయ్యాయి కాబట్టే, అందరూ కుమ్మక్కయ్యారు కాబట్టే సీసీటీవీల సాక్షిగా ఒక ఏడు నక్షత్రాల హోటల్లో ఒక ప్రముఖ డైరెక్టర్, ఒక టాప్ హీరోయిన్‌తో టాప్‌లెస్ భంగిమలో ఉండగా, అతని భార్య వచ్చి హీరోయిన్‌ని చెప్పుతో కొట్టిన సంఘటన గురించి ఎవరికీ తెలియదు.

ఒక ప్రముఖ డైరెక్టర్, ఒక ప్రముఖ హీరోయిన్ అక్కను పక్కలోకి రమ్మంటే, ఆమెను ఏదో మాయోపాయం చేసి లొంగదీసుకుంటే ఆ హీరోయిన్ మొగుడు ఒక ప్రముఖ హీరో, అందరి ముందూ ఆ డైరెక్టరును, అతని ఇంట్లోనే తన్నిన సంగతి బయటకు రాదు. ఈ సంగతి తెలిసి మరొక ప్రముఖ హీరో 'తన్నడంలో తప్పులేదు గానీ, నలుగురిలో కాకుండా రూములోకి తీసుకెళ్ళి తంతే బాగుండేది. ఇప్పుడు ఆయన పరువు పోయింది కదా!' అని ఇచ్చిన సలహా ప్రజలకు తెలియదు.

ఇవన్నీ వ్యక్తిగత విషయాలే. ప్రజలకు తెలియాల్సిన అవసరం లేదు. కానీ, ఎవడో ఒకడు అక్రమ సంబంధం పెట్టుకుంటే, అర్ధరాత్రి అనీ, అపరాత్రి అనీ చూడకుండా కెమెరాలు, మైకులు పట్టుకుని లైవ్ రిలేలు చేస్తూ, వాళ్ళూ వాళ్ళూ జుట్లు పట్టుకొని తన్నుకుంటుంటే రాక్షసానందం పొందే ఛానల్స్ సినిమా విషయాలు కూడా ప్రసారం చేయాలి. ఒకచోట స్వీయ నియంత్రణ పాటించడం మరొక చోట అదే నియంత్రణకు నీళ్ళొదలడం ఎంతవరకు సమంజసం?

అందుకే, డీసీపీ మేడం ఎంతో శ్రమ పడి కేసు చేదించి, పట్టుబట్టి అరెస్ట్ చేయించిన ఆ డైరెక్టర్ పైన ఇంకా ఎఫ్.ఐ.ఆర్ రాయలేదు. కేసు బుక్ చేయలేదు. అతన్ని వదిలేయమని పెద్ద ఎత్తున పైరవీలు మొదలయ్యాయి. ఎందుకంటే, ఆ డైరెక్టర్ ఒక భారీ బడ్జెట్ సినిమాకు దర్శకత్వం వహిస్తున్నాడు. ఈ సమయంలో డైరెక్టర్ పోయి జైల్లో కూర్చుంటే అప్పటికే ఆ సినిమా మీద పెట్టిన కోట్ల రూపాయల పెట్టుబడి హుష్‌కాకి అయిపోతుంది కాబట్టి అతను లబోదిబోమంటున్నాడు. ఆ సినిమా నిర్మాత పలుకుబడి ఉన్నవాడు కావడంతో, ఏదో ఒక విధంగా డైరెక్టర్‌ను బయటకు తీసుకు రావాలని ప్రయత్నిస్తున్నాడు.

**(ఇంకా వుంది)**

# మొబైల్‌లో పోర్న్

పోర్న్‌హబ్ తాజా పరిశోధనలో ఆశ్చర్యకర విషయాలు వెల్లడించింది. స్మార్ట్‌ఫోన్స్‌లో పోర్న్‌హబ్ వీక్షకుల్లో ఆడవాళ్లే ఎక్కువున్నారట. స్మార్ట్‌ఫోన్, టాబ్లెట్‌లో 80 శాతం మహిళలు పోర్న్‌హబ్ చూస్తుండగా, వారిలో 71 శాతం మంది స్మార్ట్ ఫోన్‌నే ఎన్నుకుంటున్నారని రీసెంట్ ఇయర్ రివ్యూ పేర్కొంది.

మగవారు ఎక్కువగా డెస్క్‌టాప్, ల్యాప్‌టాప్స్‌లోనే పోర్న్ వీడియోలు చూస్తున్నారు. ఖండాల వారీగా చూస్తే దక్షిణా ఫ్రికాదే ప్రథమ స్థానం. అక్కడ 91 శాతం మహిళలు స్మార్ట్ ఫోన్స్‌లోనే పోర్న్‌పిక్చర్లు చూస్తుండగా, అమెరికాలో 89 శాతం, బ్రిటన్, పాకిస్తాన్‌లలో 86 శాతం మహిళలు చూస్తు న్నారు.

అమెరికాలో 89 శాతం మహిళలు స్మార్ట్‌ఫోన్, టాబ్లెట్స్ ఉపయోగిస్తున్నారు. వాషింగ్టన్ డి.సి.లో 94 శాతం, టెక్సాస్‌లో 93 శాతం జార్జియా, మిచిగన్‌లలో 92 శాతం మహిళ లున్నారు.

మొత్తంగా 69 శాతం మగవారు, 80 శాతం స్త్రీలు టాబ్లెట్, స్మార్ట్‌ఫోన్లలో చూస్తున్నారట.

2017 మార్చి 8 బుధవారంనాడు అంతర్జాతీయ మహిళా దినోత్సవంనాడు మహిళా వ్యూయర్స్ సంఖ్య గణనీయంగా తగ్గిందట. ఆ రోజు మహిళా విజిటర్లు 26 శాతమే నమో దయ్యారు. అనేక సంవత్సరాలుగా పోర్న్‌హబ్ వీక్షణకు స్మార్ట్ ఫోన్‌నే ప్రిఫర్ చేస్తున్నారని పరిశోధన పేర్కొంది. ప్రపంచ వ్యాప్తంగా పోర్న్‌హబ్ కోసం స్మార్ట్‌ఫోన్, టాబ్లెట్‌లను 72



శాతం వినియోగిస్తున్నారు. 71 శాతం మహిళా యూజర్లు 'రిస్కీ క్లిప్' చూస్తున్నారట. ఏజ్ గ్రూపులవారీగా చూస్తే, 78 శాతం పోర్న్‌హబ్ విజిటర్లు 18-34 మధ్య వయసు వారే. డెస్క్‌టాప్‌పై పోర్న్‌హబ్ విజిట్ చేసేవారిలో 34 ఏళ్ళు పైబడిన మహిళలు ఎక్కువ. 55 ఏళ్ళ వయసుగల మహిళల్లో యాభైశాతం కంటే తక్కువమంది స్మార్ట్‌ఫోన్ ఉపయోగిస్తు న్నారు. 65 ఏళ్ళ వయసు గల స్త్రీలలో 49 శాతం మంది డెస్క్‌టాప్ చూస్తున్నారు. ఈ ఏజ్‌గ్రూప్‌లో 36 శాతం స్మార్ట్ ఫోన్స్‌లో 15 శాతం టాబ్లెట్‌లో చూస్తున్నారు. ఆపరేటింగ్ సిస్టమ్ ప్రకారం పోర్న్ చూసేవారిలో, 53 శాతం మహిళలు ఆండ్రాయిడ్ మొబైల్, 45 శాతం ఐఓఎస్ అభిమానులు న్నారు.

రిలేషన్‌షిప్‌లో ఉన్నవారు వీరిలో ఎక్కువ. వ్యక్తిగత మైన ఎమోషనల్ స్ట్రెస్ ఈ హబ్ చూడటానికి కారణమని తేలింది. వీటిని చూశాక కొందరు షేమ్ ఫీలవుతున్నారనీ, నిరాశకు గురవుతున్నారనీ సెల్ఫ్ పనిష్మెంట్ చేసుకుంటు న్నారనీ పరిశోధన పేర్కొంది. వారానికి 110 నిమిషాలు మగవారు చూస్తుండగా, భాగస్వామితో సెక్స్‌కు దూరమైనవారే పోర్న్‌హబ్ విజిటర్లని పేర్కొంది.






**ఋణం**
రచయిత: గొల్లపూడి మారుతీరావు
ధర: 250 రూపాయలు
పేజీలు: 288
ప్రచురణ: క్రియేటివ్‌లింక్స్ పబ్లికేషన్స్, ఫోన్: 9848065658, 8885446222, 9848506964.
ప్రతులకు: విశాలాంధ్ర, మరియు ప్రముఖ పుస్తక విక్రయ కేంద్రాలు.
online: kinige.com, telugubooks.in, logili.com, anandbooks.com

ఆచారాలు, సంప్రదాయాలు, సంస్కృతి... ఇత్యాది అంశాలను సుదీర్ఘంగా విశ్లేషిస్తూ సాగిన నవల 'ఋణం'. ప్రముఖ నటుడు, రచయిత గొల్లపూడి మారుతీరావు కలం నుంచి జాలువా రిన రచన. ప్రముఖ వారపత్రికలో సీరియల్‌గా అభిమానులను అలరించింది.అందరూ తప్పులు చేస్తారు. కానీ తప్పును తెలుసుకొని వాటిని సరి దిద్దుకోవాలనుకునేవారు, ప్రాయశ్చిత్తం చేసుకో వాలనుకునేవారు కొందరే ఉంటారు. అలా చేసిన తప్పుకి ప్రాయశ్చిత్తం చేసుకోవాలను కునే వ్యక్తి మనోభావాల, ఆలోచనల, సమ్మిళి తమే ఈ నవల. విశ్లేషణలు, మాతృభాష కమ్మ దనం, సంఘజీవన ఆవశ్యకత పాఠకులను కట్టి పడేస్తాయి. 'నాకోసం నేను కాకుండా ఒకరి కోసం ఒకరు' అనే అంశాన్ని కథావస్తువుగా తీసుకుని సాంఘిక విలువలను జోడించారు రచయిత. ఆద్యంతం ఆసక్తికరం.

**మహానగరం**
రచయిత: ఎన్. మురళీధర్
ధర: 65 రూపాయలు, పేజీలు: 120
ప్రచురణ, ప్రతులకు: మంచి పుస్తకం12-13-439, వీధి నెం. 1, తార్నాక, సికింద్రాబాద్ 500 017 ఫోన్: 94907 46614

మాయలు, మంత్రాలు, కుట్రలు, కుతం త్రాలు, చిత్రవిచిత్ర జంతు సమూహాలతో, ఉత్కంఠ భరిత సన్నివేశాలతో అద్భుతంగా తీర్చిదిద్దబ డిన జానపద నవల 'మహ నగరం'. ఈ నవల చదువు తుంటే విఠలాచార్య సినిమాలు గుర్తురాక మానవు. సన్నివేశా నికి తగిన బొమ్మలతో చిన్నపిల్ల లను కూడా ఆకట్టుకునే రీతిలో రచయిత తన కల్పనా పటి మను ప్రదర్శించారు. ఆద్యంతం ఆసక్తికరంగా సాగుతుంది.





**రోజుకో నీతి కథ**
పి. రాజేశ్వరరావు
ధర: 250 రూపాయలు
పేజీలు: 350
ప్రతులకు: నవచేతన, నవ తెలంగాణ, ప్రజాశక్తి బుక్ హౌస్‌లు మరియు రెండు తెలుగు రాష్ట్రాల్లోని ప్రముఖ పుస్తక విక్రేతలు

పిల్లలను నిద్రపుచ్చడానికి అనగనగా ఒక ఊళ్ళో... అంటూ కథ చెప్పడానికి రెడీ అయిపో తారు అమ్మమ్మలు, తాతయ్యలు. ఇదంతా ఒకప్పటి సంగతి. మరి నేడు? కథలు చెప్పడా నికి తల్లిదండ్రులకు తీరికెక్కడిది? ఉమ్మడి కుటుంబాలెక్కడివి? అలాంటి వారికోసమే ఈ పుస్తకం. రోజుకో కథ చొప్పున సంవత్సరమంతా చదువుకునేలా 365 నీతికథలను మనకందిం చారు రచయిత. పుస్తక పఠనం గగనమైపో తున్న ఈ రోజుల్లో పిల్లలకోసం, ప్రత్యేకంగా నీతికథ ప్రధానాంశంగా పుస్తకం రావడం ముదావహం. వినోదం, చమత్కారం మిళిత మైన కథలు అక్కడక్కడ బొమ్మలతో పిల్లలు, పెద్దలు అందరినీ ఆకట్టుకునేలా తీర్చిదిద్దారు ఈ మంచి నీతిపుస్తకాన్ని.

**గణితంతో వినోదం**
మూల రచయిత: యాకొవ్ పెరెల్మాన్
అనువాదం: పి. రాజేశ్వరరావు
ధర: 80 రూపాయలు
పేజీలు: 118
ప్రతులకు: నవచేతన, నవతెలంగాణ, ప్రజాశక్తి బుక్‌హౌస్‌లు మరియు రెండు తెలుగు రాష్ట్రా ల్లోని ప్రముఖ పుస్తక విక్రేతలు

పాఠకుల మెదళ్ళకు చక్కని మేత 'గణి తంలో వినోదం'. లెక్కలంటే భయపడేవారు తప్పక చదవాల్సిన పుస్తకమిది. విద్యార్థులతో పాటు ఉపాధ్యాయులకు కూడా ఉపయోగకరం. వివిధ గణిత సమస్యలను సులువుగా ఎలా చేయవచ్చో వివ రించారు. ఆడుతూ పాడుతూ లెక్కలను ఎలా చేయాలో తెలియజే స్తుందీ పుస్తకం. మొత్తం 135 సమస్యలు పాఠకుల జ్ఞాపకశ క్తిని, గణితంపై ఆసక్తిని కలి గిస్తాయి.



– లక్ష్మీనర్మద




# యాభై లక్షలు

**'బాస్, ఈ కేసు నువ్వే టేకప్ చేయాలి. నేను డెడ్ ఎండ్‌కు చేరుకున్నాను' డిటెక్టివ్ శరత్ ముందు కుర్చీలో కూలబడి నిస్పృహగా అన్నాడు అసిస్టెంట్ రాము.**

**'ఏం కేసు?' అడిగాడు శరత్.**

**'సుమ హత్య కేసు'**

23 ఏళ్ళ యువతి సుమ హత్యకేసు శరత్‌కు గుర్తు వచ్చింది. ఆమె ఒంటరి. తల్లిదండ్రులను ఎదిరించి, విశ్వాస్ అనే యువకుడితో సహజీవనం చేసింది. రెండేళ్ళ తర్వాత భేదాభిప్రాయాలు వచ్చాయి. వాళ్ళు విడిపోయారు. అప్పటినుండీ ఒంటరిగా ఉంటోంది సుమ. ఆమె, విశ్వాస్ ఒకే ఆఫీసులో పని చేస్తారు.

అడ్వర్టైజ్‌మెంట్ కంపెనీలో సుమ ఎగ్జిక్యూటివ్ జాబ్ చేస్తోంది. రెండు రోజులుగా ఆఫీసుకి రాలేదు. ఫోను ఎత్తలేదు. దాంతో ఆఫీసు వాళ్ళు విషయం తెలుసుకోమని విశ్వాస్‌ను, మరో కొలీగ్‌ను పంపించారు.

ఆమె ఇంటి తలుపులు దగ్గరకు వేసివున్నాయి. తలుపులు తోసి లోపలకు వెళ్ళారు. బెడ్‌రూమ్‌లో దుప్పటి కప్పుకుని ఉంది సుమ. ఆమెను లేపేందుకు ప్రయత్నించారు. ఆమె మరణించిందని గ్రహించి ఆఫీసులో చెప్పారు. పోలీసులను పిలిచారు.

అమ్మాయిని గొంతు నులిమి చంపేశారని పోస్ట్‌మార్టమ్ రిపోర్ట్‌లో తెలిసింది. హత్య జరిగి 48 గంటలు దాటి ఉంటుందని అంచనా వేశారు. వేలిముద్రల ద్వారా ఏమీ తేలలేదు.

ఆమెతో సహజీవనం చేసిన విశ్వాస్‌ని ప్రశ్నించారు. కానీ అతన్ని అనుమానించేందుకు ఎలాంటి ఆధారాలు దొరకలేదు.

కేసును పరిశోధించే బాధ్యత రాముకి అప్పగించారు. కానీ రాము ఇప్పుడు తన వల్ల కావటం లేదని శరత్ దగ్గరకు వచ్చాడు.

పోలీసు పరిశోధన, రాము పరిశోధనా నివేదికలూ చూశాడు శరత్.

'మీ ఇద్దరి జాబితాల్లోనూ అనుమానితులు లేరేంటి?' అడిగాడు శరత్.

'అదేకదా బాస్ సమస్య. సుమ తల్లిదండ్రులు ఆమెతో సంబంధం తెంచుకున్నారు. ఆమె చనిపోయిందని చెప్తే కూడా అనాథ శవ దహనం చేయండన్నారు. ఆమెతో సహజీవనం చేసిన విశ్వాస్ ఆరు నెలల నుంచీ ఆమెతో మాటలు లేవని చెప్పాడు. అప్పుడప్పుడూ ఏదైనా మాట్లాడినా, అది ఆఫీసుకి సంబంధించిన విషయాలేతప్ప వ్యక్తిగతం ఏమీ కాదు.

విశ్వాస్ కాక మరో ఇద్దరు ముగ్గురితో సుమ సన్నిహితంగా ఉండేదిగానీ వారెవరితోనూ అనుబంధం ఏర్పడలేదు. ఆమెను హత్య చేయటానికి 'మోటివ్' లేదు. దాంతో పరిశోధన ముందుకు సాగటం లేదు.

అంతా చదివి నిట్టూర్చాడు శరత్.

'ఫోను కాల్ డేటా, బ్యాంకు లావాదేవీల వివరాలు సేకరించావా?' అడిగాడు.

'యెస్ బాస్' అంటూ మరో ఫైలు శరత్ ముందు పెట్టాడు రాము.

'గదిలో సుమ వేలిముద్రలు, పనిమనిషి వేలిముద్రలు, విశ్వాస్, అతనితో వచ్చిన కొలీగ్, ఖాన్ వేలిముద్రలు దొరికాయి. కానీ పని మనిషి వారం రోజులు సెలవులో వెళ్లింది' తనలో తానే ఆలోచిస్తున్నట్టు అన్నాడు శరత్.

తరువాత రామూవైపు తిరిగి, 'రామూ ఓ పని చెయ్యి, అమ్మాయి కాలేజీలో ఎలా ఉండేది, ఆమెకున్న పరిచయాలు వంటి వివరాలు సేకరించు'.

'అంత వెనక్కు వెళ్ళాల్సిన అవసరం ఉందా బాస్?'

'చెప్పలేం. మన పరిశోధనా పరిధి విస్తరించకపోతే కేసు ఎంతసేపూ తిరిగినచోటే తిరుగుతూ ఉంటుంది. ఇంటి చుట్టుపక్కలవారిని ప్రశ్నించావా?'.

'ప్రశ్నించాను బాస్. ఎవరితోనూ ఎక్కువ కలుపుగోలుగా ఉండేదికాదట. వారికీ ఈమె మీద మంచి అభిప్రాయం లేదు. స్వంత ఇల్లు కాబట్టి ఏమీ చేయలేకపోయారు. లేకపోతే కాలనీ నుంచి తరిమేసే వాళ్ళమే అన్నారు' తల ఊపాడు శరత్. 'ఆ నేపథ్యం ఏమిటో ఇంకా లోతుగా పరిశోధించు. నేను ఇంటి చుట్టుపక్కలవాళ్ళను ప్రశ్నిస్తాను. అలాగే ఖాన్, విశ్వాస్‌లనూ ప్రశ్నిస్తాను' అన్నాడు శరత్ లేస్తూ.

***

**సుమ, విశ్వాస్ ఒకే ఆఫీసులో పనిచేస్తారు. ఇద్దరూ కొంతకాలం సహజీవనం చేశారు. తర్వాత వారిద్దరి మధ్య విభేదాలొచ్చాయి. విడిపోయారు. తర్వాత కొంతకాలానికి సుమ తన ఇంట్లోనే హత్యకు గురైంది. శరత్ అసిస్టెంట్ రామూ ఈ కేసు టేకప్‌చేశాడు. కానీ అతడికి కొరుకుడు పడలేదు. చివరికి డిటెక్టివ్ శరత్‌ను ఆశ్రయించి అదేమిటో నువ్వే తేల్చు అని అడిగాడు. మరి శరత్ ఏం చేశాడు?**

'మా ఇంట్లో వయసులో ఉన్న పిల్లలున్నారు. అది అలా బరితెగించి ఎవరు పడితే వారితో తిరుగుతూవుంటే దాని ప్రభావం ఎలా ఉంటుంది చెప్పండి?' ఆవేశంగా అడిగిందామె. సుమ ఇంటి పక్క ఇల్లు ఆమెది.

'విశ్వాస్ మంచివాడేగానీ, ఎంతయినా మగవాడు. అంత విచ్చలవిడితనం ఆడవారిలో భరించటం కష్టం' మరో ఇంటాయన అన్నాడు.

'విశ్వాస్‌తో విడిపోయిన తర్వాత ఆమె వేరే ఎవరితోనైనా కలిసి ఉండేదా?' అడిగాడు శరత్.

'లేదు. రాత్రిళ్ళు వచ్చి పొద్దున్న వెళ్ళిపోయేవారు' కసిగా చెప్పిందామె.

'ఆమె హత్య జరిగిన రోజు ఎవరైనా ఇంట్లోకి వచ్చివెళ్ళటం చూశారా?'

'ఆ విషయాలన్నీ మాకెందుకండీ, పోలీసుల చుట్టూ మేం తిరగలేం' అన్నారంతా.

'మీ పేరు బయటకు రానివ్వను. మీరిచ్చే సమాచారం నాకే పరిమితం' అంటూ భరోసా ఇచ్చాడు శరత్.

ఎవరూ మాట్లాడలేదు.

'నిజం తెలిసి కూడా సమాచారం చెప్పకపోతే, హంతకుడికి సహాయం చేసిన వారు అవుతారు. ఆ నేరం ఆధారంగా మిమ్మల్ని జైల్లో పెట్టవచ్చు' బెదిరించాడు శరత్.

వారి పేర్లు బయట పెట్టనని శరత్ హామీ ఇచ్చిన తరువాత వాళ్ళల్లో ఒకాయన చెప్పాడు. 'నేను ఆ రోజు రాత్రి లేటుగా ఇంటికి వచ్చాను. అప్పుడు టైము పదకొండు దాటి ఉంటుంది. సుమ ఇంటి తలుపు తెరుచుకోవటం చూశాను. ఎవరో మనిషి బయటకు వచ్చాడు. సిగరెట్ విసిరేశాడు. అతడి చేతిలో పెద్ద వైరులాంటిది ఉంది. దాన్ని తిప్పుకుంటూ స్కూటీలాంటి దాని దగ్గరకు వచ్చాడు. అది కీచైన్ అన్నమాట. స్కూటీ స్టార్ట్ చేసి వెళ్లిపోయాడు.

నేను ఆ చివరి నుంచి ఈ చివరికి వచ్చేసరికి అతను వెళ్ళిపోయాడు. నాకు ముఖం సరిగ్గా కనబడలేదు. మళ్ళీ చూస్తేగానీ గుర్తు పట్టలేను. అందుకే నేను చెప్పలేదు' గబగబా చెప్పాడాయన.

'స్కూటీ లాంటిదా?' అడిగాడు శరత్.

'అవును. అలాంటిదే. హోండాలాంటిదైతే కాదు'.

తల ఊపాడు శరత్. 'మీకు కనిపించిన ఆకారాన్ని వర్ణించగలరా?'

కష్టం. చీకట్లో నా కళ్ళు సరిగ్గా కనిపించవు'.

***

ఇంటిగేటు తీసి కాంపౌండ్‌లో అడుగుపెట్టాడు

శరత్.

గేటుకి రెండువైపులా ఉన్న చెట్లలో వెతకటం ఆరంభించాడు. అతను వెతుకుతున్నది కాంపౌండ్‌ని ఆనుకునివున్న పొదల్లో దొరికింది. దాన్ని జాగ్రత్తగా ప్లాస్టిక్ కవర్‌లో వేసుకున్నాడు శరత్.

ఇంట్లోకి వెళ్లి వేలిముద్రలు మరోసారి సేకరించాడు.



***

'ఏమైనా తెలిసిందా బాస్?' అడిగాడు రాము, తాను సేకరించిన వివరాలను శరత్‌కి అందిస్తూ.

ఫోను రికార్డులు, బ్యాంకు లావాదేవీలు పరిశీలిస్తున్న శరత్ కాస్సేపు మాట్లాడలేదు. తరువాత కాసేపటికి ఓ కాగితం ముక్కమీద ఓ ఫోన్ నెంబరు రాసిచ్చాడు.

'ఈ ఫోన్ ఎవరి పేరుమీద రిజిష్టరై ఉందో కనుక్కో. నెలరోజులుగా సుమ ఈ ఫోన్‌కే ఎక్కువగా కాల్స్ చేసింది. అదేవిధంగా బ్యాంకు లావాదేవీల వివరాలు కూడా మరో మూడేళ్ల వెనకవి కావాలి'.

'ఎందుకు బాస్?'

'అనుమానం తీర్చుకునేందుకు' అన్నాడు శరత్ లేస్తూ.

***

'మా బాస్ చూడమన్నాడు. అందుకే ఆమె ఇంటికి వెళ్ళాను. విశ్వాస్‌ను ఎంతో బ్రతిమిలాడాల్సి వచ్చింది. విశ్వాస్‌కీ ఆమెకీ ఉన్న సంబంధం ఏమిటో మాకు తెలుసు' చెప్పాడు ఖాన్.

'విశ్వాస్, సుమ ఎందుకు వేరుపడ్డారు?' అడిగాడు శరత్.

'నాకు తెలియదు. ఆఫీసులో కూడా వాళ్ళిద్దరూ అవసరమైతేతప్ప మాట్లాడుకునేవారు కారు' చెప్పాడు ఖాన్.

***

'సుమ మంచిది. కానీ కొన్ని విషయాలలో మూర్ఖంగా ప్రవర్తించేది. నేను ఆఫీసులో ఇతర కొలీగ్స్‌తో మాట్లాడినా భరించలేకపోయేది. మేము సహజీవనం చేస్తున్నాం. కాబట్టి నేను అమ్మాయిల వైపు చూస్తే అభద్రతా భావానికి గురయ్యేది. గోల చేసేది. అది భరించలేకే నేను ఆమెకు దూరం అయ్యాను' చెప్పాడు విశ్వాస్.

'మీరు కలసి ఉన్నప్పుడు మీరు ఆర్థిక వ్యవహారాలు ఎలా మేనేజ్ చేసుకునేవారు?'

'అంటే?'

'ఇంటి ఖర్చులు ఎవరు పెట్టే వారు?'

'సగం సగం వేసుకునే వాళ్ళం'.

'సుమ బ్యాంకు వ్యవహారాలు నేనే చూశాను. ఆమె దాదాపు యాభై లక్షలు లోన్ తీసుకుంది. కొన్ని నెలలుగా ఇన్‌స్టాల్‌మెంట్ కట్టటం లేదు. ఎందుకు లోను తీసుకుందో తెలుసా?' అడిగాడు శరత్.

'నాకు తెలియదు. నన్ను ష్యూరిటీ సంతకం పెట్టమంది. నేను పెట్టలేదు. మా మధ్య గొడవలకు అది కూడా ఒక కారణమైంది. ఎలాంటి బంధనాలు లేకుండా ఎలాగైతే మేం సహజీవనం చేశామో ఆర్థికంగా కూడా అదేవిధంగా ఉండాలన్నాను. ఆ మాటలు ఆమెకు నచ్చలేదు'.

'ఆ డబ్బు ఏం చేసింది?'

'తెలియదు. నేను అడగలేదు'

'ఈ మధ్యకాలంలో ఆమె ఎక్కువగా ఒక నెంబరుకు ఫోను చేసింది. అది మీ పేరు మీద రిజిస్టరై ఉంది'.

'ఓ' అదా. సుమ కావాలంటే నా ఐడీ మీద ఫోన్ ఇచ్చాను. అది ఆమె ఎవరికి ఇచ్చిందో తెలియదు. నేను పట్టించుకోలేదు' నిట్టూర్చాడు శరత్.

'మీకు తెలుసా, ఫోన్ కాల్స్ ఎక్కడినుంచి వచ్చాయనే కాదు, ఫోను కాల్ రిసీవ్ చేసుకున్నప్పుడు వారు ఏ ప్రాంతంలో ఉన్నారో కూడా తెలుసుకోవచ్చు'.

'అయితే?'

'కొన్ని కాల్స్ రిసీవ్ చేసుకున్నప్పుడు ఆ ఫోన్ మీ ఇంటి ప్రాంతంలోనే ఉంది'.

'నాకు తెలియదు. ఫోను ఆమె దగ్గరే ఉంది. పోలీసులకు కూడా ఆమె ఇంట్లోనే దొరికింది ఫోను'.

'ఫోను మీద మీ వేలిముద్రలున్నాయి'.

'అవును. మంచం మీద నుంచి తీసి పోలీసులకు ఇచ్చింది నేనే'.

'ఇంతకీ ఆమెను దేనితో గొంతునులిమి చంపావు? నీ బండి కీచైన్‌తోనా?'

'వాటీజ్ దిస్ నాన్సెన్స్?' అరిచాడు విశ్వాస్.

'నువ్వు గోల్డ్‌ఫ్లేక్ బ్రాండ్ సిగరెట్ తాగుతావు కదా?'

'అవును. అయితే?'

'సుమను హత్యచేసిన హంతకుడు సిగరెట్ తాగుతూ బయటకు వచ్చి సిగరెట్ పారేశాడు బండి కీ చైన్ తిప్పుతూ బండి స్టార్ట్ చేసి వెళ్ళాడు. అతడు పారేసిన సిగరెట్ పీక దొరికింది. దాని నుంచి సిగరెట్ తాగిన వాడి డిఎన్‌ఎ సేకరించాం.

'అయితే. నేను సుమతో ఉన్నప్పుడు బోలెడన్ని సిగరెట్లు తాగి పారేశాను'.

'నవ్వాడు శరత్' ఎనిమిది నెలల క్రితం నువ్వు పెద్ద డూప్లెక్స్ ఇల్లు 75 లక్షలుపెట్టి కొన్నావు. ఇరవై అయిదు లక్షలు సేవింగ్స్, 50 లక్షలు ఫ్రెండ్ నుంచి లోను అని రాశావు. యాభై లక్షలు ఇచ్చిన ఫ్రెండ్ ఎవరు?'

విశ్వాస్ పెదవులు కదిలాయి. నోట మాట రాలేదు.

'ఇద్దరం కలసి ఉన్నప్పుడు లోను పెట్టి నీకు ఇచ్చింది. డబ్బులు అందగానే ఏదో కారణంతో బయట పడ్డావు. ఇన్‌స్టాల్‌మెంట్స్ కట్టటం మానేశావు. మాటిమాటికీ సుమ నీకు ఫోన్ చేస్తోందని, వేరే సిమ్ తీసుకున్నావు. అదీ ఆమెకు తెలిసింది. చివరికి ఆమె బెదిరింపులు భరించలేక చంపేశావు. ఫోన్ ఆమె దగ్గర వదిలిపెట్టి వెళ్ళావు. దాంతో ఆమె వేరే ఎవరితోనో స్నేహం చేస్తోందని అందర్నీ నమ్మించాలనుకున్నావు. పైగా, కొలీగ్‌తో కలిసి సుమ ఇంటికి వెళ్ళటం వల్ల వేలిముద్రలున్న అనుమానం నీ మీదకురాకుండా చేసుకున్నావు. అవునా? నీకు యాభై లక్షల రూపాయలమీదవున్న ప్రేమ మనిషి మీద, మనిషి ప్రాణం మీదా లేదు' అన్నాడు శరత్.

కుర్చీలో కూలబడిపోయాడు విశ్వాస్. గదిలోకి వచ్చాడు ఇన్‌స్పెక్టర్ ఇంద్రజిత్.

**–కస్తూరి మురళీకృష్ణ**

***సెల్: 98496 17392***

# నేను నాన్నను

-వాణిశ్రీ



**సొంత పొలంలో పండిన కూరగాయలు బోయినపల్లి హోల్‌సేల్ మార్కెట్‌లో అమ్మి, తన వ్యాన్ డ్రైవ్ చేసుకుంటూ ఊరికి బయల్దేరాడు సత్యం. తెల్లవారుజామునే బయల్దేరడంతో కొంచెం తలనొప్పిగా అనిపించింది.**

**రోడ్డు పక్క దాబా ముందు వ్యాన్ ఆపాడు. వాష్‌బేసిన్ దగ్గర ముఖం కడుక్కున్నాడు. స్ట్రాంగ్ టీ తెప్పించుకుని తాగుతుంటే రిలీఫ్‌గా అనిపించింది.**

అప్పుడు ఉదయం తొమ్మిది కావస్తోంది. చలి కాలం కావడంతో ఎండ వేడెక్కలేదు. మంచు తెరలు పూర్తిగా తొలగిపోలేదు. చల్లటి గాలి ఒంటికి తగుల్తోంది.

ఇంతలో పెద్ద శబ్దం. హాహాకారాలు వినిపించడంతో ఉలికిపడ్డాడు. కళ్ళ ముందే ఘోరం జరిగింది. ఒక కాలేజీ బస్సు రోడ్డు పక్కనున్న చింతమానుకు గుద్దుకుంది. దాబాలో ఉన్న జనం అంతా పరిగెత్తుకెళ్ళారు.

బస్సు తలుపు తెరుచుకుని స్టూడెంట్స్ భయవిహ్వలులై దిగుతున్నారు. కొందరు భయంతో వణుకుతూ ఉంటే, మరికొందరు దుఃఖిస్తున్నారు.

డ్రైవర్ స్టీరింగ్ మీద ఒరిగిపోయి ఉన్నాడు. అతని నోటి నుంచి నెత్తురు కారుతోంది. ఇటు పక్క సీట్లో కూర్చున్న కుర్రాడు ఇరుక్కుపోయి స్పృహ తప్పి ఉన్నాడు.

సత్యం తన వ్యాన్ వెనక్కి తిప్పాడు. 'అంబులెన్స్... అంబులెన్స్‌కి ఫోన్ చెయ్యండి' ఎవరో అరుస్తున్నారు. అక్కడంతా గందరగోళంగా ఉంది.

"వాళ్ళిద్దర్నీ వ్యాన్‌లోకి ఎక్కించండి. నేను హాస్పిటల్‌కి తీసుకుపోతాను." గట్టిగా అరిచాడు సత్యం.

అతని ముఖం ఎర్రబడిపోయి ఉంది. పూనకం వచ్చిన వాడిలా ఉన్నాడు. కొందరు డ్రైవర్ని, ఆ కుర్రాణ్ణీ వ్యాన్‌లో పడుకోబెట్టారు.

సత్యం వేగంగా నడుపుతూ వాళ్ళని మెట్రో హాస్పిటల్‌కి చేర్చాడు. పోర్టికోలో వ్యాన్ ఆపి "యాక్సిడెంటైంది. ఇద్దరు చావు బతుకుల్లో ఉన్నారు. స్ట్రెచర్ తెండి" గట్టిగా అరిచాడు.

హాస్పిటల్ వార్డ్ బాయ్స్ వెంటనే స్పందించారు. స్ట్రెచర్ మీదకు వారిని చేర్చి తోసుకుంటూ లోపలకు తీసుకెళ్ళారు. ఎమర్జెన్సీ వార్డులో చేర్చారు.

కాసేపటికి అతనికి కబురు వచ్చింది.

"మీరేనా వాళ్ళని తీసుకొచ్చింది?" డాక్టర్ అడిగాడు.

"ఔనండీ!"

"సారీ! డ్రైవర్ చనిపోయాడు. వంశీకి ఆపరేషన్ చేయాలి."

"చెయ్యండి. డబ్బు నేను కడతాను" లాల్చీ జేబులో నుంచి డబ్బు తీశాడు.

"డబ్బు సరే! ఆ కుర్రాడి ఫాదర్ సంతకం చేయాలి. వంశీ సన్ ఆఫ్ సత్యనారాయణ అని బ్యాడ్జీ మీద ఉంది. ఆయన్ని వెంటనే పిలిపించాలి."

"డాక్టర్‌గారూ! నేనే నాన్నని..!" ఏడుపు ఆపుకుంటూ అన్నాడు సత్యం.

"మీరేనా?" కొంచెం ఆశ్చర్యపోయాడు.

"నేనే నాన్నని...!" అంటూ కళ్ళు తుడుచుకున్నాడు భుజం మీద ఉన్న టవల్‌తో.

తర్వాత సత్యం కౌంటర్‌లో తన దగ్గరున్న డబ్బు చెల్లించాడు. వంశీకి ఆపరేషన్ చేయడానికి సమ్మతిస్తున్నట్టు సంతకం చేశాడు. ఆపరేషన్ చేసేటప్పుడు అవసరమైతే తన రక్తం ఇచ్చాడు సత్యం.

ఇంజనీరింగ్ కాలేజీ బస్సుకి యాక్సిడెంటు జరిగిందనీ, క్షతగాత్రుల్ని మెట్రో హాస్పిటల్లో చేర్చారనీ మీడియాకి తెలిసింది. టీవీ, మీడియా జర్నలిస్టులు, ప్రింట్ మీడియా జర్నలిస్టులు వచ్చారు. యాక్సిడెంటు జరిగిన ప్రైవేట్ ఇంజనీరింగ్ కాలేజీ బస్సుని షూట్ చేస్తున్నారు. అందులో ప్రయాణం చేసిన స్టూడెంట్స్‌ని ఇంటర్వ్యూ చేస్తున్నారు. యాక్సిడెంట్ ఎట్లా జరిగిందో అడుగుతున్నారు. వాళ్ళు చెప్పింది

టెలికాస్ట్ చేస్తున్నారు లైవ్ అంటూ...

***

డాక్టర్ చెప్పింది విని వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు సత్యం.

కాలేజీ ప్రిన్సిపాల్, స్టూడెంట్ లీడర్, డాక్టర్లు అతన్ని ఓదారుస్తున్నారు. టీవీ కెమెరాలు ఆ దృశ్యాన్ని షూట్ చేస్తున్నాయి. బ్రేకింగ్ న్యూస్ చూస్తున్న వాళ్ళు సత్యం మీద జాలి పడుతున్నారు.

"సారీ! సత్యంగారూ! మా ప్రయత్నం మేం చేశాం. వంశీ బ్రెయిన్ డెడ్ అయ్యాడు. వెంటిలేటర్ మీద ఉంచాం. బతికే ఆశ లేదు." హాస్పిటల్ డాక్టర్ డిక్లేర్ చేశాడు.

సత్యం దుఃఖం చూస్తూ అందరి హృదయాలు కరుగుతున్నాయి. ఇంజనీరింగ్ చదువుతున్న కొడుకు మరణం తట్టుకోవడం అంత సులభం కాదు ఎవరికైనా. చదివి ఇంజనీర్ అయి తమకు సంతోషం కలిగిస్తాడని ఆశపడిన తండ్రికి శరాఘాతం తగిలింది. తట్టుకోలేకపోతున్నాడని అందరికీ జాలి కలుగుతోంది.

మెట్రో హాస్పిటల్‌లో వంశీ బ్రెయిన్‌డెడ్ అయ్యాడని అన్ని హాస్పిటల్స్‌కి సమాచారం అందింది. నగరంలోని ఫైవ్ స్టార్ హాస్పిటల్ నుంచి మెట్రో హాస్పిటల్ చీఫ్‌కి ఫోన్ వచ్చింది.

"హలో డాక్టర్! నేను ఫైవ్‌స్టార్ హాస్పిటల్ నుంచి డాక్టర్ దత్తాత్రేయుణ్ణి మాట్లాడుతున్నాను."

"చెప్పండి డాక్టర్"

"మా హాస్పిటల్లో ఒక పేషెంట్‌కి హార్ట్ ప్రాబ్లమ్. ఆపరేషన్ చేసినా నో ఛాన్స్. గుండె మారిస్తే బతుకుతాడు. వంశీ హార్ట్ డొనేట్ చేస్తే ఒక ప్రాణం నిలుస్తుంది."

"ఎస్ డాక్టర్."

"అతని పేరెంట్స్ ఒప్పుకుంటే గుండె మార్పిడి ఆపరేషన్‌కి ఏర్పాట్లు చేసుకుంటాం. వంశీ పేరెంట్స్‌ని కన్సల్ట్ చేసి మాకు తెలియజేస్తారా?"

"ష్యూర్...!" అన్నాడు మెట్రో హాస్పిటల్ చీఫ్.

ఇంకా కొన్ని హాస్పిటల్స్ నుంచి కిడ్నీలు కావాలనీ, లివర్ ట్రాన్స్‌ప్లాంట్ చెయ్యడానికి ఒప్పించమనీ, కళ్ళు దానం చేస్తే కొందరికి చూపు ప్రసాదించవచ్చనీ అభ్యర్థనలు మెట్రో హాస్పిటల్‌కి రాసాగాయి.

"సత్యం గారూ!"

ఎర్రబడిన కళ్ళతో తలెత్తి చూశాడు సత్యం.

"మిమ్మల్ని ఇలా అడగవలసి వస్తున్నందుకు బాధగా ఉంది. ఐ ఫీల్ వెరీమచ్. మై రిక్వెస్ట్ ఏమిటంటే వంశీ బతికే ఛాన్స్ లేదు. అతని అవయవాలు దానం చేస్తే కొందరి ప్రాణాలు నిలబెట్టినవాళ్ళవుతారు. గుండె, లివర్, కిడ్నీలు, కళ్ళు దానం చేస్తే బాగుంటుంది. వాళ్ళలో మీ కొడుకుని మీరు చూసుకోగలుగుతారు..." చెప్పాడు డాక్టర్.

"అలాగే డాక్టర్. మీరు చెప్పినట్టే చేయండి. వాడు ఎటూ జీవించే ఛాన్స్ లేదు కదా?" అన్నాడు సత్యం కళ్ళు తుడుచుకుంటూ.

సత్యం ఉదారగుణం మెట్రో హాస్పిటల్ చీఫ్‌ని కదిలించింది.

"యూ! ఆర్ గ్రేట్ ఫాదర్. గాడ్ బ్లెస్ యూ!" అంటూ కరచాలనం చేశాడు.

తర్వాత వంశీ అవయవాలు ట్రాన్స్‌ప్లాంట్ చేసి పేషెంట్లకు అమర్చడానికి తనకు అభ్యంతరం లేదనీ, మనస్ఫూర్తిగా ఒప్పుకుంటున్నాననీ సత్యం అవసరమైన కాగితాల మీద సంతకాలు చేశాడు.

వంశీ ఐడెంటిటీ కార్డు మీదున్న ఫొటో, వివరాలు టీవీ ఛానల్స్‌లో ప్రసారం చేశారు. అతని గుండె ట్రాన్స్‌ప్లాంట్ చేయడానికి సికింద్రాబాద్ నుంచి ట్రాఫిక్ మొత్తం ఆపించి జూబ్లీహిల్స్‌లోని ఫైవ్‌స్టార్ హాస్పిటల్‌కి అంబులెన్స్‌లో తీసుకెళ్ళడాన్ని ప్రేక్షకులు లైవ్‌లో చూశారు.

వంశీ అమరజీవి అనీ, అతని గుండె, కిడ్నీలు, లివర్, కళ్ళు దానం చేయడం వలన అతడి అవయవాలు దానంగా తీసుకున్న ఆరుగురిలో అతను జీవిస్తూ ఉంటాడనీ ఇంజనీరింగ్ కాలేజీలో విద్యార్థులు సంతాపసభలో పొగిడారు. వంశీ తండ్రి సత్యం ఆదర్శమూర్తి అని కొనియాడారు.

***

సత్యం ఉన్నట్టుండి తెలివితప్పి పడిపోయాడు. అప్పుడతను మెట్రో హాస్పిటల్లోనే విజిటర్స్ రూమ్‌లో కూర్చుని ఉన్నాడు. వెంటనే వార్డుకి తరలించారు. కొడుకు కోసం రక్తం ఇవ్వడం, తర్వాత కొడుకు బ్రెయిన్ డెడ్ అయ్యాడని, ఇక బతికే అవ




**కాలేజీ వ్యాన్ చెట్టుకు ఢీకొట్టింది. అక్కడే తన వెహికల్ ఆపి టీ తాగుతున్న సత్యం వెంటనే స్పందించాడు. తన వెహికిల్‌లోనే డ్రైవర్నీ, ఒక స్టూడెంట్‌నీ హాస్పిటల్‌కి తరలించాడు. ఇద్దరూ చనిపోయారు. మరణించిన విద్యార్థి తన కొడుకే అని గ్రహించాడు సత్యం. కొడుకు అవయవాలన్నీ దానం చేసేశాడు. సత్యం ఉదారగుణానికి టీవీల్లో మంచి ప్రచారం వచ్చింది. అంతలోనే అనూహ్య సంఘటన జరిగింది. ఏమిటది?**

కాశం లేదని డాక్టర్లు తేల్చడంలో తీవ్ర మానసిక వేదనకు గురయ్యాడని, అందుకే అస్వస్థుడయ్యాడని డాక్టర్లు ట్రీట్‌మెంట్ మొదలు పెట్టారు. స్పెషల్ రూమ్‌లో నిద్రలోకి జారిపోయాడు సత్యం.

ప్రముఖ వ్యాపారవేత్త మోహన్ కుమార్ కొడుకు రాజ్‌కుమార్‌కి వంశీ గుండెను తీసి అమర్చారు. అరుదైన వ్యాధితో గుండెకు చిల్లులు పడి పాడైపోయింది. చికిత్సకు కూడా పనికిరాలేదు. గుండె మార్చడంతప్ప వేరే మార్గం లేదు. వంశీకి ప్రమాదం జరిగి బ్రెయిన్ డెడ్ కావడం అప్పుడతని అదృష్టం. వంశీ గుండె అతనికి అమర్చడంతో బతికి బైట పడ్డాడు. కొడుకు రాజ్‌కుమార్ ఇక బతకడని నిర్ణయించుకుని ఆవేదనతో కుమిలిపోతున్న మోహన్‌కుమార్‌కి ఈ గుండె మార్పిడి చికిత్సతో కొడుకు మరో జన్మ ఎత్తినట్టు అనిపించింది. అమితానందంతో ఉబ్బితబ్బిబ్బైపోయాడు.

గుండె మార్పిడి చికిత్సకు నేతృత్వం వహించిన ఫైవ్ స్టార్ హాస్పిటల్ కార్డియాలజిస్ట్ డాక్టర్ దత్తాత్రేయుణ్ణి కలుసుకుని వేనోళ్ళ కొనియాడి కృతజ్ఞతలు తెలియజేశాడు మోహన్ కుమార్.

"డాక్టర్‌గారూ! నా కొడుకుని బతికించారు. వాడిపైన ఆశలు వదులుకున్నాను. మీరు మా పాలిట దేవుడు. మీ రుణం ఎలా తీర్చుకోవాలో తెలియడం లేదు" అంటూ కన్నీళ్ళు పెట్టుకున్నాడు.

"కుమార్‌గారూ! నన్ను అట్టే పొగడకండి. వంశీ చనిపోతూ మీ కొడుక్కి ప్రాణదానం చేశాడు. హార్ట్ ట్రాన్స్‌ప్లాంటేషన్‌కి ఒప్పుకున్న అతని తండ్రే మీ పాలిట అసలైన దేవుడు. ఐతే వ్యక్తిగతంగా దురదృష్టవంతుడు. ఎందుకంటే ఇంజనీరై తమకు ఆనందం కలిగిస్తాడనుకున్న కొడుకుని పోగొట్టుకున్నాడు" చెప్పాడు డాక్టర్ దత్తాత్రేయుడు.

"నిజం డాక్టర్. ఎదిగిన చెట్టంత కొడుకు శాశ్వతంగా దూరం కావడం ఎంత క్షోభ కలిగిస్తుందో అనుభవించిన వాణ్ణి. పాపం ఆ కుర్రాడి తండ్రి ఎంత కుమిలిపోతూ ఉంటాడో?"

"మనం సానుభూతి తెలపడానికి మించి ఏం చెయ్యలేం."

డాక్టర్ దత్తాత్రేయుడు, మోహన్ కుమార్ కొంచెం సేపు ముచ్చటించుకుంటూ ఉండి

పోయారు.

"డాక్టర్ గారూ! కొడుకుని పోగొట్టుకున్న ఆ కుటుంబాన్ని ఆదుకోవా లని నిర్ణయించుకున్నాను. పాపం కొడుకు ఇంజనీరై కుటుంబానికి సహాయంగా ఉంటా డనీ, వృద్ధాప్యంలో ఆదుకుంటాడనీ ఎన్ని ఆశలుపెట్టుకున్నారో గదా?" అన్నాడు మోహన్ కుమార్.

"మీ నిర్ణయాన్ని అభినందిస్తున్నా నండీ! థాంక్యూ వెరీమచ్" అని డాక్టర్ దత్తాత్రేయుడు అతన్ని పొగిడాడు.

మోహన్ కుమార్ జేబులోంచి చెక్‌బుక్ తీసి కోటిరూపాయలు రాశాడు.

"డాక్టర్‌గారూ! వంశీ తండ్రి పేరు రాసి ఆయనకి అందజేయండి. ఆయన పేరు ఏదో నాకు తెలియదు." అన్నాడు మోహన్ కుమార్ చెక్ అందిస్తూ.

"ఆయన పేరు నాకూ తెలీదు. అయినా ఇస్తున్నది మీరు. మీ చేత్తో ఇస్తే బాగుంటుంది" అన్నాడు డాక్టర్.

మెట్రో హాస్పిటల్‌కి వంశీ తండ్రి గురించి ఫోన్‌లో అడిగాడు డాక్టర్ దత్తాత్రేయుడు. వంశీ తండ్రి సత్యం అస్వస్థతతో అదే హాస్పిటల్లో అడ్మిటై ఉన్నాడని సమాచారం వచ్చింది.

"మోహన్ కుమార్‌గారూ! పాపం వంశీ తండ్రి సత్యం మెట్రో హాస్పిటల్లో అడ్మిటై ఉన్నాడట. అప్‌సెట్ అయి ఉంటాడు. పదండి, నాకూ ఆ మహానుభావుణ్ణి చూడాలనిపిస్తోంది. మీ చేత్తో ఆ చెక్ ఇస్తే బాగుంటుంది." అన్నాడు డాక్టర్ దత్తాత్రేయుడు.

"సరే పదండి. మా కుటుంబానికి దేవుడి లాంటి ఆ మనిషిని చూడాలని ఉంది నాకు" అన్నాడు మోహన్ కుమార్.

డాక్టర్ దత్తాత్రేయుడు, మోహన్ కుమార్ మెట్రో హాస్పిటల్‌కి బయల్దేరారు.

***

ఫైవ్‌స్టార్ హాస్పిటల్ చీఫ్ కార్డియాలజిస్ట్ డాక్టర్ దత్తాత్రేయుడు తమ హాస్పిటల్‌కి వస్తున్నాడనే సమాచారం అందుకుని మెట్రో హాస్పిటల్ ఎం.డి డాక్టర్ ఫయాజ్ అహ్మద్ పోర్టికోలోకి వచ్చాడు.

డాక్టర్ దత్తాత్రేయుడు, మోహన్ కుమార్ కారు దిగారు. డాక్టర్ ఫయాజ్ అహ్మద్ ఎదురెళ్ళి కరచాలనం చేసి స్వాగతం పలికాడు.

"డాక్టర్ ఫయాజ్, మీట్ మిస్టర్ మోహన్ కుమార్. బిగ్ ఇండస్ట్రియలిస్ట్. వీరి అబ్బాయికే వంశీ హార్ట్ ట్రాన్స్‌ప్లాంట్ చేశాం. వంశీ ఫాదర్‌కి ఒక చెక్ స్వయంగా ఇవ్వాలని వచ్చారు. ఆయన మీ హాస్పిటల్లో ఉన్నారని తెలిసింది" అన్నాడు డాక్టర్ దత్తాత్రేయుడు.

డాక్టర్ ఫయాజ్ అహ్మద్ మోహన్ కుమార్‌తో కరచాలనం చేసి, "ష్యూర్! వెల్‌కమ్" అన్నాడు.

ముగ్గురూ హాస్పిటల్‌లోకి ప్రవేశిస్తూ ఉండగా ఒక అనూహ్య సంఘటన జరిగింది.

మధ్యవయస్సులో ఉన్న దంపతులు కారు దిగి లోపలికి వచ్చారు. రిసెప్షన్ కౌంటర్‌లో ఉన్న యువతి దగ్గరకు వెళ్ళారు.

"వంశీ ఎక్కడ?" వణుకుతున్న కంఠంతో అడిగాడు వృద్ధుడు.

ఆమె వెక్కి వెక్కి ఏడుస్తోంది.

"ఏ వంశీ?" అడిగింది రిసెప్షనిస్ట్.

"యాక్సిడెంట్‌లో చనిపోయాడు. ఇంజనీరింగ్ స్టూడెంట్" చెప్పాడు అతను.

"ఆ వంశీనా? ఇక్కడ అతని బాడీ లేదు. ఫైవ్ స్టార్ హాస్పిటల్లో ఉంది. ఇంతకీ మీరెవరు?"

"నేను వంశీ తండ్రిని" చెప్పాడు అతను.

ఇంతలో డాక్టర్ ఫయాజ్ అహ్మద్ అక్కడికి వచ్చాడు. విషయం ఏమిటి? అడిగాడు.

"సార్! మేము తిరుపతిలో ఉన్నాం. నిన్న సాయంకాలం ఇంజనీరింగ్ కాలేజీ వాళ్ళు నా సెల్ ఫోన్‌కి కాల్ చేశారు. రేపు సాయంకాలం వంశీ మృతికి సంతాపసభ జరుపుతున్నాం. మీ కుటుంబ సభ్యులు ఎవరైనా వస్తే బాగుంటుంది అన్నారు. మాకు అప్పటివరకూ వంశీ యాక్సిడెంటులో పోయిన సంగతి తెలీదు. వెంటనే బయల్దేరి వచ్చాం" బొంగురు పోయిన గొంతుతో చెప్పాడు ఆయన.

డాక్టర్ ఫయాజ్ అహ్మద్ బిత్తరపోయాడు. ఈయన వంశీ తండ్రి అయితే, నిన్న వంశీని హాస్పిటల్‌కి తెచ్చి తనే తండ్రి అని అడ్మిట్ చేసిన ఆయన ఎవరు? షాక్ తిన్నట్టు అయిపోయాడు సంగతి అర్థం కాక.

"మీ పేరు ఏంటండీ?"

"సత్యనారాయణ, వంశీ తండ్రిని."

అక్కడే ఉన్న డాక్టర్ దత్తాత్రేయుడు, మోహన్ కుమార్ సైతం ఆశ్చర్యంలో మునిగిపోయారు.

"సత్యనారాయణగారూ! మేము కన్ఫ్యూజన్‌లో ఉన్నాం. నిన్న ఉదయం వంశీకి యాక్సిడెంట్ అయింది. సత్యం అనే ఆయన వంశీని ఇక్కడికి తెచ్చి అడ్మిట్ చేశాడు. తనే వంశీ తండ్రిని అని చెప్పాడు. ఆపరేషన్‌కు అవసరమైతే అతను తన రక్తం కూడా ఇచ్చాడు. ఇద్దరి గ్రూప్ ఒకటే కూడా. బ్యాడ్‌లక్ వంశీ బ్రెయిన్ డెడ్ అయ్యాడు. మేం బతికించలేకపోయాం. సత్యం వంశీ శరీర అవయవాలు కొందరు పేషెంట్లకు ట్రాన్స్‌ప్లాంట్ చెయ్య

## రూటు మార్చినా ఫలితం లేదట

మిల్కీ బ్యూటీ తమన్నాకు గత కొంత కాలంగా కాలం కలిసి రావడం లేదు. 'బాహుబలి' తరువాత పెద్దగా అవకాశాలు రాలేదు. దాంతో తన రూట్‌ను మార్చి కొత్త కొత్త ఫోటో షూట్లు చేయించింది. బాలీవుడ్‌లో ఎక్స్‌పోజింగ్‌కు పెద్ద పీట వేస్తారు కనుక దానికి కూడా ఓకే చెప్పేసిందట! అయినా కూడా ఛాన్సులు రాక తెగ బాధపడిపోతోందట! మొదటినుంచీ కాస్త గ్లామర్‌కి ఇంపార్టెన్స్ ఇచ్చి ఉంటే బాగుండేదని ఇప్పుడు తీరిగ్గా బాధపడిపోతోంది. ఏమైనా మూడు పదుల వయస్సులో ఇప్పుడు కళ్ళు తెరిస్తే లాభం ఏమిటి? అన్నది చాలా మంది అభిప్రాయం.



మని ఒప్పుకున్నాడు గూడా. అలా అని సంతకాలు కూడా చేశాడు. మీరేమో వంశీ తండ్రిని అంటున్నారు."

"అయ్యో! ఆయనెవరో నాకు తెలీదు. నేనే వంశీ తండ్రిని. ఆయన్ని నాకు చూపించండి. నిజం ఏమిటో తెలుస్తుంది." అన్నాడు సత్యనారాయణ.

ఆయన భార్య పెద్దగా రోదిస్తోంది.

"డాక్టర్ ఫయాజ్, ఆ సత్యం ప్రస్తుతం మీ హాస్పిటల్లోనే గదా ఉన్నాడు. ఆయన్ని అడిగితే నిజం తెలిసిపోతుంది. వంశీకి తనే తండ్రిని అని ఎందుకు చెప్పాడో ఆయనే వివరిస్తాడు" అన్నాడు డాక్టర్ దత్తాత్రేయుడు.

అందరూ సత్యం ఉన్న రూమ్‌కి చేరుకున్నారు.

సత్యం నిద్రలో ఉన్నాడు. అతనికి ఎప్పుడు మెలకువ వస్తుందా అని అందరూ ఎదురు చూస్తున్నారు.

ఇంతలో సత్యం భార్య మంగతాయారుని హాస్పిటల్ స్టాఫ్ అక్కడికి తీసుకొచ్చారు.

"సార్! ఈమె సత్యం భార్యని అంటోంది. ఆయన్ని వెంటనే చూడాలంటే తీసుకొచ్చాం."

అందరూ ఆమెవైపు చూశారు. నడి వయసులో ఉంది మంగతాయారు. ఆమె ముఖంలో ఆందోళన కనిపిస్తోంది.

"ఏవమ్మా! మీరు సత్యం భార్యా?" అడిగాడు డాక్టర్ ఫయాజ్ అహ్మద్.

"ఔనండీ! నిన్నంతా ఇంటికి రాలేదు. మేం చింతపల్లిలో ఉంటాం. మాకు కూరగాయల తోటలున్నాయి. కూరగాయలు మార్కెట్‌కి వేసి వస్తానని వెళ్ళారు. తిరిగి రాలేదు. పొద్దున్న మా ఊరి సర్పంచ్ వచ్చి చెప్పాడు. ఇట్లా హాస్పిటల్లో ఉన్నాడని. వెంటనే వచ్చాను" చెప్పింది మంగతాయారు.

"అమ్మా! మీకు వంశీ అనే కొడుకు ఉన్నాడా?"

"లేడండి."

"మరేంటి? ఈయన ప్రమాదంలో గాయపడిన వంశీని తెచ్చి నా కొడుకే అని ఇక్కడ చేర్చాడు?"

"అయ్యో! మా అబ్బాయి మురళి కారుకింద పడి చనిపోయాడు. అప్పటి నుంచి ఈయనకు మతిస్థిమితం లేదు. ఎప్పుడూ బాగానే ఉంటాడు. ఎక్కడైనా యాక్సిడెంటు చూస్తే మాత్రం చలించిపోతాడు. ఇక మనలో ఉండడు. తను ఏం చేస్తాడో తెలియదు. మార్కెట్‌కి వెళ్ళొద్దంటే కూడా వినడు. తనే వ్యాన్ నడుపుకుని వెళ్తాడు. మాకు అదే భయం. ఆఖరికి టీవీల్లో యాక్సిడెంట్ వార్తలు చూసినా ఏడుస్తాడు" మంగతాయారు కళ్ళు తుడుచుకుంటూ వివరించింది.

సత్యం అలా అందరికీ ఎందుకు తను వంశీకి నాన్నను అని చెప్పాడో అర్థమైంది. వంశీ బ్యాడ్జీ మీద తండ్రి పేరు సత్యనారాయణ అని ఉండడం యాదృచ్ఛిక సంఘటన.

"సారీ! సత్యనారాయణగారూ! ఈయన వంశీ తండ్రి కాదు అని తెలియక, ఆయన ఇచ్చిన అనుమతి పత్రంతో శరీర అవయవాలు పేషెంట్లకు అమర్చాం" చెప్పాడు డాక్టర్ దత్తాత్రేయుడు.

"ఫరవాలేదండీ. ఆయన తనకు తెలియకుండా చేసినా మంచిపనే చేశాడు. సమయానికి ఆ దేవుడే నా స్థానంలో ఈయనతో ఆ పని చేయించాడని తృప్తిపడతాను" అన్నాడు వంశీ తండ్రి సత్యనారాయణ కళ్ళు తుడుచుకుంటూ.

ఇంతలో బెడ్ మీదున్న సత్యం కళ్ళు తెరిచాడు.

"డాక్టర్‌గారూ! వంశీ ఎక్కడండీ? నాకు చూపించండి. నేను చూడాలి." కలవరిస్తున్నట్టు అన్నాడు సత్యం.

సత్యం ఇంకా ట్రాన్స్‌లోనే ఉన్నాడనీ, మామూలు మనిషి కాలేదనీ అందరికీ అర్థమైంది.

**సెల్: 9390085292**

## మనమీదేనర్రోయ్!

సరసి







# మరణించిన మనిషితో మూడుముళ్ల బంధం

**'నిండు నూరేళ్లు.. పిల్లాపాపలతో కలకాలం జీవించండి' కొత్తగా పెళ్ళయిన జంటలకు ఇచ్చే ఆశీర్వాదమిది. దీర్ఘసుమంగళీభవ... నూతన వధువుకు బంధువులు ఇచ్చే దీవెన ఇది. సాధారణంగా పెళ్ళిళ్ళలో ఇలాంటి ఆశీర్వచనాలే వినిపిస్తుంటాయి. భాష ఏదయినా, ప్రాంతం ఏదయినా వాటి భావం మాత్రం ఇలాగే ఉంటుంది. కానీ కొన్ని పెళ్ళిళ్ళలో ఇలాంటి మాటలు మాత్రం వినిపించవు. బంధువులు, స్నేహితులు, శ్రేయోభిలాషులు ఎంతమంది పెళ్ళికి వచ్చినా.. ఇలాంటి ఆశీర్వాదాలు ఇచ్చేందుకు మనసొప్పదు. అదేంటి శత్రువయినా పెళ్ళికి వస్తే.. మాటవరసకయినా శుభం పలుకుతారు కదా.. మరి వీళ్లకేమయింది అనుకుంటున్నారా? అసలు విషయం తెలిస్తే, కలకాలం కలిసి ఉండమని మీరు కూడా దీవించలేరేమో!**

పెళ్ళి.. ఒక్కో ప్రాంతంలో ఒక్కోలా జరుగుతుంది. కులమతాల ఆధారంగా పెళ్ళిళ్ళ పద్ధతులు మారిపోతాయి. వింతవింత ఆచారాలతో అంగరంగ వైభవంగా జరుపుకుంటారు. కొందరు వ్యక్తులయితే విపరీత ధోరణితో పెళ్ళిళ్ళకు కొత్త భాష్యం కూడా చెప్పారు. తనను తాను పెళ్ళి చేసుకున్న వ్యక్తి ఒకరయితే, పాముతో కల్యాణం జరిపించుకున్నది మరొకరు. ఓ బ్రిటీష్ మహిళ తిమింగలాన్ని పెళ్ళి చేసుకుంటే, మమకారం ఎక్కువై పెంచుకున్న పిల్లినే అర్ధాంగిగా చేసుకున్నాడు మరో వ్యక్తి. ఇలాంటి వింత విచిత్ర పెళ్ళిళ్ళ గురించి చాలాసార్లు వినే ఉంటారు. ఏదో రోగం వచ్చి మరి కొన్నేళ్లలోనో, నెలల్లోనో చావు తథ్యం అనుకున్న వారికి కూడా పెళ్ళిళ్ళు జరిగిన సంగతులు చదివే ఉంటారు. నాగార్జున సినిమా 'గీతాంజలి'లోలా మరణం గురించి ముందే తెలిసినా, బతికున్న కొద్ది కాలమ్మైనా జీవితకాలపు ఆనందాన్ని తనతోనే పొందాలని భావించి పెళ్ళికి సిద్ధపడే వారి గురించి అప్పుడప్పుడూ వింటూనే ఉంటాం. కానీ మరణించిన వ్యక్తిని పెళ్ళి చేసుకునే వారి గురించి ఎప్పుడైనా విన్నారా..? చనిపోయిన వ్యక్తితో పెళ్ళికి ఓకే చెప్పే ప్రభుత్వ చట్టం గురించి మీకు తెలుసా? అతిథులు, స్నేహితుల మధ్య అంగరంగ వైభవంగా చనిపోయిన వ్యక్తిని పెళ్ళి చేసుకునే వధువును ఏమని ఆశీర్వదించాలో చెప్పగలరా? వినడానికి వింతగానే ఉన్నా కొన్ని దేశాల్లో ఇదే తరహా పెళ్ళిళ్ళు జరుగుతున్నాయి. అది కూడా చట్టబద్ధంగా! అసలు ఆ పెళ్ళిళ్ళు ఎలా ప్రారంభమయ్యాయో, వాటి కథేంటో తెలుసుకుందామా..!



## ఒక్కరితో మొదలై..

చనిపోయిన వారిని పెళ్ళిళ్ళు చేసుకునే విధానాన్ని చట్టబద్ధం చేసిన దేశాల్లో ఫ్రాన్స్ ఒకటి. 1950వ సంవత్సరంలో ఫ్రాన్స్‌లోని ఫ్రెజుస్‌లో ఓ డ్యామ్ కూలిపోయింది. దాదాపు 400 మంది చనిపోయారు. వీరిలో ఆండ్రీ కాప్రా అనే వ్యక్తి కూడా ఉన్నాడు. అయితే కొద్ది నెలల క్రితమే ఇతడికి ఇరేనే జోడార్ట్ అనే యువతితో పెళ్ళి నిశ్చయమయింది. ఒకరికొకరు మనసులు ఇచ్చిపుచ్చుకున్నారు. ఎన్నో ప్రణాళికలు వేసుకున్నారు. అనుకోకుండా జరిగిన ఘటనతో జోడార్ట్ ఒక్కసారిగా కుప్పకూలిపోయింది. భవిష్యత్తు అంతా అంధకారమయినట్లు భావించింది. తొందరగానే తేరుకున్నది కానీ, కాప్రాను మరచిపోలేకపోయింది. దాంతో చనిపోయిన కాప్రానే, ముందుగా అనుకున్న తేదీ నాడే పెళ్ళి చేసుకునేందుకు సిద్ధమయింది. ఈ పరిణామంతో రెండు కుటుంబాల వాళ్లు స్థాణువులయ్యారు. ఒప్పుకోలేదు. తన జీవితాన్ని వేరొకరితో పంచుకోలేననీ, అతడికి భార్యగానే జీవితాంతం ఉండిపోతాననీ వారికి నచ్చచెప్పిందామె. తాను తీసుకున్న సంచలన నిర్ణయాన్ని అమలు చేసే పనిలో పడింది. చనిపోయిన వ్యక్తితో పెళ్ళేంటంటూ చుట్టుపక్కల వాళ్లు, శ్రేయోభిలాషులు హెచ్చరించినా, పోలీసులకు ఫిర్యాదు చేసినా భయపడలేదు. కాప్రాతో పెళ్ళికి తనకు అనుమతినివ్వాలంటూ ప్రభుత్వానికి వినతిపత్రం ఇచ్చింది. ఆమెకు మద్ధతుగా మీడియా, మానవతావాదులు నిలిచారు. దాంతో ఈ విషయం దేశవ్యాప్తంగా చర్చనీయాంశమయింది. మొత్తానికి ఆమెకు వస్తున్న మద్ధతుకు తలొగ్గి ప్రభుత్వం కూడా ఈ పెళ్ళికి అంగీకరించింది. ప్రభుత్వమే సొంత ఖర్చులతో ఈ పెళ్ళి చేయించింది. అలా ఫ్రాన్స్‌లో మొట్టమొదటిసారిగా చనిపోయిన వ్యక్తిని పెళ్ళి చేసుకున్న మహిళగా జోడార్ట్ చరిత్రకెక్కింది.

అనుకోకుండా పెళ్ళికుమారుడు కానీ, పెళ్ళికూతురు కానీ దుర్మరణం పాలయినప్పుడు.. తమ కలలు కలలుగానే మిగిలిపోకుండా ఉండాలనుకునే వారికి జోడార్ట్ ఓ ఆశాదీపంలా కనిపించింది. ఆమె చేసిన పనినే తాము కూడా చేసేందుకు వేలాది మంది సిద్ధమయ్యారు. చనిపోయిన తమ ప్రియులతో పెళ్ళికి అవకాశం ఇవ్వాలంటూ ఫ్రాన్స్ ప్రభుత్వానికి మహిళల నుంచి కుప్పలుతెప్పలుగా దరఖాస్తులు వచ్చాయి. దీంతో ఏం చేయాలో తెలియక ప్రభుత్వం తలపట్టుకుంది. మొత్తానికి ఓ నిర్ణయానికి వచ్చి 1950వ సంవత్సరంలోనే ఓ చట్టం చేసింది. ఫ్రాన్స్ రాజ్యాంగంలోని ఆర్టికల్ 172 పౌర ప్రవర్తనా నియమావళి ప్రకారం ఈ చట్టానికి రూపకల్పన చేసింది. మరణించిన వ్యక్తితో పెళ్ళికి కొన్ని కఠిన నిబంధనలతో కూడిన చట్టానికి ఫ్రాన్స్ పార్లమెంట్ ఆమోదముద్ర వేసింది.

## నియమనిబంధనలివీ

చనిపోయిన వ్యక్తిని పెళ్ళి చేసుకునేందుకు ప్రభుత్వం కఠిన నిబంధనలతో కూడిన చట్టాన్నే రూపొందించింది. దీనికి చాలా కారణాలు కూడా ఉన్నాయి. చనిపోయిన వ్యక్తి.. భారీమొత్తంలో ఆస్తికి వారసుడయితే.. అతడి భార్యకు ఆ ఆస్తి దక్కుతుంది. ఇలా చాలామంది చనిపోయిన వ్యక్తిని పెళ్ళి చేసుకుని సొమ్ము చేసుకుంటున్నారు. వేదన మాటున దాగిన కుట్రను అడ్డుకునేందుకు ఈ చట్టంలోని నియమాలు చాలావరకూ ఉపయోగపడ్డాయి. మొదటగా చనిపోయిన వ్యక్తితో గతంలోనే తనకు నిశ్చితార్థమయిందని ధృవీకరించేలా సంబంధిత పత్రాలను జతచేసి దేశ అధ్యక్షుడికి 'పెళ్ళి కోసం'

**రెండు హృదయాలు ఏకం కావాలంటే గుండెచప్పుడు ఒకటవ్వాలి.. కానీ గుండె చప్పుడే లేని మనిషితో భాగస్వామికి పెళ్ళి అంటే నిజంగా అది చిత్రమే ! ప్రపంచంలో ఇలాంటి చిత్రమైన పెళ్ళిళ్ళు ఎన్నో విధాలుగా జరుగుతూ ఉంటాయి. . ప్రేమించిన మనిషిని మరణించిన తర్వాత కూడా పెళ్ళి చేసుకోవడం అత్యున్నత మైన భావోద్వేగాలకు చిహ్నం . అందుకు తార్కాణంగా నిలుస్తున్నాయి ఎన్నో జంటలు . ప్రభుత్వ చట్టాలు కూడా వారికి మద్దతిస్తున్నాయి . అదేంటో చదవండి .**



దరఖాస్తు చేసుకోవాలి. ఇలా చేరిన దరఖాస్తులను అధ్యక్ష కార్యాలయం.. సంబంధిత జిల్లాలకు పంపుతుంది. జిల్లా అధికారులు వాటిని సమీక్షించి, పోలీసులతో విచారణ జరిపి, బాధితులతో మాట్లాడి దరఖాస్తు న్యాయసమ్మతమేనని తేలితే మళ్లీ అధ్యక్షుడికి పంపుతారు. ఆ తర్వాత అధ్యక్షుడి నుంచి సమ్మతి పత్రం బాధితులకు అందుతుంది.

1. పెళ్ళి నిశ్చితార్థం తర్వాత ఇరు కుటుంబాల మధ్య ఎటువంటి గొడవ జరిగినట్లు తెలిసినా 'చనిపోయిన వ్యక్తితో పెళ్ళి'కి అనుమతినివ్వరు.

2. ఈ పెళ్ళి వల్ల బాధితురాలికి మరణించిన వరుడి కుటుంబ సభ్యుల ఆస్తిపై ఎటువంటి హక్కులు ఉండవు.

3. వధువుకు చేసే వైద్య పరీక్షల్లో ఆమె గర్భవతి అని తేలితే... చనిపోయిన వరుడి వల్లే ఆమె గర్భం దాల్చిందని రుజువయితేనే ఈ పెళ్ళికి అంగీకరిస్తారు.

4. వధువకు మాత్రమే కాదు.. ఆమెకు పుట్టబోయే పిల్లలకు కూడా తండ్రి తరపు వాళ్ల ఆస్తిపై హక్కులు ఉండవు. ఒకవేళ వారు ఇష్టపడి ఇస్తే మాత్రం తీసుకోవచ్చు.

5. పెళ్ళి జరిగిన వెంటనే వధువు వితంతువు అవుతుంది. ఆమె వరుడి ఇంటికి వెళ్లాల్సి ఉంటుంది.

6. వరుడి కుటుంబం ఒప్పుకుంటే, ఆమెకు మళ్లీ పెళ్ళి చేయొచ్చు. దీనితో ప్రభుత్వానికి ఎటువంటి సంబంధం ఉండదు.

7. వితంతువులకు ప్రభుత్వం నుంచి అందే సహాయాన్ని వీళ్లు కూడా పొందొచ్చు.

### పెళ్ళి జరిగే తీరు

హిందూ సంప్రదాయంలో వధూవరులిద్దరూ పీటలపై కూర్చుంటే పురోహితుడు పెళ్ళి చేస్తాడు. క్రిస్టియన్ పద్ధతిలో వధూవరులద్దరూ తమ అంగీకారం చెప్పిన తర్వాతే పెళ్ళి చేస్తారు. మరి ఈ మరణానంతర వివాహాల్లో వరుడు లేకుండా, వధువు ఒక్కతే ఉన్న సందర్భంలో పెళ్ళి ఎలా చేస్తారన్న సందేహం రావొచ్చు. అందుకే చట్టంలో దీనికి కూడా ఏర్పాట్లు చేశారు. చనిపోయిన వ్యక్తి ఫోటో పక్కన పెళ్ళి దుస్తుల్లో వధువు నిలబడుతుంది. అక్కడ ఉన్న పాస్టర్.. పెళ్ళి నీకు ఇష్టమేనా అని వధువును మాత్రమే అడుగుతాడు. వధువుకు సంబంధించిన ప్రమాణ పత్రాన్ని ఆమెతో చదివిస్తాడు. దీనిలో 'నేను మరణించేవరకూ నీకు తోడుగా ఉంటాను, నీతోనే జీవితాన్ని పంచుకుంటాను' అనే వాక్యాలను తొలగిస్తారు.

ఆ తర్వాత ఈ వేడుకలో పాల్గొనే మేయర్.. ప్రెసిడెన్షియల్ డిక్రీని చదువుతారు. 'వధువు భావోద్వేగాలకు అనుగుణంగానే ఈ పెళ్ళి జరుగుతోంది. భౌతికంగా వరుడు ఇక్కడ లేకున్నా మానసికంగా ఆమె ఆనందానికి ఈ విధంగా ప్రభుత్వం సహకరిస్తోంది' అని మేయర్ ప్రకటిస్తారు. ఆ తర్వాత వరుడి ఫోటో పక్కనే నిలబడి వధువు ఫోటో దిగి, పెళ్ళి ప్రమాణ పత్రంపై వధువు సంతకం చేస్తుంది. కొన్ని సందర్భాల్లో వధువుతోపాటు, చనిపోయిన వ్యక్తి కుటుంబ సభ్యులు కూడా ఒప్పుకుంటే వరుడి అస్థిపంజరాలను బయటకు తీసి పెళ్ళి జరిపిస్తారు. అయితే ఈ తరహా పెళ్ళికి చాలామంది ఒప్పుకోరు. ఒప్పుకుంటే మాత్రం ఈ పెళ్ళి వేడుక అతిథులు, స్నేహితులు, బంధువులతో కళకళలాడుతుందని ఫ్రాన్స్ ప్రజలు చెప్పుకుంటారు.

### అమెరికాలో కూడా

ఈ తరహా పెళ్ళిళ్ళు ఒక్క ఫ్రాన్స్‌లోనే జరుగుతాయనుకుంటే పొరపాటే. మనుషులు ఉండే ప్రాంతాలు వేరయినా వారి మనోభావాలు ఒకేలా ఉంటాయి. అందుకే అనేక దేశాలు చనిపోయిన వ్యక్తులతో పెళ్ళిళ్ళకు అంగీకరించాయి.

అమెరికా, ఇల్లినోయ్ రాష్ట్రం, బటావియాకు చెందిన 25 ఏళ్ల హాఫ్కిన్స్ వెన్నెముకకు సంబంధించిన వ్యాధితో బాధపడుతూ, తనకు చావు గ్యారెంటీ అని భావించి, తన ఆఖరి కోరికను సోదరుడికి వెల్లడించింది. తనకు అంత్యక్రియలకు బదులుగా పెళ్ళి వేడుకలు జరగాలని కోరింది. ఆమె కోరిక తెలుసుకున్న మానవతావాదులు, హాఫ్కిన్స్ ఫౌండేషన్ స్కాలర్‌షిప్ ఫండ్ పేరుతో డబ్బు సేకరించారు. ఆమె చనిపోయిన తర్వాత శ్మశానంలోనే ఆమె పెండ్లి వేడుకను నిర్వహించారు. దీన్నే 'మరణానంతర పెళ్ళి' అని అమెరికాలో పిలుస్తున్నారు.

### స్వర్గానికి వెళ్లడేమోనని ...

దక్షిణ కొరియాలోని యునిఫికేషన్ చర్చ్ నిర్వాహకులైన సన్ మ్యేయాంగ్ మూన్, హక్ జా హన్ దంపతుల రెండో కుమారుడు హ్యూంగ్ జిన్ మూన్ రోడ్డు ప్రమాదంలో చనిపోయాడు. అంతకు ముందే అతడికి జూలియా పాక్ అనే యువతితో పెళ్ళి నిశ్చయమయింది. వాళ్ల నమ్మకాల ప్రకారం పెళ్ళి కాకుండా చనిపోయిన వారు స్వర్గంలో ఉన్నత స్థానాలకు వెళ్లలేరు. అందుకే చనిపోయిన హ్యూంగ్‌కు పెళ్ళి వేడుకలు నిర్వహించారు. ఇదే దేశానికి చెందిన ప్రముఖ బాక్సర్ డుక్ కో కిమ్ కూడా తన ప్రేయసిని చనిపోయిన తర్వాతే పెళ్ళి చేసుకున్నాడు.

జర్మనీ చట్టాల ప్రకారం.. యూదులకు, ఇతర మతస్థులకు మధ్య పెళ్ళి నిషిద్ధం. ఈ కారణం వల్లే ఫ్రిట్జ్ ప్రెఫెర్, చార్లెట్ కలెట్టా పెళ్ళి ఆగిపోయింది. 1930 నుంచి వాళ్ల ప్రేమించుకుంటున్నా, చట్టాల కారణంగా పెళ్ళి చేసుకోలేకపోయారు. అయితే 1950వ సంవత్సరంలో ప్రెఫెర్ చనిపోయాడు. దీంతో అదే ఏడాది అతడిని చార్లెట్ 'మరణానంతర వివాహం' చేసుకుని తన ప్రేమకు సరికొత్త అర్థాన్ని చెప్పింది.

ఇలాగే దక్షిణాఫ్రికా, చైనా, జపాన్‌లోనూ వేరు వేరు కారణాలతో ఇలాంటి పెళ్ళిళ్ళు జరుగుతున్నాయి. ఇలా పెళ్ళిళ్ళు చేసుకున్నవారు తర్వాత వేరే వ్యక్తులను వివాహమాడినా.. చనిపోయిన వ్యక్తిని పెళ్ళి చేసుకునేందుకు సిద్ధమవ్వాలంటే కాస్త గుండె ధైర్యం కావాల్సిందే.

–కె.హసాన్
kandula.hassan@gmail.com

# సాఫ్ట్‌వేర్‌లో సరిగమలు

16

-కంఠంనేని స్వప్న



**"నీ వరకూ వచ్చేసరికి బాధ అర్థమవుతోందా?" అడిగాడు శ్రీకాంత్. కొద్దిగా వ్యంగ్యం ధ్వనిస్తోందనిపించింది అక్షయ్‌కి.**

**అప్పటికి దాదాపు గంట నుంచీ వాళ్ళిద్దరి మధ్యా వాదన జరుగుతోంది.**

**"మన దేశంలో ప్రతిదీ వ్యాపారం కింద ఎందుకు మారుతోంది? అమ్మ నుంచి అవయవాల వరకూ దేన్నయినా తడుముకోకుండా, అవలీలగా అమ్మి పారేస్తుంటే పోలీస్ డిపార్ట్‌మెంట్ ఏం చేస్తోంది?" అక్షయ్ ప్రశ్నించటంతో మొదలయిందా సంభాషణ.**

అక్షయ్ ఆశ్చర్యంగా చూస్తుండగా అడిగాడు శ్రీకాంత్.

"ఎప్పటి సంగతో వదిలేద్దాము. పోయిన సంవత్సరం ఒక ఛానల్‌లో కిడ్నీ రాకెట్ గురించి మారుమోగిపోయింది. చూసే ఉంటావు. మన తెలుగు రాష్ట్రాల్లోని మారుమూల ప్రాంతాల నుంచీ టీనేజర్లనీ, పాతికేళ్ల లోపు వాళ్ళనీ ప్రలోభపెట్టి శ్రీలంక పంపించి కిడ్నీలు ఒలుచు కుంటుంటే ఒక్కళ్ళయినా ప్రశ్నించారా?"

అక్షయ్ మాట్లాడలేదు.

నిజమే... టీవీలో అదీ ఒక వార్తే అన్నట్లుగా చూసి ఊరుకున్నాడప్పుడతను.

"ఆ పిల్లల తల్లిదండ్రులు తెలుసుకుని నెత్తీనోరూ బాదుకుని టీవీలకి ఎక్కేవరకూ ఎవరికీ తెలీలేదు. తీరా వాళ్ళు కిడ్నీ అమ్మినందుకు వచ్చే పరిహారంతో వాళ్ళ జీవితాలు సెటిల్ అయిపోయేంత డబ్బొచ్చిందా అంటే, అదీ లేదు. ఒక ఐఫోన్ కొనుక్కుని, నాలుగు రోజులు జల్సా చేయగానే డబ్బూ అయిపోతుంది, ఒంట్లో ఒక అవయవమూ మిస్ అయిపోతుంది."

"తెలిసో, తెలీకో పిల్లల అవయవాలను అమ్మేసుకుంటుంటే మీకేమీ సోషల్ రెస్పాన్సిబిలిటీ లేదా? మాఫియాకి వ్యతిరేకంగా పోరాడక్కర్లేదు. కనీసం ఆ ఊళ్ళల్లోకి

### జరిగిన కథ

అక్షయ్, కావ్య, సీమ, హర్ష ఓ మల్టీ నేషనల్ కంపెనీలో పనిచేస్తుంటారు. అక్షయ్ వాళ్ళ అక్కా, బావ యాక్సిడెంట్‌లో చనిపోవడంతో, వారి కూతురు నైరాని తన సంరక్షణలోకి తీసుకుంటాడు అక్షయ్. ఒక రోజు నైరా కనిపించకుండా పోతుంది. పోలీస్ ఇన్వెస్టిగేషన్ మొదలవుతుంది. పేపర్లలో వచ్చిన వార్తల ఆధారంగా, సీసీ ఫుటేజ్‌ల ద్వారా, ఇన్‌స్పెక్టర్ శ్రీకాంత్ ఇచ్చిన సమాచారం ఆధారంగా నైరా ఆచూకీ కోసం రకరకాలుగా ప్రయత్నిస్తుంటాడు అక్షయ్. ఆ ప్రయత్నాల్లో భాగంగా ఎంతోమంది చిన్న పిల్లలను కాపాడతాడు. నైరా ఆచూకీ కోసం కావ్య ఒక ఆన్‌లైన్ డిటెక్టివ్ ఏజెన్సీని కాంటాక్ట్ చేస్తుంది. ఒక కార్పొరేట్ హాస్పిటల్లో ఆర్గాన్ ట్రేడ్ జరుగుతోందని తెలుసుకుని రహస్యంగా లోనికి ప్రవేశించి అక్కడ ఓ చిన్నపిల్లను రక్షిస్తాడు అక్షయ్.

ఆ తర్వాత...

వెళ్ళి అవగాహన కల్పించే కార్యక్రమాలు చేపట్టాలని కూడా అనిపించలేదా? ఉన్నట్లుండి కిడ్నీ రాకెట్‌కి సంబంధించిన వార్తలు టీవీలో రావటం ఎందుకు ఆగిపోయాయో ప్రశ్నిస్తూ ఒక ఫోన్‌కాల్, లెటర్ లేదా ఎస్సెమ్మెస్ పంపారా?"

నిశ్శబ్దంగా వింటున్నాడు అక్షయ్.

శ్రీకాంత్ చెప్పినట్లుగా తనవరకూ వస్తేకానీ, తనకి అర్థం కాలేదు.

"నిన్ను మాత్రమే నేను తప్పుపట్టడం లేదు. పోలీసులు, పొలిటీషియన్లు, ప్రెస్, ప్రజలు అందరూ సామాజిక బాధ్యతని ఫీలయినప్పుడు మాత్రమే వ్యవస్థలో ప్రక్షాళన జరుగుతుంది. అంతవరకూ ఏ ఒక్కరి బాధ్యతో అనుకోవటం, ఏ ఒక్క సిస్టమ్‌నో తప్పుపట్టడం వల్ల ఉపయోగం ఉండదు."

"కానీ శ్రీకాంత్, శ్రీలంకకే ఎందుకు? మనదేశంలో ప్రతీ ఏటా కిడ్నీస్ ఫెయిల్ అయ్యేవాళ్ళూ, కిడ్నీకోసం ఎదురుచూసేవాళ్ళ సంఖ్య దాదాపు రెండు లక్షలు ఉందనీ, కిడ్నీ డోనర్లు మాత్రం అయిదువేలకి మించి లేరనీ చదివాను. ఇక్కడే ఇవ్వొచ్చుగా?" అడిగాడు అక్షయ్.

'ఇండియాలో ఇదివరకు ఆ అవకాశం ఉండేది. అయితే దానివల్ల మన దేశం ట్రాన్స్‌ప్లాంట్ టూరిజమ్‌కి కేంద్రంగా తయారయింది. విదేశీ పర్యాటకులు ఇండియావచ్చి వాళ్ళ దేశంలో అయ్యే ఖర్చులో నూరోవంతు ఖర్చుపెట్టి ఇక్కడ అవయవ మార్పిడి చేయించుకోవటంతో దాని చుట్టూ మాఫియా తయారయింది. బెదిరించో, భయపెట్టో, ప్రలోభపెట్టో, శారీరకంగా బలహీనంగా ఉన్న వారివీ, పిల్లలవీ, అవయవాలు విక్రయించడం మొదలుపెట్టారు. దానితో చట్టంలో కొన్ని మార్పులు చేయాల్సి వచ్చింది. ప్రస్తుతం ఉన్న చట్టం ప్రకారం దగ్గర బంధువులు మాత్రమే అవయవదానం చేయవచ్చు. అఫెక్షన్‌తో చేసే ఆర్గాన్ డొనేషన్ మన కంట్రీలో లీగల్‌గా వ్యవహరించబడుతోంది.

ఇందులోనూ లొసుగులున్నాయి. అఫెక్షన్‌ని ఎలా నిర్వచిస్తారు? దగ్గర బంధువులు ఇవ్వాలనే నిబంధనని అతిక్రమించటానికి బోలెడు దారులు. డోనర్‌ని ఆర్గాన్ రెసిపియెంట్ పెళ్ళి చేసుకుని మరీ అవయవ మార్పిడి చేయించుకున్న సంఘటనలు ఉన్నాయి" చెప్తున్నాడు శ్రీకాంత్.

'మనదేశంలో టైమ్‌కి అవయవ మార్పిడి జరగక ఏటా అయిదు లక్షల మంది చనిపోతుంటారు. ప్రతి ఇరవైలక్షల మందిలోనూ ఒక్కరే ఆర్గాన్ డోనర్ ఉన్నారంటే నమ్మగలవా? అదీ మన పరిస్థితి. అవసరం ఉన్న ప్రతిచోటా బిజినెస్ పుడుతుంది."

"శ్రీకాంత్, ఎక్కడో చదివాను. ఇరాన్, ఆస్ట్రేలియా, సింగపూర్‌లలో డబ్బులు తీసుకుని ఆర్గాన్ అమ్మవచ్చుని. ఆ దేశాల్లో ఆర్గాన్స్ మార్పిడి అవసరమయ్యే వారి సంఖ్య తగ్గిపోయిందట. సంబంధిత క్రైమ్‌రేట్ కూడా తగ్గిపోయిందని రాశారు" అన్నాడు అక్షయ్.

"అవయవాల్ని అమ్ముకోవటం ఆత్మగౌరవానికి భంగం కలిగిస్తుందని కొందరి వాదన. అయితే ఎవరి శరీరం మీద వాళ్ళకు హక్కు లేకపోవటం, వారి శరీరంలో భాగాన్ని వారు అమ్ముకోలేకపోవటం ఆత్మగౌరవానికి మరింత భంగం కలిగిస్తాయనీ మరికొన్ని వర్గాలు వాదిస్తాయి. రెండూ కరెక్టే అనిపిస్తాయి మనలాంటి వాళ్ళకి. ఒకటి మాత్రం నిజం. అవయవదానం చేసిన తర్వాత అవసరమైన సంరక్షణ మాత్రం డోనర్స్‌కి లభించదు. వచ్చిన డబ్బు మూడు, నాలుగు నెలల్లో అయిపోతుంది. ఏదయినా ఇన్‌ఫెక్షన్ సోకినా పట్టించుకునే దిక్కు ఉండదు. చాలామంది బరువు పనులు జన్మలో చేయలేకపోవచ్చు. సాధారణంగా డబ్బు కోసం అవయవదానం చేసేవారు ఇలాంటి పనులు చేసేవాళ్ళే అయ్యుంటారు. తిండి సంపాదించుకునే దారిలేక, ఇన్‌ఫెక్షన్ సోకితే దిక్కులేక చనిపోతుంటారు."

'అసలు బ్రతికున్న వాళ్ళవే ఎందుకు? చనిపోయిన వాళ్ళవి తీసుకోవచ్చుగా?' అడిగాడు అక్షయ్.

"వృద్ధాప్యం వల్ల చనిపోయినవాళ్ళ ఆర్గాన్స్‌ని తీసుకున్నప్పుడు కేన్సర్ వంటి వ్యాధులు వచ్చే అవకాశాలున్నాయి. అదే బ్రతికున్న వారి నుంచి తీసుకున్న అవయవాలను అవసరమైన వారికి పెట్టవచ్చు. ప్రత్యేకంగా తమ అవయవాల్ని తీసుకోకూడదని వాళ్ళు బ్రతికుండగా రాస్తే తప్ప, మన దేశం లాంటి చోట్ల ఆర్గాన్ డొనేషన్‌కి, ముందుగా సమ్మతిస్తే తప్ప చనిపోయాక అవయవాల్ని తీసి అవసరమైన వారికి ఇవ్వలేము. కొన్నిదేశాల్లో ఉరిశిక్ష పడిన వాళ్ళ అవయవాలు అవసరమైన వారికి ఇచ్చే హక్కు గవర్నమెంట్‌కి ఉంటుంది" అన్నాడు శ్రీకాంత్.

"మనదేశంలో కూడా అలాంటి చట్టం రావాలి. నైరాని కిడ్నాప్ చేసినవాడి ఒళ్ళంతా కోసి ఒక్కో భాగం ఒక్కొక్కరికి అమర్చాలి" కసిగా అన్నాడు అక్షయ్.

జాలిగా చూశాడు శ్రీకాంత్.

"బాక్ టు బిజినెస్. నేనొకతనికి సంబంధించిన వివరాలు నీకిస్తాను. ఆర్గాన్‌ట్రేడ్ మాఫియాలో అతనిది ముఖ్యపాత్ర అని విన్నాను. డాక్టర్లకీ, డోనర్లను ఎత్తుకొచ్చే ముఠాకీ, అవయవ మార్పిడి అవసరమయ్యేవారికీ అతను మధ్యవర్తిగా ఉంటాడన్నది మాకొచ్చిన ఇన్‌ఫర్మేషన్. రెండురోజుల్లో ఒక బిలియనీర్ బిజినెస్‌మాన్ మనవరాలికి గుండె మార్పిడి జరగబోతోందనీ, దానికోసం ఆ ఆపరేషన్‌కి అవసరమైన లివింగ్ డోనర్, ఆ వయస్సు పిల్లలనే తెచ్చి ఉంచాడనీ సమాచారం ఉంది. నువ్వేమైనా చేయగలవేమో ప్రయత్నించు" అన్నాడు శ్రీకాంత్.

వివరాలన్నీ నోట్ చేసుకున్నాక అడిగాడు అక్షయ్.

"ఇందులో కూడా ఎవరైనా పలుకుబడి ఉన్న వాళ్ళ ప్రమేయం ఉందా?"

'మా ఐజీకి ఇందులో పార్ట్‌నర్‌షిప్ ఉందని ఒక రూమర్ ఉంది. ఇంతవరకూ దానికి సంబంధించిన ఆధారాలైతే లేవు. కానీ రిస్క్ తీసుకోదల్చుకోలేదు" చెప్పాడు శ్రీకాంత్

*'***

శనివారం... పొద్దున్న పదవుతోంది.

బలవంతంగా కాళ్ళీడ్చుకుంటూ ఆఫీస్‌లో అడుగు పట్టింది కావ్య.

రిసెప్షన్ డెస్క్ ఖాళీగా ఉంది.

శనివారాలు వీళ్ళుండరన్న మాట అనుకుంది కావ్య.

కార్పెట్ క్లీన్‌చేసేవారూ, ఫ్లోర్ తుడిచేవాళ్ళూ కబుర్లు చెప్పుకుంటూ తాపీగా పని చేసుకుంటు

న్నారు.

తమ ఫ్లోర్‌లో అడుగుపెట్టిన కావ్య ఆశ్చర్యపో యింది.

చాలా క్యూబ్స్‌లో లైట్లు వెలుగుతున్నాయి.

ఆఫీస్ మొత్తం కాకపోయినా, దాదాపు ఇరవై మంది వరకూ ఉన్నారు.

అనవసరంగా భయపడింది తను. ఇంతమంది ఆఫీస్‌లో ఉంటారనుకోలేదు. వీకెండ్ కదా... ఎవరూ ఉండరనుకుంది. రాజేష్ వచ్చి వేధిస్తాడేమోనని భయపడింది.

బ్యాగ్‌లో నుంచీ ల్యాప్‌టాప్ తీసి తన క్యూబ్‌లో కనెక్ట్ చేసుకుంది.

మెయిల్‌బాక్స్ ఓపెన్‌చేసి మెయిల్ చెక్ చేస్తుం డగా క్యూబికల్ గోడ మీద మునివేళ్ళతో చప్పుడు...

ఉలిక్కిపడి పక్కకు చూసింది కావ్య.

మనోహర్ నిలబడి ఉన్నాడు. అతని చేతిలో ఏదో ప్రింటవుట్.

"రాజేష్‌కి చెంచాగాడు. వీడు నాశనమవ్వాలి" కసిగా లోపల తిట్టుకుంది.

పైకి అమాయకంగా మొహంపెట్టి 'హాయ్ మనోహర్!' అంది.

ప్రింటవుట్ అందించి చెప్పాడు.

"ఈ లిస్ట్‌లో ఉన్నవన్నీ పూర్తిచేయి. మెయిల్ కూడా పంపాను. నేనీలోగా ఇంకా మిగిలి ఉన్న పనులన్నీ ప్రింటవుట్ తెస్తాను."

తలూపింది కావ్య.

అక్షయ్ క్యూబ్ వైపు చూసింది అనుకోకుండా.

ఖాళీగా కనబడుతోంది.

ఫ్లోర్, ఆఫీస్, ప్రపంచమంతా బోసిపోయిన ట్లుగా అనిపించింది కావ్యకు.

నిట్టూర్చి పనిలో పడింది.

పని ఎంతకీ తెగనివ్వడం లేదు మనోహర్.

మాటిమాటికీ చాట్‌లో పింగ్‌చేసి అదివరకె ప్పుడో ఆమె రాసిన కోడ్‌కి సంబంధించిన ప్రశ్నలు అడుగుతున్నాడు.

లేచి వెళ్ళి చెంప పగలగొట్టి రావాలనిపిస్తోంది కావ్యకు.

అతికష్టం మీద పనిమీద ఫోకస్ చేయటానికి ప్రయత్నిస్తోంది.

కళ్ళు మూసి తెరిచేసరికి లంచ్‌టైమ్ అయినట్లని పించింది.

డెస్క్ వద్దే కూర్చుని లంచ్ బాక్స్ తెరిచింది.

మంచినీళ్ళు తెచ్చుకోవటానికి లేచినప్పుడు గమనించింది.

దాదాపు చాలామంది పని పూర్తి చేసుకుని వెళ్ళిపోయినట్లున్నారు.

నలుగురైదుగురు మాత్రమే కనబడుతున్నారు.

చేతిలో శాండ్‌విచ్‌తో ఆమె క్యూబ్ వద్దకు వచ్చాడు మనోహర్.

తింటూ కబుర్లలో పెట్టాడు కావ్యని.

"చూశావు కదా...వీకెండ్ ఎంతమంది ఆఫీస్‌కి వస్తారో. ఎందుకు చిన్నవిషయానికి అనవసరంగా గొడవ చేశావు? హెచ్.ఆర్. వరకూ వెళ్ళింది కదా విషయం" అడిగాడు.

"తమదారిలోకి తెచ్చుకోవటానికి సామ, దాన, భేద, దండోపాయాలన్నీ వాడుతున్నారు. తను మంచిదేకానీ వీళ్ళ ఎత్తుగడలకి పడిపోయేంత అమాయకురాలు కాదు" అనుకుంది కావ్య.

మరుక్షణం పెద్ద కథ అల్లింది.

తన చేతికి కార్పల్ టెన్నెల్ వ్యాధి మొదలయిందనీ, డాక్టర్ రెస్ట్ అవసరం అని చెప్పాడంది. కనీసం వారానికి రెండు రోజులయినా రెస్ట్ ఇవ్వకపోతే సర్జరీ అవసరమవుతుందని హెచ్చరించాడంది.

నమ్మినట్లుగా కనబడలేదతను.

భుజాలెగరేసి "ఐసీ" అన్నాడు అనుమానంగా చూస్తూ.

"రాజేష్‌తో నీకెందుకు పడదు?" ఆరా లాగుతు న్నట్లుగా అన్నాడు.

స్నేహం నటిస్తూ కూపీ లాగుతున్నాడు. తను అతని సంగతి అందరికీ చెప్తున్నదేమో కనుక్కోవ డానికి వీడిని పంపినట్లున్నాడు రాజేష్.

"ఎందుకు పడదు? అలా ఏమీలేదే!" అంది కావ్య.

"నువ్వు ఇంకొంచెం సోషల్‌గా ఉండాలి. అంద రితో కలవాలి. లంచ్‌లూ, డిన్నర్‌లకీ వెళ్తుండాలి. అందులో తప్పేమీలేదు. ఒక ఫ్రెండ్‌లా చెప్తున్నాను.




**సడన్‌గా మెలకువ వచ్చింది అక్షయ్‌కి. పొత్తికడుపులో నొప్పిగా ఉంది. పొట్టను చేత్తో అదుముకుంటూ, పక్క మంచం వైపు చూశాడు. అక్కడ నైరా! ఉలిక్కిపడ్డాడు. కలో నిజమో అర్థం కాలేదు. నైరా... అంటూ పెద్దగా అరుస్తూ లేవబోయాడు. అసలేం జరిగింది? అతడికి నిజంగానే నైరా కనిపించిందా?**

ఆపై నీ ఇష్టం" సలహా ఇస్తున్నట్లుగా అన్నాడు.

"నీ ఇంట్లో ఆడవాళ్ళకు కూడా ఇదే సలహా ఇవ్వరా?" గొణుక్కుంది.

పైకి నవ్వింది.

లంచ్ ముగించి వెళ్ళిపోయాడతను తన డెస్క్ దగ్గరకి.

నాలుగవుతుండగా వచ్చాడు బాగ్ భుజానికే సుకుని.

"నేను వెళ్తున్నాను. ఏమైనా క్వశ్చన్స్ ఉంటే ఫోన్‌చేయి" చెప్పి వెళ్ళిపోయాడు.

చుట్టూచూసింది కావ్య.

ఆఫీస్‌లో ఒక్క పురుగు కూడా కనిపించట్లేదు.

ఈ సాంబ, రోహిణి, సీమ మాటలు విని అన వసరంగా వచ్చిందీరోజు తను.

ఒక్కళ్ళు కూడా రాలేదు.

ఇంకా చాలా పనుంది.

బిక్కుబిక్కుమంటోంది ఆమెకు.

ఏదో తెలియని భయం.

రోహిణికి ఫోన్ చేసింది.

స్విచ్‌డ్ ఆఫ్ అని వస్తోంది.

తిట్టుకుంటూ పనిలో పడింది.

ఫ్లోర్‌కి నాలుగువైపులా ఉన్న గాజుగోడల నుంచీ బయట చీకటవ్వటం కనబడుతోంది.

లైట్ల వెలుతురులో ఆఫీస్ బయట స్పోర్ట్స్ గ్రౌండ్, పార్కింగ్ లాట్ నిర్మానుష్యంగా, నిశ్శ బ్దంగా కనబడుతున్నాయి.

పార్కింగ్ లాట్ దారికి రెండువైపులా క్రోటన్స్ పొదల్లా పెరిగి నీట్‌గా కత్తిరించబడి ఉన్నాయి. ఆ దారి చూస్తుంటే కావ్యకి అందమైన, ఆరోగ్యంగా మెరుస్తున్న పాము గుర్తొస్తోంది.

బయటికి చూడకుండా సిస్టమ్‌మీదే దృష్టి పెట్ట డానికి ప్రయత్నిస్తోంది.

అప్పుడు అడుగుపెట్టాడు ఫ్లోర్‌లోకి రాజేష్.

బాగా మేకప్ కొట్టుకుని వచ్చాడని చూడగానే అర్థమవుతోంది.

గుప్పున డియోడరెంట్ వాసన ఫ్లోర్ అంతా కొడుతోంది.

"హౌ ఈజ్ ఇట్ గోయింగ్?" కావ్య డెస్క్ దగ్గర కొచ్చాడు.

"చాలావరకూ అయిపోవచ్చింది. ఇంకో అర

గంటలో పనయి పోతుంది" చెప్పింది కావ్య.

"ఏదయినా సహాయం కావాలంటే అడుగు, ఎనీథింగ్ ఫర్ యూ. చాలా అలసి పోయినట్లు కనబడుతున్నావు" ఆమె భుజం మీద అవసరం లేకపోయినా చేయివేసి చెప్పాడు.

అప్పుడే ఫ్లాష్ వెలిగింది.

ఫ్లోర్‌లోకి ఎప్పుడొచ్చారో సాంబ, సీమ ఇద్దరూ ఉన్నారు. కావ్యకి పట్టలేనంత సంతోషం కలిగింది. ఫోన్‌తో ఫోటో తీసినట్టున్నాడు సాంబ.

ఫోన్ రాజేష్‌కి కనబడేట్లుగా ఊపుతున్నాడు.

తత్తరబిత్తర లాడాడు రాజేష్.

"క్లాక్, ఆఫీస్, కంప్యూటర్, మీరిద్దరూ పడేట్లుగా ఫోటో తీశాను.

కంప్యూటర్ జూమ్‌చేసి చూస్తే డేట్ కూడా కనబడుతుంది. ఇందుకే నువ్వు కావ్యని ఆఫీస్‌కి రమ్మని వేధిస్తున్నావని హెచ్.ఆర్‌కి చెప్తాను" రాజేష్‌తో గుస గుసగా అన్నాడు.

"మనం మాట్లాడుకుందాం. స్నేహపూర్వకంగా సాల్వ్ చేసుకుందాం" సాంబని బ్రతిమిలాడుతున్నట్లుగా అన్నాడు రాజేష్.

సీమ ముక్కు ఎగబీలుస్తూ "కంపు, ఛీ" అంటోంది.

"ఏదో చచ్చినట్లుంది. క్లీనింగ్ వాళ్ళకి ఫోన్ చేయాలి" అంది.

"చచ్చిపోవటం కాదు. రాజేష్ ఏదో పర్‌ఫ్యూమ్ కొట్టుకొచ్చినట్లున్నాడు. దాని వాసన" మొహంలో ఎక్స్‌ప్రెషన్ లేకుండా అంది కావ్య.

రాజేష్‌కి అవమానంగా అనిపిస్తోంది.

సీమ, కావ్య ఇద్దరినీ బిల్డింగ్ మీద నుంచీ తోసేయాలనిపిస్తోంది.

అతికష్టం మీద కోపం కంట్రోల్ చేసుకుంటున్నాడు.

సాంబ తీసిన ఫోటో ఒక కారణమయితే, అది ఏయే వాట్సాప్ గ్రూపుల్లో పెట్టేసుంటాడో అనే టెన్షన్ మరో కారణం.

ఇంతలో సీమ రాజేష్ చేయి పట్టుకుని వేలాడుతూ అంది.

"డిన్నర్‌కి ఎప్పుడు వెళ్దాం?"

అతనికి సీమతో డిన్నర్ అంటేనే భయం వేస్తోంది.

ఉక్రోషంగా సాంబతో అన్నాడు, "వాళ్ళు నా చేతులు పట్టుకోవచ్చు కానీ నేను ఫ్రెండ్లీగా భుజం మీద చేయివేస్తే సెక్సువల్ హెరాస్‌మెంటా? ఇంత వివక్ష పనికి రాదు."

కావ్యని ఆ రోజు ఇంటి వద్ద తనే డ్రాప్ చేసింది సీమ.

***

రిసెప్షన్ ఏరియాలో వెయిట్ చేస్తున్నాడు అక్షయ్. మధ్యదళారుల ద్వారా సంపాదించిన చిన్నస్లిప్ లోపలికి పంపాడు.

అర్ధచంద్రాకారంలో రోజ్‌వుడ్‌తో చేయబడి నిగనిగలాడుతోంది రిసెప్షన్ డెస్క్. సన్నగా చిన్నగా ఉందా రిసెప్షనిస్ట్. లోపల ఆర్గాన్స్ అన్నీ తీసేసి బోన్స్‌ని చర్మంతో మూసేసి కుట్టినట్లుగా ఉందామె.

తెల్లటి గచ్చుమీద గోధుమ రంగు డిజైన్ అక్కడక్కడ కనపడుతోంది.

ఫోన్ పెట్టేసి అక్షయ్ వైపు తిరిగి నవ్వింది రిసెప్షనిస్ట్.

"మీరు లోపలికి వెళ్ళొచ్చు."

సెక్యూరిటీ అతనికి అక్షయ్‌ని లోపలికి తీసుకెళ్ళే బాధ్యత అప్పజెప్పింది.

సెక్యూరిటీ అతన్ని అనుసరిస్తున్న అక్షయ్ ఆ ఆఫీస్‌లో ఉన్న ఇన్‌ఫ్రాస్ట్రక్చర్‌నీ, అత్యాధునిక వసతుల్నీ చూసి ఆశ్చర్యపోయాడు. డబ్బు వెదజల్లినట్లుగా ఉంది ఆఫీస్. ఎక్కడికక్కడ ఖరీదైన కార్పెట్స్, పెయింటింగ్స్ సెన్సర్స్‌తో పనిచేసే లైట్లు, ఎస్కలేటర్, ఫాల్స్ సీలింగ్స్, షాండ్లియర్లు అమర్చి ఉన్నాయి. అక్షయ్‌కి ఆఫీస్ అంతా కిడ్నీలు, గుండె, లివర్‌లను సర్ది పెట్టినట్లుగా, రక్తం ప్రవహిస్తున్నట్లుగా అనిపిస్తోంది.

'అతుల్ షా' బోర్డ్ కనబడుతున్న రూమ్ ముందుకొచ్చి ఆగారు వాళ్ళు.

రూమ్ చూపించి వెళ్ళిపోయాడు సెక్యూరిటీ.

తలుపు ఒకసారి తట్టి డోర్ ఓపెన్ చేశాడు.

అదొక విశాలమైన గది. మూడు బెడ్‌రూమ్‌ల అపార్ట్‌మెంట్‌ని గోడలు తీసేసి ఒకే గదిగా మార్చినట్లుగా ఉంది. లోపల ఫర్నీచర్ చాలా తక్కువగా ఉండడం వల్లనేమో మరింత విశాలంగా కనిపిస్తోంది.

చిన్నషెల్ఫ్, రెండు సోఫాలు ఒక వైపు ఉండగా, ఎరుపురంగు షవర్ చెయిర్ మరో వైపు ఉంది. దానికి వీల్స్ కూడా ఉన్నాయి. ఆ రూమ్ అర్ధచంద్రాకారంలో ఉంది. పెద్దపెద్ద ఫ్రెంచ్ విండోస్ ఉన్నాయి. గది పొడుగునా, పల్చటి పరదాలు గాలికి కదులుతున్నాయి.

డోర్ ఓపెన్ అయిన శబ్దానికి తిరిగిచూశాడు చెయిర్‌లో కూర్చుని విండో గుండా బయటికి చూస్తున్న అతుల్.

దాదాపు యాభై ఏళ్ళుంటాయి. అతణ్ణి చూస్తుంటే ఒకప్పుడు చాలా అందంగా ఉండి ఉంటాడనిపిస్తోంది. కళ్ళజోడు పెట్టుకుని నిర్మలంగా కనబడుతున్నాడు.

"చూడటానికి చదువుకున్న వాడిలా కనబడుతున్నావు. కిడ్నీ, లివర్‌లు ఎందుకు డొనేట్ చేయాలనుకుంటున్నావు?" అడిగాడు.

"చదువుకున్నాను కాబట్టే! మనిషి బ్రతకటానికి ఒక కిడ్నీ చాలు. లివర్‌లో కొంత భాగం ఇచ్చినందువల్ల నా ప్రాణానికి వచ్చే ముప్పేమీ లేదని తెలుసు. అదీకాక డబ్బు అత్యవసరం. గాంబ్లింగ్‌లో చాలా డబ్బు నష్టపోయాను. అప్పులవాళ్ళతో పడలేక పోతున్నాను" బాధగా మొహంపెట్టి చెప్పాడు అక్షయ్.

నవ్వాడతను.

"దట్స్‌గుడ్. నేను కూడా నీ అభిప్రాయాలతో

## వానపాటలకు కాజల్ కండిషన్స్



ఒకప్పుడు వానపాటలు సినిమాల్లో కామన్. ఇప్పుడు వాటి జోరు కొద్దిగా తగ్గినా, తిరిగి అవి సినిమాల్లో దర్శనమిస్తున్నాయి. తాజాగా కాజల్ దగ్గరకి ఓ ఆఫర్ వచ్చింది. అదీ వానపాట ఆఫర్! మొదట చేయనని మొండికేసిందట కాజల్! దాంతో నిర్మాత ఫ్యాన్సీ అమౌంట్ ఆఫర్ చేసేసరికి ఒప్పేసుకుందట! కాకపోతే ఆ పాట షూట్ చేసేటప్పుడు ఎవరూ ఉండకూడదని కండిషన్ పెట్టిందట! కెమెరామెన్ తప్ప ఎవరూ ఉండకూడదన్న కాజల్ కండిషన్‌కి నిర్మాత సై అన్నాడట! కాకపోతే ఈ పాటకి ఆ నిర్మాత కాజల్‌కి ఎంత సమర్పించుకుంటున్నాడన్న వివరాలు మాత్రం తెలియరాలేదు.

ఏకీభవిస్తాను. అవసరంలేని పార్ట్ ఏవీ శరీరంలో ఉండకూడదు. రెండవ కిడ్నీ, అపెండిక్స్, జ్ఞానదంతాలు, టాన్సిల్స్ ఇటువంటివేవీ మనిషికి అవసరం లేదు. నా రూమ్ చూస్తుంటే అర్థం అవ్వచ్చు... నేనెంత మినిమలిస్ట్‌నో! అవసరం లేని ఏ వస్తువూ ఈ రూమ్‌లో నీకు కనబడదు."

"మీరు నడవలేరా? వీల్ చెయిర్..?" సగంలో ఆపేశాడు అక్షయ్.

"డాక్టర్లు చేసిన కొన్ని తప్పులకి నేను విక్టిమ్ అయ్యాను. విదేశాల్లో ఎంబీఏ చదివొచ్చి మా నాన్న బిజినెస్‌ని అందిపుచ్చుకుని సక్సెస్‌ఫుల్‌గా నడిపిస్తున్న రోజులవి. ఒకరోజు ఛాతిలో బరువుగా అనిపిస్తోందనీ, ఊపిరి పీల్చడం కష్టమవుతోందనీ డాక్టర్‌కి చూపించుకున్నాను. హార్ట్ డిసీజ్ అని మందులిచ్చారు. అవి వాడుతుండగా కిడ్నీస్ మీద అవి చూపిస్తున్న ప్రభావాన్ని గమ నించలేకపోయారు."

"దాంతో డయాలిసిస్ చేయించుకోవాల్సి వచ్చేది. డయాలిసిస్‌ని నా శరీరం తట్టుకోలేక పోయింది. డయాలిసిస్ అవసరం పడినప్పుడే కిడ్నీ అవసరమైన వాళ్ళ వెయిటింగ్ లిస్ట్‌లో పేరు చేర్చాలి. ఆ విషయాన్ని డాక్టర్లు మర్చిపోయారు. ఆ సంగతి మాకు తెలిసేసరికే రెండేళ్ళు గడిచింది. కిడ్నీలు క్రిటికల్ కండీషన్‌కి చేరుకున్నా నా పేరు వెయిటింగ్ లిస్ట్‌లో కింద ఉండిపోయింది."

"అదొక్కటేనా? వాళ్ళు స్టంట్ వేసేప్పుడు అజాగ్రత్తగా ఉండటం వల్ల అది ఆర్టరీని తెరిచి పెట్టాల్సింది పోయి మాయమయింది. దాన్ని వెతకటం కోసం నా కాలుని కట్ చేశారు. అయినా దొరకలేదు. మరోసారి ఆర్టరీని పంక్చర్ చేశారు. అప్పుడు చచ్చి బ్రతికాను."

"ఒకసారి ఇన్‌ఫెక్షన్ సోకి చాలా సీరియస్ అయింది."

"ఇదంతా జరుగుతున్నప్పుడు పేపర్లో ఒక వార్త నా కంటపడింది, కిడ్నీ అమ్ముతున్న గ్యాంగ్ గురించి. వాళ్ళ ద్వారా కిడ్నీ మార్పించుకున్నాను. గుండె మార్పించుకున్నాను. కాళ్ళు మాత్రం ఆ డాక్టర్ల ప్రయోగాల వల్ల కదలలేకుండా అయ్యాయి. ఏదో ఒక మిరకిల్ జరుగుతుంది. అప్పుడు కాళ్ళు మార్పిడి కూడా చేయించుకోవచ్చు" చెప్తుంటే అతని కళ్ళలో ఆశ తళుక్కుమంటోంది.

"అవయవాల మార్పిడిని పెద్దనేరం కింద చూడక్కర్లేదు. నా విషయంలో డాక్టర్లు చేసిన తప్పులకు ఎవరు బాధ్యత వహించారు? నేనే సఫర్ అయ్యాను. నయానో భయానో ఆర్గాన్స్ ట్రేడ్ జరపటంలో తప్పేమీ లేదు" నమ్మకంగా చెప్తున్నాడు అతుల్.

అక్షయ్‌కి అతన్ని విక్టిమ్‌గా భావించాలో, డాక్టర్లు పదేపదే చేసిన తప్పుల కారణంగా జీవితంలో ప్రైమ్‌టైమ్‌లో ఎన్నో బాధలు పడి సైకోగా మారినందుకు జాలిపడాలో అర్థం కాలేదు.

"ఇక్కడ బిల్డింగ్‌లోనే ఆర్గాన్ తీసుకోవటం, అవసరమైన వారికి అమర్చటం జరిగిపోతుంది. సెక్యూరిటీ సిస్టమ్స్ అడుగడుగునా ఉన్నాయిక్కడ. కాబట్టి ఇక్కడ జరిగేదేదీ బయటకిరాదు. చాలా సీక్రెట్‌గా మొత్తం జరిగిపోతుంది" గర్వంగా అన్నాడు అతుల్.

బేరం రెండు లక్షల దగ్గర మొదలెట్టాడు. అతనికి దాదాపు కోటి వరకూ వస్తుందనే విషయం తెలుసు అక్షయ్‌కి. అతనికి అనుమానం రాకుండా పది లక్షలు కావాలని నెగోషియేట్ చేశాడు. చివరకు ఎనిమిది లక్షలకు సెటిల్ చేసుకున్నాడు.

అక్షయ్ వివరాలు నోట్ చేసుకుని చెయిర్‌కి ఉన్న బటన్ నొక్కాడు అతుల్.

ఇందాక తనకి తోడొచ్చిన సెక్యూరిటీ గార్డ్ లోపలికొచ్చాడు.

"ఆల్ ది బెస్ట్" అన్నాడు అతుల్.

"ఈ పనికి బెస్ట్‌విషెస్ చెప్తావేంటిరా? మెంటల్ వెధవా!" మనసులో తిట్టుకుంటూ షేక్‌హాండిచ్చి సెక్యూరిటీ గార్డ్ వెనక నడిచాడు అక్షయ్.

మరో ఫ్లోర్‌కి తీసుకెళ్ళాడతను అక్కడ నుంచి.

పెద్దపెద్ద ఇనపడోర్లున్నాయి గదులకి.

చల్లటి ఏసీ గాలి వీస్తోంది.

ఆకుపచ్చ రంగు బట్టలు ఇచ్చి మార్చుకోమన్నాడతను.

పక్క బెడ్ ఖాళీగా కనబడుతోంది.

"ఈ గదిలో ఎవరూ లేరేమిటి?" అడిగాడు అక్షయ్.

"ఆపరేషన్ జరుగుతోంది. కాసేపయితే వచ్చేస్తుంది" చెప్పాడతను.

బట్టలు మార్చుకుని రాగానే ఇంజక్షన్ ఇచ్చాడు అతను.

ఏ వంకచెప్పి తప్పించుకోవాలో ఆలోచిస్తుండగానే గుచ్చి చెప్పాడు.

"బీ విటమిన్ ఇంజక్షన్. భయపడకండి."

అతను వెళ్ళగానే అక్షయ్ డోర్ తెరచుకుని బయటికొచ్చి చూశాడు.

తన రూమ్ లాంటివే మరో రెండున్నాయి.

లాక్ చేసుండడంతో తీయటం కుదరలేదతనికి

కాస్త దూరంలో సర్జికల్ వార్డ్‌లా కనబడుతోంది. మొహాలకి మాస్కులు ధరించిన డాక్టర్లు హడావుడిగా తిరుగుతున్నారు. సోఫాల్లో ఆర్గాన్ గ్రహీతల బంధువులున్నట్టున్నారు. మొహాల నిండా ఆందోళనతో సర్జరీ జరుగుతున్న రూమ్‌వైపూ, వాచ్‌లవైపు చూసుకుంటున్నారు.

ఏమి చేయాలో ఆలోచిస్తూ లోనికివచ్చి తన బెడ్‌మీద కూర్చున్నాడు.

కాసేపటికి అతనికి నిద్ర పట్టేసింది.

అలా ఎంతసేపున్నాడో తెలీదు. సడన్‌గా మెలకువొచ్చింది అతనికి. పొత్తి కడుపులో నొప్పిగా ఉంది.

"అమ్మా!" నొక్కుకున్నాడు.

నెత్తురు చేతికంటుకుంది.

ఉలిక్కిపడి లేవబోతూ పక్క మంచం వైపు చూశాడు.

అక్కడ నైరా...!

అప్పుడే గుండెని కోసి తీసేసినట్టున్నారు.

రక్తం ఉబికి ఉబికి కిందకి కారుతోంది.

నిశ్చలంగా నైరా...!

"నైరా!" పెద్దగా అరిచాడు.

పైకి లేవబోయాడు. మత్తుమందిచ్చారేమో కాళ్ళు సహకరించడం లేదు.

నడుమంతా సుత్తితో కొడుతున్నంత నొప్పి.

**(ఇంకా వుంది)**

## ఈ ప్రేమ కూడా అటకెక్కేసిందా?



*రేపో మాపో ఇద్దరూ పెళ్ళిపీటలెక్కడం ఖాయం అనుకుంటున్న సమయంలో ఆ ఇద్దరూ ఎడమొఖం పెడమొఖంగా ఉంటున్నారు. ఆ ఇద్దరూ ఎవరు అన్న అనుమానం వస్తోంది కదా? నయనతార, తమిళ దర్శకుడు విఘ్నేష్ శివన్‌లే! వీరిద్దరూ పీకల్లోతు ప్రేమలో మునిగారన్న సంగతి అందరికీ తెలిసిందే! ఈ వ్యవహారం ఇప్పుడు బెడిసి కొట్టింది అంటున్నారు తమిళ తంబీలు. ఈ వార్త మీద ఇద్దరూ నోరు విప్పకపోయినా నయన మాత్రం చేతలలో చూపిస్తోంది. ఎలాగంటే వరుసపెట్టి సినిమాల మీద సినిమాలు ఒప్పుకుంటోంది. నయన స్పీడును బట్టి మరో రెండు సంవత్సరాల వరకూ నయనకు పెళ్ళి చేసుకునే తీరిక దొరకకపోవచ్చు. మరి అంతవరకూ విఘ్నేష్ ఊరుకోవాలి కదా? విఘ్నేష్ పర్మిషన్ తీసుకునే నయన సినిమాలు ఒప్పుకుంటోందా లేక బంధాన్ని తెంచుకుని సినిమాలు ఒప్పుకుంటోందా? అన్న అనుమానం అందరికీ కలుగుతోంది. ఏది ఏమైనా నయనతారకు ఈ బంధం కూడా బెడిసి కొట్టినట్టే అన్నది కోలీవుడ్ హాట్ టాపిక్.*



# పిల్లలకు పండ్లు ఇస్తున్నారా?

**తాజా పండ్లు, కూరగాయలతో చక్కటి ఆరోగ్యం సొంతమవుతుందని ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు. చిన్నపిల్లల నుంచి పెద్దవాళ్ళ వరకు ఎవరికైనా సరే పోషకాహారం అత్యవసరం. అందుకే పండ్లు, కూరగాయలు ఎక్కువ తినాలి. అవే మనకు అనారోగ్యాన్ని దరిచేరనీయకుండా కాపాడే పోషకాలు అందిస్తాయి.**

**అయితే చిన్నారులకు పండ్లు, కూరగాయలు పెడుతున్నప్పుడు మాత్రం కాస్త జాగ్రత్తగా ఉండాలంటున్నారు పోషకాహార నిపుణులు. ఎలా పడితే అలా ఏ పండు పడితే ఆ పండు కలిపి పెడితే ఆహారం విషతుల్యం అవుతుంది. మరి వేటిని వేటితో కలిపి చిన్నారులకు పెట్టకూడదో, ఎలాంటి ఆహారం పెట్టొచ్చో తెలుసుకోండి !**

కొందరు ఎక్కువ పోషకాలు కావాలని రెండు రెండు పండ్లు కలిపి పెడుతుంటారు. అలా పెట్టడమూ మంచిది కాదు. ముఖ్యంగా కింది వాటిని అస్సలు కలిపి పెట్టకూడదు.

**కమలాఫలం, క్యారెట్ :** ఈ రెంటినీ కలిపి తినడం వల్ల చిన్నారుల గుండెల్లో మంట, వికారంగా అనిపించడం, మూత్ర వ్యవస్థకు సంబంధించిన సమస్యలు తలెత్తుతాయి. కొన్ని సందర్భాల్లో వీటి ముప్పు పెరిగే అవకాశం కూడా ఉంది.

**బొప్పాయి పండు, నిమ్మ :** వీటిని కలిపి తినడం వల్ల హీమోగ్లోబిన్ విచ్ఛిన్నమయ్యే అవకాశం ఉంది. ఫలితంగా చిన్నారులు ఎనీమియాకు గురయ్యే అవకాశాలున్నాయి. ఇది వారి ఆరోగ్యంపై తీవ్ర ప్రభావం చూపిస్తుంది. కాబట్టి ఈ రెంటినీ కలిపి చిన్నారులకు పెట్టకపోవడం ఉత్తమం.

**జామపండు, అరటిపండు :** చిన్నారులకు కలిపి పెట్టకూడని పండ్లలో జామ, అరటి కూడా ఉన్నాయి. వీటిని ఒకే సమయంలో తినడం వల్ల చిన్నారుల్లో జీర్ణకోశ సంబంధిత సమస్యలు తలెత్తుతాయి. తలనొప్పి, కడుపునొప్పి, వికారంగా కూడా అనిపించవచ్చు. కొన్ని సందర్భాల్లో ఎసిడోసిస్ అంటే రక్తం, ఇతర శరీర కణజాలాల్లో ఆమ్లస్థాయి పెరుగుతుంది.

### వీటిని తినొచ్చు

*ఒకేరకమైన స్వభావం ఉండే పండ్లను కలిపి ఆహారంగా అందించడం ద్వారా చిన్నారుల్లో జీర్ణ సంబంధ సమస్యలు, ఇతర అనారోగ్య కారణాలు తలెత్తకుండా జాగ్రత్తపడచ్చు.*

1. *పీచ్, యాపిల్, తర్బూజా, పుచ్చ, ఫిగ్, ఖర్జూరం వంటి స్వీట్ ఫ్రూట్ రకానికి చెందిన పండ్లను కలిపి తినొచ్చు.*
2. *సిట్రస్ జాతికి చెందిన పండ్లు అంటే నారింజ, కమలాఫలం, బత్తాయి, నిమ్మ, కివీ, ద్రాక్ష, పైనాపిల్, చెర్రీ, క్రాన్‌బెర్రీ వంటివన్నీ ఆమ్లగుణాలున్న పండ్ల జాబితాలోకి వస్తాయి. వీటిని కూడా కలిపి చిన్నారులకు ఆహారంగా అందించవచ్చు.*
3. *మామిడి, రాస్ప్బెర్రీ, గ్రీన్‌బెర్రీ, స్ట్రాబెర్రీ, యాపిల్ వంటివి సెమీ యాసిడ్ రకానికి చెందిన పండ్లను సైతం పిల్లలకు మిశ్రమంగా చేసి అందించవచ్చు.*
4. *ప్రోటీన్లు, ఖనిజ లవణాలు, నూనెలు వంటి గుణాలు కలగలిసిన పదార్థాలు తటస్థ రకానికి చెందినవి, అంటే అవకాడో, బాదాం, కొబ్బరి, వాల్‌నట్ లాంటివన్నమాట. వీటన్నింటినీ కూడా కలిపి తీసుకోవచ్చు.*

### పాలతో వీటిని పెట్టకండి!

చాలామంది తల్లులు చిన్నారులకు పాలతో పాటు పండ్లు కూడా తినమని ఇస్తుంటారు. దాని వల్ల వారి ఆరోగ్యం మెరుగుపడుతుందనే ఉద్దేశంతో ఇలా చేస్తుంటారు. అయితే పాలతో కలిపి కొన్ని రకాల పండ్లు చిన్నారులకు ఆహారంగా ఇవ్వకూడదు. అవేంటంటే

**కమలాఫలం, పాలు :** చిన్నారులకు ఈరెంటినీ ఒకేసారి ఆహారంగా ఇస్తే వారిలో జీర్ణ సంబంధ సమస్యలు తలెత్తుతాయి. కమలాఫలమే కాదు, దాన్నుంచి తీసిన రసం కూడా పాలు తాగిన వెంటనే ఇవ్వకూడదు.

**పైనాపిల్, పాలు :** పైనాపిల్‌లో ఉండే బ్రోమిలెన్ పదార్థం పాలల్లో కలిసినప్పుడు విషపూరితంగా మారుతుంది. దీనికారణంగా తలనొప్పి, కడుపు నొప్పి వస్తాయి. అలాగే జీర్ణకోశ సంబంధిత సమస్య ఉత్పన్నమవుతుంది. వాంతులు అవుతాయి. కొన్ని సందర్భాల్లో ఇన్ఫెక్షన్లకు లేదా డయేరియాకు దారితీస్తుంది.

### కూరగాయలతో తినకండి

కొంతమంది కూరగాయలు, పండ్లు కలిపి సలాడ్ తయారుచేస్తుంటారు. ఇలాంటివి పెద్దలు తింటే ఫర్వాలేదు కానీ చిన్నారులకు పెట్టడం వల్ల జీర్ణసంబంధ సమస్యలు ఎదురయ్యే అవకాశముందని చెబుతున్నారు పోషకాహార నిపుణులు. ఎందుకంటే పండ్లలో ఉండే చక్కెరల కారణంగా కూరగాయలు సరిగ్గా జీర్ణం కావు. ఫలితంగా జీర్ణ వ్యవస్థకు ఇన్ఫెక్షన్ సోకే అవకాశం ఉంది. అలాగే ఆహారం సరిగ్గా అరగని కారణంగా కడుపు నొప్పి వచ్చే అవకాశం ఉంది.

**– నివేదిత**

# 'పాత'సినిమా సూపిత్త మావా!

**-ప్రతాప వెంకట సుబ్బరాయుడు**

**మాట అనేది ఎంత పవర్‌ఫుల్లో ఉగ్గుపాలతో సినిమాలు చూస్తూ పెరిగి పెద్దయిన శ్రీపంచ్‌కి తెలుసు.**

**మాట అనేది ఎలా కదిపేస్తుందో...కుదిపేస్తుందో ఛానల్ టీవీల్లో ఒక్కో అంశాన్నీ ఊదరగొట్టే విధానం చూసి అర్థం చేసుకున్నాడు. అందుకనే మాటలెలా ప్రయోగించాలో చిన్నప్పటి నుండీ తనకంటూ ఒక ప్రత్యేకమైన గ్రామర్ తయారు చేసుకున్నాడు శ్రీపంచ్.**

**మాటలతో చెడుగుడు ఆడడం అతడికిప్పుడు కరతలా మలకం.**

తనకి విలువొచ్చి తన రేంజ్ పెరగాలంటే సినిమాల్లో కెళ్ళడం ఒక్కటే మార్గం అని తెలుసుకుని, ఒక ఫైన్ డే తెనాలి నుండి హైదరాబాద్ చేరుకున్నాడు. నానా కష్టాలుపడుతూ బంజారాహిల్స్, జూబ్లీహిల్స్, కృష్ణానగర్, ఫిల్మ్‌నగర్‌లలో తనకో అవకాశం ఇచ్చే వాళ్ళకోసం భూతద్దం పెట్టుకుని వెదక సాగాడు.

స్టూడియోల చుట్టూ తిరుగుతూ, డైరెక్టర్లు, ప్రొడ్యూసర్లు నిత్యం సంచరించే హోటళ్ళు, బార్లలో కాపు కాయసాగాడు.

అతని టైం బాగుందో లేక ఆ యువ డైరెక్టర్ లక్కో గానీ మొత్తానికి వాళ్ళిద్దరి కలయికా ఆ బార్లో జరిగింది.

"ఫిలిమ్ ఇనిస్టిట్యూట్‌లో కోర్స్ చేసిన డైరెక్టర్ని నేను. నా దగ్గర సక్కటి కథుంది. ఐదేళ్ళ నుండీ ఒక్కొక్కడి ముడ్డెనక తిరిగీ తిరిగీ మొత్తానికి ఒక ప్రొడ్యూసర్ని ఒడిసి పట్టుకున్నా. ఆడు నా కథకి డబ్బులెట్టడానికి రెడీగా ఉన్నాడు. కానీ ఇన్నాళ్ళూ మాటలు రాసేవాడే దొరకలేదు. ఆల్రెడీ ఫీల్డ్‌తో అనుభవం ఉన్నోళ్ళని పెట్టుకుందామంటే, అంతకు ముందు ఉన్నోళ్ళు నాటకీయంగా రాశారు. ఇప్పుడు ఉన్నోళ్ళు పంచ్‌లమయంగా రాస్తున్నారు. నా కథకి ఓ ఫ్రెష్ డైలాగ్ రైటర్ కావాలి. సుడి అంటే ఇదే! ఇన్నాళ్ళకి నువ్వు దొరికావు. నేనూ కొత్తే. నువ్వూ కొత్తే, ప్రొడ్యూసరూ కొత్తే, దీనబ్బ! సినిమా కూడా కొత్తగా ఉండాల. ఇరగదియ్యాలి. ఇప్పుడసలే కొత్తోళ్ళు, లో బడ్జెట్ సినిమాల హవా నడుస్తోంది. వసూళ్ళలో పెద్ద సినిమాలతో సమానంగా పోటీ పడుతున్నాయి. తీయబోయే సినిమాతో మనం సెటిలైపోవాలి అంతే!" అన్నాడు ముందు ఫ్యూచర్ విజన్ ఇచ్చిన కిక్కుతో.

శ్రీపంచ్ ఆనందం అంతా ఇంతా కాదు. తంతే బీర్ డ్రమ్ములో పడ్డట్టయింది.

***

సినిమా సెట్స్ మీదకెళ్ళింది.

"ఈ సీన్‌లో హీరో కాలేజీకొచ్చి హీరోయిన్తో రొమాంటిక్‌గా మాట్లాడాలి. రాసేయండి. కానీ రొటీన్‌గా ఉండకూడదు" అన్నాడు డైరెక్టర్.

"అలాగే" అని ఓ గంట తర్వాత డైలాగ్ పేపర్స్ ఉన్న ప్యాడ్ పట్టుకొచ్చాడు శ్రీపంచ్.

పేపర్ మీద పరుచుకున్న సంభాషణ.

"ఏంటి రాజూ! ఇరవై నాలుగ్గంటల తర్వాత నన్ను కలిసేది? విరహంతో తల్లడిల్లిపోయాను తెలుసా?"

"రాధీ! నేను మాత్రం సుఖంగా ఉన్నాననుకున్నావా? చూడు ఇరవై నాలుగ్గంటల ముందు నా వెయిట్ సెవెంటీ ఎయిట్ కేజీస్, ఇప్పుడు సెవెంటీ... ఎయిట్ కేజీస్ లాస్ట్ ఇన్ ట్వెంటీ ఫోర్ అవర్స్" బాధగా అన్నాడు.

"నిజమే రాజూ! పీక్కుపోయిన నీ ముఖం,



పెరిగిపోయిన గడ్డం చూస్తే జాలేస్తోంది. నిన్ను పెళ్ళి చేసుకోవడంతప్ప నేను నీకేం చేయగలను".

పరుగెత్తుకుంటూ వచ్చి గట్టిగా అతన్ని కౌగలించుకుంది.

"సూపర్బ్... ఒకే ఒక్క సంభాషణలో ట్వెంటీ ఫైవ్ అవర్స్ విరహాన్ని సుత్తి లేకుండా, సూటిగా పాత్ర చేత చెప్పించేశావు" శ్రీపంచ్‌ని అభినందనల్లో ముంచెత్తాడు యువ డైరెక్టర్.

***

"ఈ సీన్లో హీరో అనుకోని పరిస్థితుల్లో ఒక అన్నం పొట్లంతో నిర్మానుష్యంగా ఉన్న వీధిలో వెళుతుంటాడు. కొంతదూరం వెళ్ళాక ఎలక్ట్రికల్ పోల్ దగ్గర కూర్చుని సరిగ్గా అన్నం తిందామనుకున్న సమయానికి అతని దగ్గరికి నాలుగు కుక్కలు వస్తాయి. సీన్ రాసేయండి".

శ్రీపంచ్ కాగితాల మీద పరపరా రాసుకొచ్చిన సీన్...

"నాలుగు కుక్కలకీ నాకూ ఈ పొట్లం సరిపోదు. నేను ఎలాగైనా మళ్ళీ డబ్బు సంపాదించగలను. దాంతో అన్నం తినగలను. కానీ మీకెలా? అయ్యో మీకు సంపాదించడం రాదే!" అని వాటికి అన్నం పెడతాడు. అవి మళ్ళీ అందులో కొంత అన్నం మిగిల్చి ఆ పొట్లం అతడివైపు తోస్తాయి.

'జంతువుల్ని మనిషి బానిసలుగా చూస్తాడు. కానీ అవెప్పుడూ మనిషిని అలా చూడవు. చూసుంటే ఇప్పుడు అవి మాత్రమే ఉండేవి భూమ్మీద. మనిషి కాదు' హీరో స్వగతంగా అనుకుంటాడు.

"వారెవ్వా! అది కలమా, మెదడు కార్ఖానా గొట్టమా? జంతువులు, మనుషుల మధ్య ప్రేమ సబ్జెక్ట్‌తో ఎన్నో సినిమాలొచ్చాయి. కానీ మనుషులతో అవి సమానమని ఒక్క డైలాగ్‌తో ఎలా చెప్పావయ్యా బాబూ! ఫెంటాస్టిక్" అరిచాడు.

***

"మీ అమ్మా, నాన్న ఏడుస్తూ ఎక్కడికెళుతున్నారు?" హీరో అడిగాడు.

"నా సంపాదన సరిపోవట్లేదని వాళ్ళు ఓల్డేజ్ హోంకి వెళ్ళిపోతున్నారు" కన్నీళ్ళతో అన్నాడతను.

"అదేంటండీ కొడుకుతో పాటు కలో గంజో తాగి బ్రతకాలిగానీ అలా పెళ్ళికాని వాణ్ణి ఒంటరిని చేసి వెడతారా?"

"బాబూ, మేముంటే వాడు గంజి కూడా తాగలేడు. అందుకే మనసు రాయి చేసుకుని వెళుతున్నాం".

"అంటే మీరు లేకపోతే, నేను మాత్రం బ్రతుకుతాననుకుంటున్నారా? ఇప్పుడే వెళ్ళి అనాథ శరణాలయంలో చేరిపోతా!"

"ప్రేమలు, ఆప్యాయతలు లేని మనసులు చుక్కనీరు లేని ఎడారులు. మిమ్మల్ని చూస్తే 'మనుషులు ఇలా ఉంటే బాగుణ్ణు' అనిపిస్తుంది. దయచేసి లోపలికెళ్ళండి" హీరో కన్నీళ్ళతో అర్థించాడు.

"నువ్వు చెప్పావని లోపలికి వెళుతున్నాం బాబు".

"మార్వలెస్, కుటుంబ సభ్యుల మధ్య ఉండే ప్రేమాభిమానాలతో కంటనీరు పెట్టించావు. రేపు థియేటర్లో కన్నీళ్ళతో కాసులు రాల్తాయి" ఈసారి ప్రొడ్యూసర్ గంగవెర్రులెత్తాడు.

***

"విలన్‌తో హీరో కలిసే మొట్టమొదటి సన్నివేశాన్ని కలంతో కుమ్మెయ్ శ్రీపంచ్".

"అలాగే సార్!"

కాసేపటి తర్వాత, రాసుకొచ్చిన సీన్

"వెల్‌కమ్... సిగరెట్ తాగుతావా?"

"వద్దు"

"మందు తీసుకుంటావా?"

"అవసరం లేదు!"

"పోనీ జనక్ జనక్ పాయల్బాజే" కన్ను గీటుతూ ఆఫర్ చేశాడు.

"అఖ్ఖర్లేదు".

**పేరుకు తగ్గట్టే శ్రీపంచ్ గొప్ప డైలాగ్ రైటర్. అదెలాగంటే మాటల ప్రయోగం, వాటి విలువ బాగా తెలిసినవాడన్నమాట. ఆ ప్రయోగాలన్నీ ఉగ్గుపాలతోనే నేర్చుకున్నాడుమరి. అతడి గొప్పతనాన్ని ఎవరూ గుర్తించడంలేదు. ఇకదాంతో చంకన తెల్లకాగితాలు పెట్టుకుని హైదరాబాద్ వచ్చేశాడు. ఫిలిమ్‌నగర్, కృష్ణానగర్ అంతా గాలించి ఓ కుర్ర డెరైక్టర్ని పట్టాడు. మరి వాళ్ళిద్దరూ కలిసి ఏం చేశారు?**

"నిఖార్సయిన మంచి బాలుడెవ్వడూ ఇంతవరకూ ఇక్కడికి రాలేదు. నిన్నుచూస్తే ఆశ్చర్యం కలుగుతోంది".

"మీ ఊపిరితిత్తులు పొగచూరిపోయాయి. మీ చర్మంకింద రక్తం బదులు ఆల్కహాల్ ప్రవహిస్తోంది. ఒంటినిండా సుఖరోగాలు తాండవిస్తున్నాయి. నేను స్వచ్ఛమైన అమ్మపాలు తాగి పెరిగాను. అవినీతికి ఆమడదూరం ఉంటా."

"ఓహ్! భారతీయుడివన్న మాట."

"యస్, నన్ను చూస్తే చూశావా! నీకు దేశం గుర్తుకొచ్చింది. దొంగ పాస్‌పోర్ట్‌లతో దేశాలు తిరిగే నీకు మాతృదేశం, మాతృమూర్తి విలువా ఏం తెలుస్తాయిరా, లుచ్చా!"

"ఇంకా ఏం చూస్తున్నార్రా, కాల్చిపాడేయండీణ్ణి".

"అల్లూరి సీతారామరాజు కాలం నుండీ ఇప్పటిదాకా గన్నులు ఎత్తుతూనే ఉన్నారు. కానీ గెలిచిందెవరు? చరిత్రలో నిలిచిందెవరు? మారణాయుధాలు కేవలం భయపెట్టడానికి, చివరికి మానవత్వా యుధమే చెడుని మట్టి కరిపించేది" అని కేవలం కాళ్ళూ చేతులతోటే విలన్ తొత్తుల్నీ, విలన్‌ని ఓడించాడు.

విలన్ దగ్గరగావచ్చి "నాకు పుట్టినదే అయినా, తులసి మొక్కలా పెరిగిన నా కూతురు నాకు దూరంగా ఉంటూ నిన్ను కోరుకుంటోంది. ఆ విషయం నాకు నిన్ననే తెలిసింది. ఇన్నాళ్ళకి నా వంశ సముద్రం నీ రాకతో స్వచ్ఛమైన గంగవుతోంది. వచ్చే జన్మంటూ ఉంటే మా అమ్మాయి కడుపునపుట్టి మంచి పౌరుడినవుతా. మేరా భారత్ మహాన్" అంటూ తనని తను కాల్చుకుని చనిపోయాడు.

సినిమా చివర్లో

పుట్టినపుడు ఎవరం ఎక్కడ పుట్టామో తెలియదు.

కానీ ఉత్తమ భారతీయుడిగా తనువు చాలించాలి.

శుభం.

అని చూపించారు.

***

'సెన్సార్ ఆఫీసుకి రానవసరం లేని చక్కటి సినిమా' అని సెన్సార్ సభ్యుల ప్రశంసలతో క్లీన్ సర్టిఫికెట్ పొందింది.

"సినిమా మొదట్లో 'ధూమపానం నిషేధం' అన్న ముఖేష్ ఫిల్మ్, తాగుడు సీన్లపై వచ్చే 'మద్యపానం ఆరోగ్యానికి హానికరం' అని చూపించనవసరం లేని స్వచ్ఛమైన సినిమా" అని అందరూ ప్రశంసించారు.

"సినిమాలో మనుషులతో పాటు జంతువులను సమానంగా చూశారు" అని జంతుప్రేమికులు జూలో కూడా ప్రత్యేక షోలేసి అభినందించారు.

టీవీ ఛానల్స్ వాళ్ళు సినిమానీ, ఆ సినిమా టీమ్‌నీ భుజాలమీద కెత్తుకున్నారు. జిల్లాల వారీగా విజయ యాత్రలు ఊపందుకున్నాయి.

నాన్‌వెజ్ తినీ తినీ ముఖం వాచిపోయి, ఆకు కూరకోసం ఎగబడినట్టు ప్రేక్షకులు ఎందుకో ఆ సినిమాకు బ్రహ్మరథం పట్టారు. సూపర్, డూపర్, బంపర్ హిట్ ఆ సినిమా.

బ్లాక్‌బస్టర్‌గా టీవీల్లో ప్రసారమవుతూనే ఉంది. ఆ విధంగా అర్థంపర్థం లేని ఆ సినిమా సంచలన విజయం నమోదు చేసింది.

పాత చింతకాయ కమర్షియల్ ఫార్ములా తొక్కుల్ని 'కొత్త' అనే ముసుగుతో వాళ్ళు తీసెయ్యడం, మనం అదే భ్రమతో చూసెయ్యడం అలవాటయింది. ఒకప్పటికీ ఇప్పటికీ తేడా ఏంటంటే ఇంతకుముందు సినిమా నిర్మాణం కేవలం కొన్ని సంస్థలకీ, కొంతమందికే పరిమితమయ్యేది! వాళ్ళే లాభాలు గడించేవాళ్ళు, ఇప్పుడు కొత్తవాళ్ళ అదృష్టం వాళ్ళని అందలం ఎక్కిస్తోంది. థియేటర్లు పోయి మల్టీప్లెక్స్‌లొచ్చాయి. ఆ రకంగా వాళ్ళూ ఎదిగారు. ఎటొచ్చీ కొత్తదనపు వినోదంకోసం జేబుకి చిల్లు పెట్టుకునే ఆశావహ ప్రేక్షకుడే దురదృష్టవంతుడు.

ఆ డైరెక్టరూ, డైలాగ్ రైటరూ కొండమీద కోతులయ్యారు.

**సెల్: 93 93 98 19 18**




మార్చి 22 నుంచి
మార్చి 28 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



## మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)

ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలు, కీలక నిర్ణయాలు, పెట్టుబడులపై ఈ వారం శ్రద్ధ పెడతారు. బుధవారం వృత్తి వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. ఉన్నత పదవులు అందుకుంటారు. 23, 24, 25 తేదీల్లో యూనియన్ కార్యకలాపాలు, ఆర్థిక సంస్థలతో పనులకు అనుకూలం. సమావేశాల్లో సత్ఫలితాలు సాధిస్తారు. పెట్టుబడుల్లో తొందరపాటు తగదు. 26, 27 తేదీల్లో సినీ, రాజకీయ రంగాల వారికి ప్రోత్సాహకరం. మనసు ఆశాంతిగా ఉంటుంది. ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు సంబంధించిన అంశాలు కలవరపెడతాయి. 28న కొత్త వ్యూహాలు రచిస్తారు. కీలక నిర్ణయాలు వాయిదా వేయండి.



## వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)

వృత్తి, వ్యాపారాలు, వేడుకలు, ఉన్నత విద్య, విదేశీ వ్యవహరాలకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధవారం సినీ, రాజకీయ రంగాల వారికి శుభప్రదం. విద్యార్థులు సత్ఫలితాలు సాధిస్తారు. 23, 24, 25 తేదీల్లో ప్రముఖులను కలుసుకుంటారు. ఉన్నతపదవులు, గౌరవ మన్ననలు అందుకుంటారు. వృత్తి, వ్యాపారాలకు సంబంధించిన ఒక సమాచారం కలవరపెడుతుంది. 26, 27 తేదీల్లో బృంద కార్యక్రమాలు ఉల్లాసం కలిగిస్తాయి. బ్యాంకులు, ఆర్థిక సంస్థలతో పనులకు ఆటంకాలు ఎదురవుతాయి. పెట్టుబడుల్లో నిదానం అవసరం. 28న విద్య, దూరప్రయాణాలకు ఆటంకాలు ఎదురయ్యే అవకాశం ఉంది.



## మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)

ప్రముఖులతో సమావేశాలు, పెట్టుబడులు, ఆర్థిక సంస్థలతో లావాదేవీలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం పెట్టుబడులు లాభిస్తాయి. రుణప్రయత్నాలు ఫలిస్తాయి. 23, 24, 25 తేదీల్లో బంధుమిత్రుల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. ఆర్థికపరమైన సమావేశాలు, చర్చలకు అనుకూలం. ఖర్చులు అంచనాలు మించుతాయి. 26, 27 తేదీల్లో ఆర్థిక విషయాల్లో పెద్దల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. వృత్తిపరమైన సమావేశాల్లో జాగ్రత్త అవసరం. 28న పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి. సమావేశాల్లో తొందరపాటు వల్ల నష్టపోయే అవకాశం ఉంది. బృందకార్యక్రమాల్లో పాల్గొంటారు.



## కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)

వృత్తి, వ్యాపారాలు, సమావేశాలు, బృందకార్యక్రమాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం జనసంబంధాలు విస్తరిస్తాయి. సమావేశాల్లో ప్రముఖులను కలుసుకుంటారు. 23, 24, 25 తేదీల్లో ఆర్థిక విషయాల్లో పైఅధికారుల సహకారం లభిస్తుంది. పెద్దల ఆరోగ్యం మెరుగుపడుతుంది. ఆర్థిక విషయాల్లో ఆశించిన సహకారం లభించక నిరుత్సాహపడతారు. 26, 27 తేదీల్లో వృత్తిపరమైన అంచనాలు ఫలించకపోవచ్చు. పెద్దలతో చర్చల్లో నిదానం అవసరం. రాజకీయ, సినీ రంగాల వారు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. 28న వృత్తి, వ్యాపారాల్లో ఆచితూచి వ్యవహరించాలి. ఉన్నత పదవుల కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి.



## సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, వేడుకలు, వృత్తిపరమైన సమావేశాలు, ప్రయాణాలకు ఈ వారం అనుకూలం. బుధవారం వృత్తి, వ్యాపారాల్లో ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. 23, 24, 25 తేదీల్లో వివాహాది శుభకార్యాల్లో పాల్గొంటారు. సమావేశాల్లో మాటపడాల్సి రావచ్చు. 26, 27 తేదీల్లో గత అనుభవం ఆధారంగా నిర్ణయాలు తీసుకుంటారు. రుణ ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆర్థిక విషయాల్లో అంచనాలు తప్పే అవకాశం ఉంది. ఖర్చులు అధికం. 28న సమావేశాలు, చర్చల్లో అసౌకర్యం కలిగే అవకాశం ఉంది. వేడుకల్లో పాల్గొంటారు.



## కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)

భాగస్వామ్యాలు, స్పెక్యులేషన్లు, క్రయవిక్రయాలు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం పెట్టుబడులు లాభిస్తాయి. చిన్నారుల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. 23, 24, 25 తేదీల్లో హోటల్, వైద్య రంగాల వారికి అనుకూలం. ఆరోగ్యం మెరుగుపడుతుంది. వృత్తి, వ్యాపారాల్లో ఆర్థికంగా నిరుత్సాహకరం. 26, 27 తేదీల్లో ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. స్పెక్యులేషన్లలో అంచనాలు తప్పే అవకాశం ఉంది. పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి. 28న రుణప్రయత్నాలు ఫలించకపోవచ్చు. సంస్మరణల్లో పాల్గొంటారు. క్రయవిక్రయాలకు అనుకూలం.



## తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)

వేడుకలు, భాగస్వామ్యాలు, పెట్టుబడులు, సమావేశాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం కుటుంబ సభ్యుల వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది. శుభకార్యాలకు ఏర్పాట్లు చేస్తారు. 23, 24, 25 తేదీల్లో వివాహాది శుభకార్యాల్లో పాల్గొంటారు. ప్రేమానుబంధాలు బలపడతాయి. ఖర్చులు అధికం. 26, 27 తేదీల్లో విందు వినోదాల్లో పాల్గొంటారు. సన్నిహితుల ఆరోగ్యం కలవరపెడుతుంది. కృషి రంగంలో శ్రమాధిక్యం తప్పకపోవచ్చు. 28న శ్రీవారు, శ్రీమతి వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. పందాలు, పోటీలకు దూరంగా ఉండాలి. వేడుకలు, సమావేశాలు ఉల్లాసం కలిగిస్తాయి.



## వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)

విద్యా విషయాలు, వృత్తి, వ్యాపారాలు, ఆరోగ్యం, వేడుకలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధవారం ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు. విందు వినోదాల్లో పాల్గొంటారు. 23, 24, 25 తేదీల్లో బదిలీలు, మార్పులకు అనుకూలం. కుటుంబ సభ్యుల ఆరోగ్యం కలవరపెడుతుంది. 26, 27 తేదీల్లో సృజనాత్మకంగా వ్యవహరించి కృషి రంగంలో లక్ష్యాలు సాధిస్తారు. చిన్నారులు, ప్రియతముల ఆరోగ్యం కలవరం కలిగిస్తుంది. విందుల్లో పాల్గొంటారు. 28న ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపించాలి. వృత్తి, వ్యాపారాల్లో లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి.

## ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)



విద్యా విషయాలు, వృత్తి, వ్యాపారాలు, వివాహాది శుభకార్యాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం పెట్టుబడులు లాభిస్తాయి. విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. 23, 24, 25 తేదీల్లో ఏజెన్సీ, రవాణా రంగాల వారికి, విద్యార్థులకు శుభప్రదం. కాంట్రాక్టులు, అగ్రిమెంట్లు లాభిస్తాయి. ఒక సమాచారం కలవరపెడుతుంది. 26, 27 తేదీల్లో రియల్ ఎస్టేట్, నిర్మాణరంగాల వారికి శుభప్రదం. కుటుంబ సభ్యుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. 28న చిన్నారులు, ప్రియతముల విషయాలు ఆందోళన కలిగిస్తాయి. ప్రేమానుబంధాలు బలపడతాయి.

## మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)



స్థలమార్పులు, కుటుంబ వ్యవహారాలు, వృత్తి వ్యవహారాలకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధవారం రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారికి శుభప్రదం. మార్పుచేర్పుల గురించి ఆలోచిస్తారు. 23, 24, 25 తేదీల్లో రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. ఖర్చులు అధికం. 26, 27 తేదీల్లో కాంట్రాక్టులు, అగ్రిమెట్లకు అనుకూలం. స్టేషనరీ, ఏజెన్సీ, విద్యారంగాల వారు జాగ్రత్తగా వ్యవహరించాలి. విద్యార్థులు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. 28న రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారు ఆచితూచి వ్యవహరించాలి. ఇల్లు, స్థలం మార్పిడి, బదిలీలకు అనుకూల సమయం.



## కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, విద్య, కుటుంబ వ్యవహారాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం విద్యార్థులకు శుభప్రదం. ప్రయాణాలు, చర్చలు ఫలిస్తాయి. 23, 24, 25 తేదీల్లో కాంట్రాక్టులు, అగ్రిమెంట్లు లాభిస్తాయి. సోదరీసోదరుల విషయాలు, రాతకోతలు, చర్చలపై దృష్టి పెడతారు. ప్రయాణాల్లో నిదానం అవసరం. 26, 27 తేదీల్లో డిపాజిట్లపై మంచి ప్రతిఫలం అందుకుంటారు. ఆర్థిక వ్యవహారాల్లో ఆచితూచి వ్యవహరించాలి. కీలకపత్రాలు సకాలంలో కనిపించక ఇబ్బంది పడతారు. 28న చర్చలు, ప్రయాణాల్లో నిదానం పాటించాలి. విద్యార్థులు అధికంగా శ్రమించాలి. కాంట్రాక్టులు, అగ్రిమెంట్లకు తగిన సమయం కాదు.



## మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)

ఆర్థికపరమైన నిర్ణయాలు, చర్చలు, బిల్లుల చెల్లింపులకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధవారం పెట్టుబడులు లాభిస్తాయి. విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. 23, 24, 25 తేదీల్లో దీర్ఘకాలిక పెట్టుబడులు, ఆర్థికపరమైన చర్చలకు అనుకూలం. ఒక సమాచారం కలవరపెడుతుంది. 26, 27 తేదీల్లో అదనపు ఆదాయం కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆర్థిక విషయాల్లో తొందరపాటు నిర్ణయాల వల్ల నష్టపోయే అవకాశం ఉంది. 28న పెట్టుబడులు, పొదుపు పథకాల్లో నిదానం అవసరం. ఖర్చులు అంచనాలు మించుతాయి. విలువైన వస్తువుల గురించి ఆరాతీస్తారు.



## శాటిలైట్ రేటు అంతనా?

దేశంలో మొట్టమొదటి సారి ఓ సినిమాకు కళ్ళు తిరిగే శాటిలైట్ రేటు పలికింది. సూపర్‌స్టార్ రజనీకాంత్ నటించిన 'రోబో 2' సినిమాకు శాటిలైట్ హక్కుల రూపంలో అక్షరాలా 110 కోట్లు ముట్టింది. ఇంత పెద్ద మొత్తాన్ని జీ ఛానల్ వారు ఇచ్చి కొనుగోలు చేశారు. తెలుగు, తమిళం, కన్నడ, హిందీ భాషలతో పాటు డబ్బింగ్ హక్కులను కూడా ఈ ఛానల్ సొంతం చేసుకుంది. కాకపోతే ఇంత పెద్ద మొత్తం ఇదే మొదటి సారి కావడంతో దీని గురించి చర్చ మొదలయింది.

## రూటు మార్చిన పూరి




మొన్నటి దాకా బాలకృష్ణ సినిమాకి అందరూ కొత్త వాళ్ళు కావాలని కాస్టింగ్ కాల్ ఇచ్చి హడావిడి చేసిన పూరి జగన్నాథ్ ఇప్పుడు రూట్ మార్చినట్టు కనిపిస్తోంది అంటున్నారు సినీజనాలు. ఆ సినిమాకి అందరూ కొత్త వాళ్ళని కాకుండా సీనియర్స్‌ని తీసుకుంటే ఎలా ఉంటుంది? అన్న ఆలోచనలో పడ్డాడట! ఈ మేరకు కొందరు హీరోయిన్ల పేర్లను కూడా పరిశీలించాడట! కాస్టింగ్ కాల్ చేసి టాలీవుడ్‌లో సెన్సేషన్ సృష్టించిన పూరి ఇప్పుడు ఉన్నట్టుండి తన రూట్ ఎందుకు మార్చుకున్నాడు? అన్న అనుమానం చాలా మందిని వేధిస్తోంది. కొత్త వారితో సాహసం చేయడం కన్నా పాతవారితో అడ్జస్ట్ అవ్వడం బెటర్ అనుకునే ఈ పద్ధతి ఫాలో అవుతున్నాడని అంటున్నారు.





## మాధవీలతను మోసం చేశారట!

వెండితెర మీద కాకుండా వార్తల్లో ఎక్కువగా ఉంటోంది తెలుగు పిల్ల మాధవీలత. తనకు ఎదురైన లైంగిక వేధింపుల గురించి ఓ ఇంటర్వ్యూలో చెప్పిన మాధవీలత అదే ఇంటర్వ్యూలో తనకు నంది అవార్డు ఇవ్వకుండా మోసం చేశారని ఆరోపించింది. తన తొలి సినిమా 'నచ్చావులే' సినిమాకు బెస్ట్ పెర్ఫామెన్స్ అవార్డు రావలసి ఉండగా, డబ్బింగ్ చెప్పలేదని అవార్డు ఇవ్వలేదనీ, అప్పుడు అనుష్కకు ఆ అవార్డు ఇచ్చారనీ, అప్పుడు ఆమె కూడా డబ్బింగ్ చెప్పలేదనీ, అయినా ఇచ్చారనీ, తెలుగు అమ్మాయి కనుకనే తనకు అవార్డు ఇవ్వలేదనీ ఆవేదనగా చెబుతోంది. తనకు అవార్డు వస్తుందన్న సమాచారం ముందుగా తెలిసిందనీ, అయినా చివరకి తనకు అవార్డు ఇవ్వకుండా మోసం చేశారని చెప్పింది.

## కెమెరా పట్టిన 'వినాయకుడు'

ఈ సినిమా పేరు వినగానే ఓ భారీ విగ్రహం కళ్ళముందు కదలాడుతుంది. ఆ విగ్రహం పేరు కృష్ణుడు. సోలోగా వచ్చి 'వినాయకుడు' సినిమాతో మంచి విజయాన్నే అందుకున్నా ఆ తరువాత కృష్ణుడికి పెద్దగా అవకాశాలు రాలేదు. ప్రస్తుతం అతని చేతిలో సినిమాలేవీ లేవు కూడా. దాంతో తన పాత వృత్తి కొనసాగించాలని నిర్ణయించుకున్నాడట! కెమెరా చేత పట్టి ఫోటోలు తీసే వృత్తి అన్నమాట. తాజాగా తను తీసిన ఓ ఫోటోను సోషల్ మీడియాలో పోస్ట్ చేశాడు. ఈ ఫోటోకు మంచి రెస్పాన్స్ వస్తోందట కూడా! ఇక నుంచి తెర మీద కాకుండా తెర వెనుక పనిచేయాలన్నది కృష్ణుడి కోరికట!





## సినిమాలు మరిచిన కమల్

ఇప్పటి వరకూ సినిమాలే లోకంగా ఉన్న కమల్ హాసన్ రూట్ మార్చినట్టున్నాడు అంటున్నారు కోలీవుడ్ తమ్ముళ్ళు. 'విశ్వరూపం 2', 'శభాష్ నాయుడు' సినిమాలను కమల్ మొదలెట్టి చాలా కాలమైంది. 'విశ్వరూపం 2' అదిగో వస్తోంది...ఇదిగో వస్తోంది అంటూ అభిమానులను ఊరిస్తున్నారే తప్ప థియేటర్లలోకి మాత్రం రావడం లేదు. దాని తరువాత మొదలుపెట్టిన 'శభాష్ నాయుడు' గురించి అప్పుడప్పుడు వార్తలు వస్తూండేవి. ఇప్పుడు అవి కూడా రావడం లేదు. ప్రస్తుతం కమల్ ఈ సినిమాల గురించి కాకుండా రాజకీయాల గురించే ఎక్కువ మాట్లాడుతున్నాడు. దాంతో కమల్ రాజకీయరంగ ప్రవేశం ఎంతో దూరం లేదన్న వార్తలు కోలీవుడ్‌లో బాగా వినిపిస్తున్నాయి. కమల్ చేయాలనుకున్న, చేస్తున్న సినిమాలను వదిలేసి రాజకీయాల వైపు దృష్టి పెట్టాడని అంటున్నారు.

# తగ్గలేదు... తగ్గించుకున్నా!

**-హన్సిక**



**నిండా పాతికేళ్ళు కూడా నిండని అమ్మాయి 31 మంది పిల్లలకు అమ్మయింది. తమిళ తమ్ముళ్ళకు ఆరాధ్య దేవత అయింది. తనకు గుడి కట్టి పూజలందుకునే స్థాయికి ఎదిగింది. ఇదంతా ఎవరి సపోర్ట్ లేకుండానే జరిగింది. ఈ పాటికే ఆ చిన్నది ఎవరో అర్థమైపోయి ఉంటుంది. ఇంకెవరు హన్సికా మోత్వాని. మొన్నటి దాకా కోలీవుడ్‌లో చేతినిండా సినిమాలతో బిజీ బిజీగా గడిపిన హన్సిక ఇప్పుడు చాలా వరకూ సినిమాలు తగ్గించుకుంది. అలా ఎందుకు తగ్గించుకుందో ఆమె మాటల్లోనే...**

### ఉన్నట్టుండి సినిమాలు తగ్గిపోవడానికి కారణం?

నాకు అవకాశాలు తగ్గలేదు. తగ్గించుకున్నాను. మొన్నటి వరకూ ఊపిరి పీల్చుకోవడానికి కూడా సమయం లేనంత బిజీగా ఉన్నాను. కొంతకాలం ఫ్రీగా ఉండాలని అనిపించింది. అందుకే సినిమాలు వచ్చినా ఒప్పుకోవడంలేదు.

### తెలుగులో కూడా ఇందుకే చేయడం లేదా?

టాలీవుడ్ నాకు తల్లి లాంటిది. ఇక్కడ చేయకపోవడానికి కారణం వేరే ఉంది. ఇక్కడ అవకాశాలు వచ్చిన సమయంలో కోలీవుడ్‌లో బిజీగా ఉన్నాను. డేట్లు అడ్జస్ట్ చేయడం కుదరక ఆ సినిమాలు వదులుకోవలసి వచ్చింది. అంతే తప్ప మరో కారణం లేదు.

### గతంలో కన్నా నాజూగ్గా తయారైనట్టున్నారు?

'రక్షకుడు' సినిమా కోసం బరువు తగ్గాల్సి వచ్చింది. బరువు విషయంలో ప్రత్యేకించి జాగ్రత్తలు తీసుకోను. ఫుడ్ కూడా లిమిట్‌గానే తీసుకుంటాను. టెన్షన్స్ పెట్టుకోను. మనస్సు సంతోషంగా ఉంటే అది మన ముఖంలో తప్పకుండా కనిపిస్తుంది. ప్రతి రోజూ యోగా తప్పకుండా చేస్తాను. అది మన మనస్సునూ, శరీరాన్నీ ఉల్లాసంగా ఉంచడానికి ఎంతగానో దోహదం చేస్తుంది.

### స్టార్ హీరోలతో చేయకపోవడానికి కారణం?

నా దృష్టిలో అందరూ ఒకటే! పెద్దా చిన్నా పట్టించుకోను. ఏ నటీ నటులైనా కింద నుంచి పైకి రావలసిందే తప్ప ఒక్కసారిగా స్టార్ హోదా రాదు. అయినా ఈ నెంబర్లు, హోదాల మీద నాకు నమ్మకం లేదు. ఈ రేటింగులు ఎప్పటికప్పుడు మారిపోతూ ఉంటాయి. ఒక్క సినిమా ఫ్లాప్ అయినా రేటింగ్ పడిపోతుంది. అలాంటప్పుడు వీటిని నమ్ముకుని ముందుకు పోవడం మూర్ఖత్వం. కథ నచ్చితే ఏ హీరోతోనైనా, డైరెక్టర్‌తోనైనా చేయడానికి నేను రెడీ!

**లేడీ ఓరియెంటెడ్ సినిమాలు చేసే ఉద్దేశం లేనట్టుంది?**

అలాంటి సినిమాలు చేయడానికి ఇంకా సమయముంది. దానికి నా వయసు, అనుభవం సరిపోదు. ఫిజికల్‌గా, మెంటల్‌గా మెచ్యూరిటీ రావాలి. అవి వచ్చినప్పుడు తప్పకుండా చేస్తాను. అలా కాకుండా ఇప్పుడే చేస్తే నవ్వులపాలు అవుతాను.

**అలాంటి సినిమాలు చేస్తున్న వారి గురించి చెబుతున్నారా?**

నా అభిప్రాయం చెప్పాను అంతే తప్ప వేరొకరిని కించపరిచే ఉద్దేశం నాకు లేదు. ఎలాంటి సినిమాలు చేయాలన్నది ఎవరికి వారు నిర్ణయించుకునేది. ఎదుటి వారి ఇష్టాఇష్టాల మీద ఆధారపడి ఎవరూ చేయరు.

**ఎక్కువ గ్లామర్ పాత్రలు చేయడానికి కారణం?**

నాకు వచ్చిన అవకాశాన్ని వినియోగించుకుంటున్నాను అంతే! గ్లామర్ పాత్రలు చేస్తే యూత్ ఎక్కువగా ఇష్టపడతారు. వారిని మెప్పిస్తే చాలు సినిమా సక్సెస్ అయినట్టే! ఇలా ఆలోచించే ఎక్కువగా గ్లామర్ పాత్రలు చేస్తున్నాను. వాటిల్లో కూడా నటనకు ఎంతో కొంత అవకాశం ఉంటూనే ఉంటుంది.

**మీ కోస్టార్స్ గురించి...**

వారి గురించి చెప్పాలంటే ముందుగా చెప్పుకునేది జయం రవిగారి గురించే! ఆయన నన్ను ఓ కుటుంబ సభ్యురాలిగా ట్రీట్ చేస్తారు. ఆయన భార్య ఆర్తి కూడా అంతే! నన్ను చాలా ఇష్టపడతారు. నా కోర్ స్టార్స్‌లో నేరుగా ఇంటికి వెళ్ళే చనువు ఆయన దగ్గరే ఉంది. ఆయన నుంచి చాలా విషయాలు నేర్చుకున్నాను. ఇక్కడ ఎలా మెలగాలి? ఎవరిని నమ్మాలి? ఎవరిని నమ్మకూడదు? అనే విషయాలు నాకు అంతకు ముందు పెద్దగా తెలియవు. ఆయనే వివరంగా చెప్పారు. ఇప్పుడు నా ఆలోచనల్లో చాలా మార్పు వచ్చింది.

**ఈ రంగంలో మీ బెస్ట్ ఫ్రెండ్స్?**

ఒక్కరి పేరు చెప్పడం కష్టం. అందరూ నాకు మంచి స్నేహితులే! నా పుట్టినరోజు నాకు గుర్తు లేకపోయినా, గుర్తు పెట్టుకుని మరీ విష్ చేస్తుంటారు. అంత మంచి స్నేహితులు ఉన్నారు. మేం తరచూ మాట్లాడుకోం. అయినా మాలో ఎవరికి కష్టం వచ్చినా వెంటనే స్పందిస్తాం. మా మధ్య మంచి అవగాహన ఉంది. ఒకరిని బెస్ట్ ఫ్రెండ్ అని చెప్పి మరొకరిని తక్కువ చేయలేను.

**శింబు వ్యవహారం సమసినట్టేనా?**

ఈ విషయంలో ఎక్కువ మాట్లాడడం నాకు నచ్చదు. ఎంత మౌనంగా ఉంటే అంత మంచిది. మేం మాటా మాటా అనుకోలేదు. తను ఒకే ఒక్క మాట అన్నాడు. నా మనసు విరిగిపోయింది. దానికి ప్రతిగా నేను ఒకే ఒక్క మాట అని దూరంగా జరిగిపోయాను. విడిపోయిన తరువాత కూడా తనతో సినిమా చేశాను. వృత్తిపరంగా కానీ, వ్యక్తిగతంగా కానీ తన మీద నాకు ఎలాంటి కోపం లేదు. మనసులు కలిశాయి అనుకున్నాను. అది భ్రమ అని తేలిపోయింది. పక్కకు జరిగిపోయాను. ఆ సమయంలో నాకు అంత మెచ్యూరిటీ కూడా లేదు. జరిగిందంతా నా మంచికే అని నమ్ముతున్నాను.



**ఈ రంగంలోకి వచ్చి దశాబ్దం అయిపోయినట్టుంది?**

పదహారేళ్ళకే సినిమాల్లోకి వచ్చాను. అప్పుడే పది సంవత్సరాలు గడిచిపోయాయా? అనిపిస్తోంది. కాలం చాలా త్వరగా గడిచిపోతోంది.

**మీ వ్యక్తిగత ఫొటోల లీక్ గురించి...?**

దాని గురించి మాట్లాడడానికి ఇది సరైన సమయం కాదు. ఆ ఫొటోలు ఎవరు లీక్ చేశారన్నది తేలిన తరువాతే మాట్లాడతాను. ఫొటోలు లీక్ చేశారంటున్న వ్యక్తితో నాకు ఎలాంటి విభేదాలు లేవు. అలాగని మంచి స్నేహితులం అని కూడా చెప్పలేను. ఆ ఫొటోలు ఎందుకు ఏ ఉద్దేశంతో బయట పెట్టారో నాకు తెలియదు.

**మీ దత్తత పిల్లలు ఎలా ఉన్నారు?**

అందరూ బాగున్నారు. అందరూ తెలివైన పిల్లలే. కొద్దిగా చేయూతనిస్తే చాలు వారేంటో నిరూపించుకుంటారు. ప్రస్తుతం నేను చేస్తున్న పని అదే! వారితో ఉంటే టైమే తెలియదు.

**అనాథలను దత్తత తీసుకోవాలన్న ఆలోచన ఎలా వచ్చింది?**

నా ఆలోచనలకు కారణం మా అమ్మ. అనాథలకు సహాయం చేయాలని ఎప్పుడూ చెబుతూ ఉంటుంది. ఆవిడ మాటలే నాకు ప్రేరణ కలిగించాయి. నా పిల్లలను మా అమ్మ నాకన్నా భాగంగా చూసుకుంటుంది.

**ఈ సంవత్సరం మరికొంత మందిని దత్తత తీసుకోబోతున్నారా?**

ఆలోచన అయితే ఉంది. కాకపోతే స్థలాభావం గురించి ఆలోచిస్తున్నాను. ఎక్కువ మందిని కాకుండా కొంతమందిని అయినా దత్తత తీసుకుంటాను.

**పెళ్ళి తరువాత కూడా ఈ సేవాకార్యక్రమాలు కొనసాగిస్తారా?**

పెళ్ళికే ఇంకా చాలా టైముంది. సేవాకార్యక్రమాలను కొనసాగించాలా? వద్దా? అన్నది అప్పుడు ఆలోచిస్తాను. అయినా సేవాకార్యక్రమాలకు పెళ్ళి అడ్డు అవుతుందని నేను అనుకోను.

**తెలుగులో చేస్తున్న సినిమాలు?**

గోపీచంద్‌గారితో చేస్తున్నాను. కథలు వింటున్నాను కానీ, వేటికీ ఓకే చెప్పలేదు. తమిళంలో కూడా అంతే! కొంత కాలం రిలాక్స్ అవుదామని ఉంది.

**రిలాక్స్ అయితే హీరోయిన్ రేసులో వెనుకబడిపోతారేమో?**

ముందే చెప్పానుగా? రేసులు, నెంబర్ గేమ్‌ల మీద నాకు నమ్మకం లేదు. కొంత గ్యాప్ తీసుకున్నా నా సినిమాలు నాకు ఉంటాయి. ఆ భయం నాకు లేదు.

—చిన్ని

ఇంటర్వ్యూ

# ఏఎన్నార్ బడి... ఎన్టీఆర్ గుడి

-ప్రభ

**నాలుగు దశాబ్దాలుగా తెలుగు, తమిళ, కన్నడ, మలయాళ భాషల్లో వందకుపైగా చిత్రాల్లో నటించారు ప్రభ. హరికథాకళాకారిణి, నర్తకి. అంతకుమించి కామెడీ, జానపద, పౌరాణిక చిత్రాలతోపాటు పేథస్ పండించిన పాత్రలు చేసిన తిరుగులేని నటి. ఇద్దరు నట చక్రవర్తులు ఎన్టీఆర్, ఏఎన్నార్‌లతో చేసిన అదృష్టశాలి, నంది అవార్డుల నటి ప్రభ ఇంటర్వ్యూ.**

కవులు, కళాకారులు, రాజకీయ నాయకులకు నిలయం గుంటూరుజిల్లా, తెనాలిలో జన్మించాను. మా నాన్నగారు ఎన్.కె.ఎస్.రావు, అమ్మ శ్రీరావమ్మ. అమ్మా నాన్నా పెట్టిన పేరు జయప్రభ. తర్వాత కోటి సూర్య ప్రభ అని పిలిచారు. సినిమారంగం లోకి వచ్చాక ప్రేక్షకుల హృదయాల్లో ప్రభగా నిలిచి పోయాను.

నా చదువు ఏడవ తరగతివరకే. అప్పట్లో ఆరేళ్ళు వచ్చేవరకు స్కూలుకు పంపేవారు కాదు. మాది సంప్రదాయ కుటుంబం. పెద్దవాళ్ళు ఆడపిల్ల లంటే శ్రద్ధగా ఉండేవారు. బడికి పంపేందుకు ఒప్పుకునేవారు కాదు.

## హరికథ, నాట్యం, గాత్ర సంగీతం

నా ఒత్తిడి వల్ల నన్ను బడిలో చేర్చారు. స్కూల్లో చేరానుగానీ, ఏ క్లాసులో కూర్చోవాలనే సందిగ్ధం వచ్చింది. కొందరు మాస్టర్లు ఇంటికివచ్చి సైన్సు, సంస్కృతం, తెలుగు, ఇంగ్లీషుపాఠాలన్నీ ఇంట్లోనే నేర్పేవారు. తెనాలిలో తాలూకా పాఠ శాలలో 5 ,6, 7 తరగతులు చదువుతూ హరికథలో శిక్షణ పొందాను.

ఏడవ తరగతిలో, చదలవాడ నారాయణరావు గారి దగ్గర కూచిపూడి నృత్యం నేర్చుకున్నాను. ఒకవైపు నాట్యం, మరోవైపు హరికథలో మంచి ప్రావీణ్యం పొందాను. పాటలు బాగా పాడేదాన్ని. నా పన్నెం డవ ఏటే స్టేజీమీద హరికథలు చెప్పేదాన్ని. పాటల ఒత్తిడివల్ల నోట్లోంచి రక్తం పడేది. డాక్టర్లు టాన్సిల్స్ ఆపరేషన్ చేసినప్పటినుంచి హరికథలు, పాటలు తగ్గించాను. నాట్యం కొనసాగించి మంచి ప్రావీణ్యం పొందాను.

## నీడలేని ఆడది

నా మొదటి సినిమా 'నీడలేని ఆడది'. పేపర్లో ప్రకటన చూసి ఇంటర్వ్యూకి వెళ్ళాను. నేను లాస్ట్ బ్యాచ్. అప్పటికే ఎంపికలైపోయాయి. కానీ ఆ సినిమా టీమ్ మొదట సెలక్ట్ చేసిన అమ్మాయిని రిజెక్ట్ చేసి మళ్ళీ లాస్ట్‌బ్యాచ్‌ని పిలిచారు. స్క్రీన్ టెస్ట్‌లో నన్ను ఓకే చేశారు. ఆ చిత్రంలో నరసింహ రాజు, నేను, అన్నపూర్ణ, పి.యల్.నారాయణ, వంకా యల సత్యనారాయణ, మిశ్రో, కృష్ణ చైతన్య.. అందరం కొత్తవాళ్ళమే. అందుకే భయం లేకుండా నటించాం. 1974లో వచ్చిన ఆ హిట్ చిత్రంతో నా పేరు మారు మోగిపోయింది. తర్వాత అమ్మాయిలూ జాగ్రత్త, కొల్లేటికాపురం చిత్రాలు చేశాను. ఈ రెండూ 1975, 1976లో వచ్చాయి. కృష్ణగారు నేను నటించిన కొల్లేటి కాపురం ఎంతో విజయవంతమైంది.

## ఇదెక్కడి న్యాయం

దాసరి నారాయణరావుగారి హిట్ చిత్రాల్లో ఒకటి 1977 నాటి 'ఇదెక్కడి న్యాయం'. ఇందులో నా నటనకు మంచిపేరు వచ్చింది. మురళీమోహన్, నేను హీరోహీరోయిన్లం. మోహన్‌బాబు, నరసింహ రాజు, జయసుధ కూడా ఉన్నారు. ఎ.సి.త్రిలోక్ చందర్‌గారు తమిళ్‌లో 'పెన్‌జన్మమే' పేరిట తీసిన ఈ చిత్రంలో కూడా నేనే చేశాను. డబ్బింగ్ నాదే.



దీనికి తమిళనాడు ప్రభుత్వ అవార్డు అందుకున్నాను. ఇదెక్కడి న్యాయం సిన్మాని దాసరిగారు హిందీలో 'ఏ కైసా ఇన్సాఫ్'గా తీశారు. నా పాత్రను హిందీలో షబానాఆజ్మీ చేశారు. ఇదెక్కడిన్యాయం థియేటర్లలో ఆడుతుండగానే ప్రసాద్‌స్టూడియోలో ఒకవైపు తమిళ్‌లో నాతో, మరోవైపు హిందీలో షబానా ఆజ్మీతో ఇదే చిత్రాన్ని ఏక కాలంలో రీమేక్ చేయడం ఆ రోజుల్లో గొప్ప విశేషం. దీని తర్వాత నాకు కన్నీరు ప్రాధాన్యంగల క్యారెక్టర్లే వచ్చినప్పటికీ, తర్వాత విభిన్నమైన పాత్రలు చేశాను.

## చంద్రమోహన్‌తో కామెడీజోడీ

సంసారంలో సరిగమలు, సీతాపతిగారి సంసారం, ఇల్లంతా సందడి, ఇంటింటి రామాయణం... ఇవన్నీ సూపర్‌హిట్ కామెడీ చిత్రాలు. అన్నీ వంద రోజులు ఆడినవే. నాకు జోడీగా ఎక్కువ చంద్రమోహన్ చేశారు. టాప్ హీరోల చిత్రాల్ని తట్టుకుని వాటి మధ్య మా సినిమాలు హిట్ కొట్టేవి. ఎందుకు చెబుతున్నానంటే, కామెడీ చేయడం చాలా కష్టం. మరే పాత్రలైనా ఈజీగా చెయ్యవచ్చు. ఎంతో కష్టపడి ఇష్టంగా కామెడీ పాత్రలు చేసేదాన్ని. అదే సమయంలో క్లాసిక్ చిత్రం 'సంధ్యారాగం'లో గిరిబాబు గారి పక్కన సీరియస్ క్యారెక్టర్ చేయాల్సి వచ్చింది. శరత్‌బాబు హీరో. 1981నాటి ఈ చిత్రానికి అభినందనల వర్షం కురిసింది. ఆ సబ్జెక్ట్‌ను ఎటెంప్ట్ చేయడమే కష్టంగా ఉండేది. అప్పటికే పాత్రలో ఎంతో లీనమై నటించాను. అన్నీ సీరియస్ డైలాగ్సే. జానపద బ్రహ్మ విఠలాచార్యగారి 'జగన్మోహిని'లో గంధర్వ కన్యగా నటించడానికి నన్ను ప్రత్యేకంగా పిలిపించారు. ఆ సమయంలో మరో రెండు సినిమాలు చేతిలో ఉన్నాగానీ, మా దర్శకుల్ని ఒప్పించి నన్ను తీసుకున్నారు. ఇది సూపర్‌హిట్ చిత్రం. తమిళ్, హిందీలో కూడా 100 రోజులు ఆడిన చిత్రమిది. తమిళంలో ఇంకా ఎక్కువ సక్సెసైంది. జయమాలిని కిదే తొలి చిత్రం.

## దాసరిగారి చిత్రాలు

దాసరి నారాయణరావుగారి దర్శకత్వంలో దాదాపు పదికి పైగా చిత్రాల్లో నటించాను. బండోడు గుండమ్మ, తాండ్రపాపారాయుడు, పెద్దిల్లు –చిన్నిల్లు వీటిల్లో ముఖ్యమైనవి. పెద్దిల్లు–చిన్నిల్లు లో, 'పచ్చబొట్టు పొడిపించు బావ..., అనే కామెడీపాట ఆ రోజుల్లో సెన్సేషన్. కృష్ణ, జయప్రద నటించిన 'బండోడు గుండమ్మ'లో నా నటనను దాసరిగారు ప్రత్యేకంగా అభినందించారు. నరసింహరాజుతో మొదలుపెట్టి చంద్రమోహన్, భానుచందర్, మురళీమోహన్, రంగనాథ్, గిరిబాబు, కృష్ణ, మోహన్‌బాబు, కృష్ణంరాజు, అగ్రతారలు ఎన్.టి.ఆర్, ఏ.ఎన్.ఆర్‌లతో నటించాను. బహుశా ఏ నటీ ఇంతమంది హీరోలతో నటించలేదనుకుంటున్నాను.

## కెరీర్‌ను పరిపుష్టం చేసిన చిత్రాలు

ఇదెక్కడి న్యాయం షూటింగ్ సమయంలో ఎన్.టి.రామారావుగారి దాన వీర శూర కర్ణ చిత్రంలో నేను నటించాను. కామెడీతో పాటు, జానపద, పౌరాణిక చిత్రాల్లో కూడా ఆఫర్లు వచ్చాయి. ఆ దేవుడి దయవల్ల అలా విభిన్న పాత్రలు చేసే అదృష్టం లభించింది. దాన వీర శూర కర్ణ చిత్రంలో ఎన్టీఆర్‌గారితో చిత్రం భళారే విచిత్రం...అంటూ చేసిన శృంగారభరితమైన పాటలో నా నటనను ఎందరో కొనియాడారు.

మహాకవి క్షేత్రయ్యలో అక్కినేనిగారితో చేసిన జాబిల్లి పాత్రలో 'నిన్నూ నన్నూ...అనే యుగళగీతం గాయకుడు రామకృష్ణగారికీ, కథానాయకిగా నాకూ కలిసొచ్చిన అదృష్టమని ప్రేక్షకులు సర్టిఫై చేశారు. నా సినీ జీవితంలో ఈ రెండు చిత్రాలూ నా కెరీర్‌ను ఎంతో పరిపుష్టం చేశాయి. ఇలా ఇద్దరు నట చక్రవర్తులతో నేను నటించడం చాలామందికి లభించని అరుదైన అవకాశం. నా పూర్వజన్మ సుకృతం. అక్కినేనిగారితో నటిస్తుంటే ఒక బడిలో ఉన్నట్టే ఉంటుంది. ఆయన మెళకువలు చెపుతూ మనలో భయం పోగొట్టి ప్రోత్సహించేవారు. మేం ఒకసారి మాట్లాడుకుంటుంటే పెద్దపెద్ద లైట్స్ స్లిప్ అయ్యి మా కుర్చీల దగ్గర పడ్డాయి. ఒక ఇంచ్ తేడాతో మాకు చావు తప్పి కన్నులొట్టపోయినంతపనైంది. అక్కినేని గారు ఎప్పుడైనా కనిపిస్తే 'తలబొప్పి కట్టిందా' అని అడిగేవారు నవ్వుతూ. అదేవిధంగా ఎన్.టి. రామారావుగారితో షూటింగ్ చేసినప్పుడు దేవాలయంలో ఉన్న ఫీలింగ్ కలిగేది.




## సూపర్‌స్టార్ కృష్ణతో

సూపర్‌స్టార్ కృష్ణగారితో 'పగబట్టిన సింహం' లో నటించాను. బెల్‌ప్యాంటూ, షర్టులో ఉండే లేటెస్ట్ రెబల్ గెటప్ పాత్ర. ఇందులో కృష్ణ త్రిపాత్రాభినయం. నేను, గీత, జయప్రద ముగ్గురు హీరోయిన్లం. కృష్ణగారి లవర్ గాళ్ పాత్ర. నా ఫైట్ సీన్ కూడా ఉంటుంది. ఆ రోజుల్లో ఎం.వి.సుబ్బరాజు గారి కథలు కుటుంబ సమేతంగా చూడదగ్గ కథలుగా ఉండేవి. ఆయన నిర్మాత, దర్శకులు కూడా. 1982 నాటి హిట్ చిత్రమిది.

'అల్లుడొచ్చాడు' చిత్రం మరో కలికితురాయి. లేతకొబ్బరినీళ్ళలే/పూత మామిడి పిందలే...అనే పాటకు నేను వేసిన స్టెప్పులకు మంచి రెస్పాన్స్ వచ్చింది. ఉత్తరాలమీద ఉత్తరాలు వచ్చాయి. కళ్ళు చిలిపిగా తిప్పడం, బుంగమూతి పెట్టడం...నా నటనతోపాటు చక్కని సాహిత్యమున్న పాట. 1976 నాటి ఈ సూపర్‌హిట్ చిత్రం మలయాళం రీమేక్‌లో నా పక్కన కమల్‌హాసన్ చేశారు. మలయాళంలో నా రెండు చిత్రాలూ ప్రేక్షకాదరణ పొందినవే.

## దేవతల పాత్రలు

లక్ష్మీదేవి, పార్వతి, అనసూయ వంటి దేవతల పాత్రలు కూడా పోషించాను. తెలుగులో అష్టలక్ష్మీ వైభవం, కచదేవయాని చిత్రాల్లో తమిళంలో 'త్రిపురసుందరి', ఆయిరం కన్నుడయాల్ .... ఇలా తెలుగు, తమిళంలో పదిహేను చిత్రాలవరకు దేవతల పాత్రలు పోషించాను.

## సావిత్రిలా చేశావని మెచ్చుకున్నారు

సావిత్రమ్మగారు నటించిన 'నాదీ ఆడజన్మే' చిత్రంలో ఆవిడ పాత్రను మలయాళంలో నేను చేయడం నా అదృష్టం. అదెంత గొప్ప విశేషమో మాటల్లో చెప్పలేను. నల్లరంగు మేకప్ వేసుకుని నటిస్తుంటే అచ్చం సావిత్రిలా చేస్తున్నావని ఎందరో ప్రశంసించడం మరచిపోలేను. ఈ చిత్రంపేరు 'న్యానూర్ తన్నానా'. మలయాళంలో 'రౌడీరాజమ్మ' పక్కా మాస్ క్యారెక్టర్ చేశాను. 1977లో వచ్చింది.

